

ననుదరియురాకు మోహకపటీ!



ఛాయాచిత్ర వారి

# మంచి మనిషి

డైరెక్టర్
కె.ప్రత్యగాత్మ

ప్రొడ్యూసర్
కె.సుబ్బరాజు

మ్యూజిక్
యస్.రాజేశ్వరరావు
టి.చలపతిరావు

వాణీ రిలీజ్



REVATHI

# ఈ సంచికలో



ముఖచిత్రం 'యశోదా నందనుడు'

చిత్రకారుడు వడ్డాది పాపయ్య




ఆగష్టునెల సంచికలో శ్రీ చదరంగారు రచించిన "వసంత" అను కథ చాలా బాగున్నది. వారికి నా అభివందనములు. కథ చదివినవారి మనసుకు చాలా ఆనందము కలిగించుచున్నది.

వడ్డాది పాపయ్యగారు చిత్రించిన బొమ్మలు చాలా బాగుగాయున్నవి.

కె. హరనాదబాబా
గజపతినగరం

ఆగష్టునెల పత్రిక. ముఖచిత్రం, (అట్టవెనుక చిత్రంతోసహా) అభిసారికలు శ్రీ వ. పా. గారికళ్ళజ్ఞతను, మీ పత్రిక ప్రతిష్ఠను ఇనుమడింపజేయగల వని నా హృదయపూర్వకమైన విశ్వాసం.

ఎమ్. పి. రెడ్డి,
తేలప్రోలు.

"వసంత", "ఉషాబాలకథ" యువకు ఎంతో నిండు నిచ్చినవి. రచయితలకు నా కృతజ్ఞత.

మునగా వెంకటేశ్వరరావు
విజయవాడ

బంకిమ్‌చంద్ర ఛటర్జీగారి 'రజని' సంక్షిప్త నవల గంగాధర్ చిత్రాలతో, ముప్పాళ రంగనాయకమ్మ గారి 'నాకు చచ్చిపోవాలని వుంది' కథ బాపు బొమ్మలతో వచ్చే సంచికలో వెలువడుతాయి.

*మీ కాపీ, యువ ఏజంటు దగ్గర రిజర్వు చేసుకోండి.*

విడి ప్రతి - రు. **1-00**

— సంపాదకుడు.

ఆగష్టు "యువలో వ సం త క థ చాలా బాగున్నది. మూర్తి, వసంత పాత్రలు బాగా సృష్టించి కథకు జీవం పోశారు. రచయిత శ్రీ చదరంగారికి నా హృదయ పూర్వక అభివందనములు. ఇటువంటి ఉత్తమకథలు నెలనెలా అందిస్తున్న మీరు ఎంతో అభినంద నీయులు.

వి. బాలకేశవులు
కర్నూలు

ఆగష్టునెల సంచికలో "వసంత" అనే కథ చాలా రమ్యంగానూ, ఉదాత్తంగాను వుంది. రచయితకు నా ధన్యవాదాలు.

యతీంద్ర మోహన సింహా గారి 'సంధి' నన్నెంతో ఆకర్షించింది.

వి. కృష్ణమూర్తి,
పలమనేరు

ఆగష్టుసంచికలోముఖ్యంగా "వసంత" కథ "ఉషాబాలకథ", హృదయాల్లో హత్తుకుపోయే రచనలు. రచయితలకు నా "హార్టీ థాంక్స్".

యస్. జి. వి. సరస్వతి
(జగపతినగరం)

## యువ చందా వివరాలు

| | |
|---|---|
| సాలుచందా | 12-00 |
| సాలుచందా దీపావళి ప్రత్యేకసంచికతోసహా | 16-00 |
| రెండుసంవత్సరముల చందా (దీపావళి ప్రత్యేక సంచికతో) | 30-00 |
| దీపావళి ప్రత్యేక సంచిక | 4-00 |

యువ ఆఫీసు: పబ్లిక్ గార్డెన్ రోడ్, హైద్రాబాద్-1.

తప్పక చూడండి!

ప్రప్రథమంగా ఆంధ్ర చలన చిత్ర
రంగంలో త్రి పాత్రాభినయం.

విశాలాంధ్ర ప్రజానీకాన్ని విచిత్రాలతో కవ్వించి వినోదాల తో
నవ్వించే









శ్రీదేవి పిక్చర్స్

వారి

# దొంగలు దొరలు

[తెలుగు]

దర్శకత్వం

B.R. పంతులు

పూర్ణా రిలీజ్

STUDIO Ketty

NAVARI

# యువ
## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 10 సెప్టెంబరు 1964 సంచిక 3

మహా మేధావులు కొంతమంది మంత్రులుగా వుండవచ్చును గాని మంత్రిపదవి వచ్చినవా రంతా తాము మహా మేధావుల మని అనుకోవడం. మాయలో పడి కొట్టుకులాడడమే అవుతుంది మంత్రిపదవి వచ్చినంత మాత్రాన. ప్రజాభిప్రాయాన్ని తృణీకరించడం. తమ పరిపాలనలో వున్న ప్రజలలో కొందరి శ్రేయస్సుకోసం మాత్రమే కృషి చెయ్యడం. మరికొందరి శ్రేయస్సును గమనించకపోవడం ఒక అపరాధం అవుతుంది

ప్రాంతీయాభిమానం ప్రతి వ్యక్తికీ వుంటుంది ఒక రాష్ట్రంనుంచి. కేంద్ర ప్రభుత్వ మంత్రిగా వెళ్ళిన ఏవ్యక్తి అయినా తన రాష్ట్రాభివృద్ధికి కృషి చెయ్యడం కొంతవరకు సహజమే. దీనిని ఒక మహాపరాధంగా ప్రజలు పరిగణించరు కాని. తన రాష్ట్రాభివృద్ధి విషయంలో ఎలాటి స్కీములనైనా అవసరమైన వాటిగా భావించడమూ. తక్కిన రాష్ట్రాలలో అవసరమైన స్కీములను గూడా అక్కరలేని వానిగా త్రోసివెయ్యడం ప్రజలకు బాధ కలిగిస్తుంది

ఈ మధ్య. కేంద్రప్రభుత్వ ఆర్థికశాఖా మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి మదరాసు రాష్ట్రంలో పర్యటించారు. దక్షిణదేశంలో వీరి కొక మహాజరు సమర్పింప

బడింది. దానిలోని విశేష్మేమిటంటే, మదరాసు నగరంనుంచి కన్యాకుమారి వరకు, తూర్పు సముద్రతీరంలో సుమారు 480 మైళ్ళ దూరం ఒకకొత్త ట్రంకు రోడ్డు నిర్మించడానికి కేంద్రప్రభుత్వం డబ్బు గ్రాంటుచెయ్యాలనే కోరిక ఈ అభ్యర్థనకు శ్రీ కృష్ణమాచారి తమ ఆమోదాన్ని తెలియపరచా రనీ. ఇలాంటి ప్రతిపాదనను రాష్ట్రప్రభుత్వం చేసినట్లయితే, డబ్బును గ్రాంటు చేసే విషయంలో సానుభూతితో పరిశీలిస్తా మని అన్నా రనీ వార్త

కేంద్రప్రభుత్వ ఆర్థికమంత్రి పదవి, దేశప్రజ లందరి జీవితాన్నీ పిడికిటిలో పట్టుకున్న పదవి ఏ రాష్ట్రంలో ఏ అభివృద్ధి పథకానికి డబ్బు కావాలన్నా, కేంద్ర ప్రభుత్వ ఆర్థికమంత్రి చేతినుంచి రావలసిందే ఈ మంత్రి సానుభూతి వున్నదంటే ఏ పథకమైనా, ఎంత ఖర్చుతో కూడుకున్నదైనా నిరాటంకంగా సాగిపోతుంది శ్రీ కృష్ణమాచారి, సానుభూతితో పరిశీలిస్తా నన్నారంటే, మదరాసునుంచి కన్యాకుమారివరకు మరొక ట్రంకురోడ్డు సిమెంటుదో, తారుదో, పడ్డట్టే లెక్క. ఈలాటి రోడ్డుకు సుమారు పదికోట్ల రూపాయలు అవుతుందట అంటే, పదికోట్ల రూపాయల వ్యయంతో, అతిస్వల్పకాలంలోనే మదరాసు రాష్ట్రంలో మరొక చక్కని రోడ్డు, 480 మైళ్ళు పడుతుందన్న మాట

ఇప్పుడు మదరాసునుంచి కన్యాకుమారికి రోడ్డు లేదనికాదు చక్కని ట్రంకు రోడ్డే వుంది అయితే, ఇది తూర్పుతీరాన లేదు రాష్ట్రంలోని అనేక ముఖ్యనగరాలను కలుపుతూ, రాష్ట్రం మధ్యలో వుంది ఇది లారీ సర్వీసులవారికి, దూరప్రయాణాలకు అంతకిట్టుబాటు చేసే రోడ్డుకాదు లారీ సర్వీసులు చాలా ఎక్కువగా వున్న యీ రోజులలో, సరకుల రవాణాకు ఇప్పుడున్న రోడ్డు కాక మరొకరోడ్డు, చుట్టుదారి కాకుండా వున్నట్టయితే, లారీ సర్వీసులకు లాభకరంగా వుంటుంది అంచేత, శ్రీ కృష్ణమాచారికి, యీ అభ్యర్థన చేయబడింది తక్కిన రాష్ట్రాలలో కొన్నిటికి సరియైన రోడ్డుసదుపాయాలే లేవని తెలిసికూడా, శ్రీ కృష్ణమాచారి యీ అభ్యర్థనకు తమ ఆమోదాన్ని తెలియపరచా రంటే ఏమనుకోవాలి ?

మన రాష్ట్రం అన్ని సదుపాయాల లోనూ వెనుకబడివుంది ట్రంకురోడ్లు అని చెప్ప బడుతున్న రోడ్లు కూడా మోటారుకార్ల ప్రయాణానికి అనుకూలంగా

లేవు. అన్నిటికన్న పెద్ద ఇబ్బంది, గోదావరి నదిమీద రోడ్డుబ్రిడ్జి లేకపోవడం. మదరాసు నుంచిగాని, విజయవాడ నుంచిగాని, చివరకు కొవ్వూరు నుంచిగాని రాజమండ్రికి, కారులోగాని బండిమీదగాని ప్రయాణం చెయ్యడానికి వీలులేని పరిస్థితి మనది. ఇప్పుడు గోదావరి నదిమీద వున్న రైల్వే బ్రిడ్జికూడా చాలా పాతది. అంచేత ప్రజల అభ్యర్థనను మన్నించి, రైళ్ళ ప్రయాణానికి ఎక్కువ వసతి కల్పించడానికి వీలును గుర్తించి, గోదావరి మీద, రోడ్డు, రైలు బ్రిడ్జిని నిర్మించ డానికి రైల్వేమంత్రి శాఖ అంగీకరించింది. దీనికి అయ్యే ఖర్చు, రెండుకోట్ల రూపాయలు మాత్రమే. అయినా, తాను ఆర్థికమంత్రిగా వుండగా యీ బ్రిడ్జి నిర్మా ణానికి డబ్బు ఇవ్వడం జరగదని శ్రీ కృష్ణమాచారి అన్నారని వార్త. ఈ వార్త నిజ మైతే, వారి ధోరణి చాలా శోచనీయమైన విషయం. విస్తారంగా రోడ్లు వున్న మదరాసు రాష్ట్రంలో, మదరాసు నుంచి కన్యాకుమారికి మరొక ట్రంకురోడ్డు వెయ్య డానికి అనుమతి సూచించిన శ్రీ కృష్ణమాచారి, దీనికి అయ్యే వ్యయంలో అయిదో వంతు, బండ్లకూ, కార్లకూ, లారీలకూ, రైళ్ళకూ కూడా పనికివచ్చే వంతెనను గోదావరిమీద నిర్మించడానికి విముఖత చూపడం, మహా మేధావితనమా ? లేక, తెలుగువారి అవసరా లంటే తృణీకారభావమా ?

గోదావరి వంతెనకు రెండుకోట్ల రూపాయలూ గ్రాంటు చేసి తీరా లని, కేంద్ర ప్రభుత్వంలోని ఆంధ్ర మంత్రులూ, ఆంధ్రప్రదేశ్ మంత్రిమండలీ పట్టుపట్టాలి. పట్టుబట్టి ఆందోళన చేస్తేగాని మన అవసరాలు తీరేటట్లు లేవు.

ఆంధ్రదేశంలో అభివృద్ధి కార్యక్రమాలకూ, పరిశ్రమల అభివృద్ధికీ, మదరాసు రాష్ట్రం మాటిమాటికీ అడ్డు తగులుతూవుంది. ఉక్కు ఫాక్టరీ నిర్మాణం విషయంలో కూడా అంతే.

విశాఖపట్టణం వద్ద బైలదిల్లావద్ద మంచి ముడి ఖనిజం దొరుకుతున్నది. ఇక్కడి ఖనిజంలో, నూటికి 66 వంతులు మంచి ఇనుము వున్నదని పరిశోధనలవల్ల తేలింది. ఇక్కడ ఒక ఉక్కు ఫాక్టరీని స్థాపించ వచ్చును. కానీ దీనికి సేలం పోటీ వచ్చింది. సేలందగ్గరదొరికే ఖనిజంలో నూటికి 35 పాళ్ళే మంచి ఇనుము. అయినా, సేలంలో

ఉక్కు ఫాక్టరీని స్థాపించమని మదరాసు ప్రభుత్వం పట్టు పడుతున్నది. సేలంలో ఉక్కు ఫాక్టరీ పెట్టిన తరువాత, అక్కడి ఖనిజం ఉపయోగం తక్కువ గనుక, బైల దిల్లా నుంచి ఖనిజాన్ని సేలం ఫాక్టరీకి పంపవలసిందని మదరాసు కోరుతుంది. అప్పుడు మనం చేసేది ఏమీలేదు. కిక్కురు మనకుండా, మన ఖనిజాన్ని మదరాసుకు పంపి, అక్కడి పరిశ్రమాభివృద్ధి తోడ్పడవలసిందే. సదుపాయాలు లేకపోయినా, ముందు పరిశ్రమలను స్థాపించడం, తరువాత సదుపాయాల కోసం ఆందోళన చేసి, వాటిని సంపాదించడం మదరాసు రాష్ట్ర ప్రభుత్వ విధానం. పద్దెనిమి దేండ్లగా, యీ విధానం బహు జయప్రదంగా సాగిపోతున్నది.

ఎన్నో పరిశ్రమలు స్థాపించడానికి సదుపాయాలు వున్నా, పరిశ్రమల స్థాపనలో మనం వెనకబడివున్నాము. విశాఖపట్టణంలో ఉక్కు ఫాక్టరీ స్థాపింపబడినట్లయితే, ఆ జిల్లాలలో ఎన్నో చిన్న పరిశ్రమలు తల యెత్తడానికి అవకాశం వుంది. మేలిరకపు ముడి ఇనుము పెట్టుకొని కూడా, ఉక్కు ఫాక్టరీని సంపాదించుకోలేకపోతే, ఎన్నటికీ మనం బాగుపడం.

ఇరుగు పొరుగు రాష్ట్రాల వారికి అసూయ పుట్టి వారు బాధ పడ్డాసరే, విశాఖపట్టణం వద్ద ఉక్కు ఫాక్టరీని మనం సాధించి తీరాలి. ఈ విషయంలో కూడా, మన రాష్ట్ర ప్రభుత్వమూ, మన రాష్ట్రంలోని పార్లమెంటు సభ్యులూ, కేంద్ర మంత్రి మండలిలోని ఆంధ్రమంత్రులూ గట్టి కృషి చెయ్యాలి.






బొమ్మలకే ప్రాణాలొస్తే

# చిత్రవార్తలు



డా॥ రాధాకృష్ణన్, శ్రీమతి ఇందిరాగాంధి, శ్రీ సి. ఆర్. పట్టాభిరామన్‌గారలు న్యూఢిల్లీ - రవీంద్ర భవన్‌లో 'నెహ్రూ దృక్పథము - గమ్యము' ప్రదర్శనశాలను తిలకిస్తున్నారు.



మన రాష్ట్రపతి జులై 29 న న్యూఢిల్లీ రవీంద్రభవన్‌లోని
'నెహ్రూ దృక్పథం - గమ్యము' ప్రదర్శనశాలలోని చిత్రాలు వీక్షిస్తున్నారు.



మన ముఖ్యమంత్రి. శ్రీ చెస్టర్ బౌల్స్ హైదరాబాదు నందలి 'ఫేర్ లాండ్స్' భవనంలో ఆగస్టు 10 న కలుసుకున్నారు.



ప్రధాన మంత్రి శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి న్యూఢిల్లీలో ఆగస్టు 8 న విలేఖరుల సమావేశంలో ప్రసంగిస్తున్నారు.



సాంస్కృతిక వ్యవహారాల మంత్రి శ్రీ ఆర్. ఎన్. హజార్‌నావిస్ ఢిల్లీలో సంచార గ్రంథాలయానికి జులై 24 న ప్రారంభోత్సవం చేశారు.



దేశాభివృద్ధికొరకు — విద్యుచ్ఛక్తి సరఫరా.
హిమాచలప్రదేశ్ పవర్ హౌస్.




జ రి గి న క థ

[ చిన్నతనంలో పాఠశాలలో చదువుకునే రోజుల్లో పిల్లలమధ్య ఎన్నో భేదాభిప్రాయాలూ ఈర్ష్యలూ ఉంటాయి కాని కిశోర్‌లో వున్న సద్గుణాలు శంకర్‌ను దగ్గరచేసి ఇద్దరి మధ్యా స్నేహానుబంధం ఏర్పడింది కాని పరిస్థితులు కారణంగా ఇద్దరూ విడిపోయి క్రమేణా ఎంతో దూరం అయిపోయారు అకస్మాత్తుగా మళ్ళీ వాళ్ళు కల్సుకోవడం కలకత్తాలో కిశోర్ మెడిసిన్ చదువుతూ శంకర్ లా చదువుతూ ఉండగా ఏదో ఆప్యాయతా – ఎంతో దగ్గరైనట్లుగా అన్పించిం దిద్దరికీ

శంకర్ ఆహ్వానంపై శంకర్ చెల్లెలు ప్రమీలను చూడ్డానికి పోయి ఆమెతోబాటు ఆమె భర్త సుకుమార్‌నుకూడా కలుసుకుంటారు సుకుమార్ చెల్లెలు నీహారికను కూడా అక్కడ చూస్తారు నీహారిక స్త్రీలకు స్వాతంత్ర్యం హక్కులూ ఉండాలనే తత్త్వం గలది. వాటిపై ఆమె వ్రాసిన వ్యాసాలుకూడా ప్రచురితమయ్యాయి

కిశోర్ ఉబుసుపోకకు రచయితయ్యాడు నీహారిక వ్యాసాలు చూచి ఎనాటమీ, ఫిజియాలజీలమీది ఇచ్ఛకొద్దీ యీవ్యాసాలకు విమర్శలువ్రాశాడు. ప్రచురింపబడ్డాయి ]

— ఇక చదవండి

**2**

ఒకనాడు మా అన్నయ్య సాయంత్రం షికారునించి తిరిగివచ్చి – "నీరూ! నీకొక కానుక తెచ్చాను ఇవ్వాళ – ఇదుగో" అని భారత ప్రభ పత్రిక నాకిచ్చాడు నేను పత్రిక మొదటి పేజీ తిప్పి విషయసూచికలో 'స్త్రీవిద్య–దాని ఫలితాలు' అనే వ్యాసం ఉండడంచూసి, గబగబా ఆ వ్యాసం చదివేశాను చదువుతుంటే నా వొళ్ళు మండిపోయింది రచయిత ఇలా అంటున్నాడు

."పాశ్చాత్య దేశాల ననుసరించి మన దేశంలో బయలుదేరిన స్త్రీ విద్యా ప్రచారఫలితం మనకు శుభప్రదం కాదు ఆ దేశా లన్నీకూడా వీటి విషమ ఫలితం అనుభవిస్తూనే ఉన్నై. చదువుకున్న స్త్రీలు అన్ని విషయాల్లో పురుషు లతో పోటీచేయా లని చూస్తున్నారు వాళ్ళకు పెళ్ళి అక్కర్లేదు పిల్లల్ని కనటానికికానీ పెంచటానికిగానీ వారు వొప్పుకోరు విలాసాల్లో మునిగి తేలుతున్నారు హాయిగా కుటుంబంతో ఉండటానికి బదులు, హోటల్లో ఉండ టానికి ఇష్టపడుతున్నారు స్త్రీలకు ఇంత సంపూర్ణస్వాతంత్ర్యం ఉండటం సమా జానికి మేలుకాదు 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అని మనువు చెప్పింది అక్ష రాలా సత్యం ఇంటో ఉండటం, భర్త సేవ, పిల్లల్ని సాకటం, ఇంటో వారి పరి చర్యా, ఇవే మన స్త్రీలధర్మాలని మన శాస్త్రాలూ, మనమూ వొప్పుకున్నాము పాశ్చాత్య విద్య చదివి, మన హిందూ స్త్రీలు వారి పురాతనధర్మాలు వదిలి స్వాధీనలై కూర్చుంటే, మన సంఘానికి పతనం ఆరంభ మైనదని మనం నిశ్చ యంగా చెప్పవచ్చు-" మొదలైనవి

ఈ వ్యాసానికి రచయిత ధైర్యంలేక తన పేరు ఇవ్వలేదు - దివాకరశర్మ అని మారుపేరు పెట్టుకున్నాడు

నేను వ్యాసం చదవటం పూర్తిచేసిన తర్వాత అన్నయ్య అడిగాడు "ఎలా ఉంది? నీవాటి కన్నిటికీ జవాబు లిచ్చాడా? ఏదీ వాటిని ఖండించూ చూద్దాం?"

"చాలు, చాలు! ఈ రచయిత, చూస్తే మీలాగే సనాతనుడిలాగా కనిపి స్తున్నాడు చచ్చి స్వర్గాన ఉన్న మనువుతో వాదించటం అనవసరం ఆయన స్త్రీలకు స్వాతంత్ర్యం పనికిరా దన్నాడు, బాగానే ఉంది కాని పురుషులు మాత్రం స్త్రీకి భాగంలేకుండా స్వాతంత్ర్యం అనుభవించటానికి అర్హులా? స్త్రీలకంటే పురుషులు ఎక్కువగా ఉన్నచోట పురుషుల నైతిక జీవితం ఎలా ఉంది? సరే గాని, అన్నాయ్! ఈ వ్యాసం నువ్వు వ్రాసిందిలాగా ఉంది, నిజం చెప్పు, నువ్వుకాదా?" అని అడిగాను

"ఛా, ఛా, నీ కేమన్నా పిచ్చా ఏమిటి? నా కీ రాతలు గీతలు చేతకావు నే నెప్పుడైనా రాయటం నువ్వు చూశావా?" అని అడిగాడు

"ఇతను ఎవరైనాకానీ, నేను దీనికి జవాబు రాస్తాను నువ్వు నా వ్యాసం తీసుకెళ్ళి సంపాదకుడికి ఇచ్చిరా నీకు పుణ్యం ఉంటుంది—నా కీ ఒక్కపనీ చేసి పెట్టు" అని బ్రతిమాలాను

"సరే నువు వ్రాయి నేను ఇచ్చి వస్తాను" అన్నాడు అన్న

నేను ఆరాత్రిఅంతా మేలుకుని ఈ వ్యాసం రాశాను :

"పురుషులు తమ ప్రాముఖ్యతను, గొప్పను కాపాడుకోవటంకోసం ఇంత వరకూ శాస్త్రాలను ఆధారంచేసుకునీ, వంచనచేసీ, స్త్రీలను తొక్కి పెడుతూ వచ్చారు. ఇప్పుడు స్త్రీ, విద్య నేర్చి, తాను ఏవిధంగానూ పురుషునికంటే తక్కువకానని గ్రహించింది. తగిన అవకాశాలు లభిస్తే స్త్రీ అన్నిరంగాలలోనూ పురుషునికి సమకక్షిగా నిలబడగలదు. ఈనాడు స్త్రీ పొట్టకూటికోసం మగవాడికి బానిసత్వం చేయటంలేదు-తన స్వశక్తితో ఆర్జించి తినాలని అనుకొంటున్నది. స్త్రీ ఇక ఇంటో బంధింపబడి ఉండదు. మానవత్వ సంపాదనకోసం ప్రయత్నిస్తుంది. పెళ్ళి, పిల్లల్ని పెంచటం ప్రతిస్త్రీకి కర్తవ్యంకాకపోవచ్చు - పైగా అవి మానవత్వ సముపార్జనకు అడ్డుకావచ్చు."

ఈవిధంగా తీవ్రధోణిలో వ్రాసి, క్రింద 'మేఘబాల' అని సంతకం చేశాను.

అన్నాయి నా వ్యాసం చదివి పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వాడు – బహుశా నన్ను ఉడికించడాని కనుకుంటాను. ఆతర్వాత క్రింద పేరు చూసి–"ఓహో ! నువ్వు మేఘబాల వయింది దివాకరుణ్ణి కప్పటానికోసం కామాలు. కాని సూర్యుని కిరణాలకు తీక్షతకు నువ్వు ఆగలేవుసుమా !" అన్నాడు.

"చూద్దాముగా నీ దివాకరుడి తీక్షత ఎంత ఉందో !"

అన్నాయి నా శత్రుపక్షం వా డయినప్పటికి నా పట్ల విశ్వాసఘాతం చెయ్యలేదు. ఆ మాసంలోనే నా వ్యాసం భారత ప్రభలో పడింది. వ్యాసం చూసి నా స్నేహితురా ళ్ళందరూ బాగా ప్రశంసించారు. నేను మాత్రం దివాకరశర్మ దీని కేమి జవాబిస్తాడా అని ఉత్సుకతతో ఎదురు చూస్తున్నాను.

ఒకనాడు మా అన్నయ్య నా వ్యాసం విద్యార్థుల్లో చాలా సంచలనం కలిగించిందని చెప్పాడు. వాళ్ళలో రెండు మతాలు పడినవట. ఒకరు నాకు అనుకూలమట - రెండోవారు ప్రతికూలమట; ఎంతో తర్కించుకున్నారట. కాని నా మన స్సంతా దివాకరశర్మ ఇవ్వబోయే జవాబుమీదనే ఉంది.

మరుసటి మాసంలో దివాకరశర్మ జవాబు వచ్చింది.

"స్త్రీలు ప్రతివిషయంలోనూ పురుషులతో సమాన అధికారాలు కావాలని కోరటం అన్యాయమేకాదు - ప్రకృతివిరుద్ధంకూడా. శారీరక బలంలో కానీ, మానసికశక్తిలో కానీ, నైతికోత్కర్షలో కానీ, ప్రకృతి స్త్రీని లొచ్చుగా సృష్టించింది. స్త్రీ శరీరం అనేక విషయాల్లో పురుషుడికంటే భిన్నంగా

ఉంటుంది దాన్నిబట్టిచూస్తే పిల్లల్ని కనడం, పాలిచ్చి పెంచడమే వారికి ప్రకృతి నిర్ణయించినట్టు కనిపిస్తుంది అందుచేత స్త్రీ ఎప్పుడూ శారీరకబలంలో పురుషుడికి తీసికట్టుగానే ఉంది విద్య నేర్చుకుని కొందరు స్త్రీలు మానసికంగా పైకి వచ్చినమాట నిజమే, అంటే కొందరు పుస్తకాలు వ్రాశారు, కొందరు విజ్ఞాన శాస్త్రంలో కృషిచేశారు, కాని ఎవ్వరూ ఇంతవరకు పురుషుడితో దీటుకు రాలేదు ఇప్పుడు కొంతమంది పెద్దచదువులు చదువుకుని పెళ్లి చేసుకోకుండా ఉద్యోగాలు చేయాలంటున్నారు ఇది ప్రకృతికి విరుద్ధం ప్రకృతి స్త్రీ దేహాన్ని మాతృత్వానికి అనుకూలంగా సృష్టించినట్టే వారి హృదయాలను కూడా భావోద్రిక్తంగా నిర్మించింది నారీహృదయంలో ఉండే స్నేహ ప్రేమలలాంటి కోమల మనోవృత్తులు పురుషహృదయాల్లో అదేపాకాన ఉండవు విద్యావతులు వివాహానికి ఇష్టపడక ఆ కోమలత్వాన్నంతా పాడుచేసుకుంటున్నారు ఇది సంఘానికి శ్రేయస్కరంకాదు యూరపులో ఈ విధమైన 'ఫిమెనిష్టు' మూమెంటు ప్రారంభం అయినప్పటినుంచీ వారికి కుటుంబసౌఖ్యమనేది లేకుండాపోయింది వివాహాలు తగ్గటంతో పాటు సంఘంలో దుర్నీతికూడా బాగా వ్యాపించింది

"కుటుంబజీవితమంటే అర్థం పురుషుడు తన సుఖంకోసం స్త్రీని బానిసను చేయటంకాదు, ఉభయులూ ప్రేమబంధనంతో బంధింపబడి, ఉభయుల సుఖశాంతులకోసం, జాతి మేలుకోసం ఒకరికొకరు సహాయపడుతూ ఉండటం కేవలం స్త్రీలే పురుషుల అధీనంలో ఉండటంలేదు పురుషులుకూడా వివిధ ప్రాయాల్లో అమ్మమ్మ, నాయనమ్మ, అమ్మ, భార్య, కుమార్తె, కోడలు వగైరాల అధీనంలోనూ, ప్రభావంలోనూ ఉంటున్నారు అయినా, ఎక్కడా 'స్త్రీస్వాతంత్ర్యం' లాగా పురుషస్వాతంత్ర్యమనే ఉద్యమం బయలుదేరలేదు పురుషుడు బయట సంపాయించుకువస్తాడు, స్త్రీ ఇంటోఉండి, గృహలక్ష్మిలాగా ఆ డబ్బుతో ఇంటిని సుఖప్రదంగానూ, శాంతిప్రదంగానూ చేస్తుంది అన్ని సభ్య దేశాల్లోనూ, సభ్య జాతుల్లోనూ ఈవిధంగా తమతమ విధ్యుక్తధర్మాలను విభజించుకున్నారు మానవత్వమని దేన్ని అంటారు? మానవజీవితంలో కొంత భాగాన్ని పరుల సేవకు వినియోగించడాన్నే స్వతంత్రులై, పశువుల లాగా కేవలం తన సుఖాన్నే చూచుకుంటూ జీవితం గడపటం మానవత్వం కాదు" ఇలాపోయింది దాని ధోరణి

దివాకరశర్మ వ్రాసిన ఈ వ్యాసం చదివి నేను దిగ్భ్రమ చెందాను ఈ వ్యాసం ఆలోచనను రేకెత్తించేమాట నిజమే ఐనా స్త్రీల ఉద్యమమూ,

కోర్కెలూ న్యాయసంగతమైనవేనని నా నమ్మకం. ఇతని వాదనలకు వెంటనే నాకు జవాబులు దొరకకపోయినా, అతడు పెళ్ళి చేసుకోని స్త్రీలనిగురించి వ్రాసినదానిలో ధ్వని, నాకు అతనిమీద అసహ్యాం కలిగించింది. అన్నయ్య నా యీ మనోభావాన్ని గ్రహించి – "ఏం? ఈమాటు బాగా జవాబిచ్చాడా? దివాకరశర్మ ప్రభముందు మేఘశాల ఎంతసేపు ఆగుతుంది?" అన్నాడు.

"నువ్వు ఇలా మాట్లాడక ఏమిచేస్తావు? చూస్తావుగా నువ్వు, నే నీ ఏకపక్ష వాదనను ఎలా ఖండిస్తానో. అయితే నే నీవిషయంలో కొంచెం స్టడీ చేయాల్సి ఉంది. పీడిత స్త్రీజాతి యుగ యుగాలనించి పురుషుల అత్యాచారాలకు విరుద్ధంగా ప్రకటించిన యుద్ధాలన్నీ ధర్మయుద్ధాలని నా నమ్మకం" అన్నాను నేను.

"అయితే నీ వీ విప్లవపూరిత భావాలను ప్రచారం చేసి ప్రతిఇంటా విద్రోహమూ, అశాంతీ కలిగిస్తా వన్నమాట?"

"నీ కేం భయమక్కర్లేదు, అన్నాయ్! నీకు భార్య వస్తే, ఇవన్నీ నేర్పనులే. ఆమె చిరకాలమూ నీ పాదదాసిగానే పడిఉంటుంది."

"ఈ రోజుల్లో ఒకరికొకరు ఎవరూ దాసత్వం చేయరు; పూర్వంకూడా చేయలేదు. 'కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ–' జ్ఞాపకం ఉందా శ్లోకం?"

"పూర్వ ఆదర్శాలు బాగానే ఉన్నై. అప్పుడు స్త్రీ తన ఆత్మగౌరవం కాపాడుకోగలిగిఉండేది. ఆ రోజుల్లో ఆదర్శం 'యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః' కాబట్టి దివాకరశర్మ చెప్పినట్టు నైతికంగా స్త్రీ నికృష్టురాలు కాదని తేలుతుంది. అలా అయితే స్త్రీని ఎవరు పూజించేవాళ్ళు? సరేగాని అన్నాయ్, నువ్వుగనక వొప్పుకుంటే నే నొక మంచిపిల్లను తెచ్చి చేస్తాను నీకు."

"చాలు చాలు, నువ్వు చేసుకోవుగాని, నాకు చేయాలని చూస్తున్నావా? నీలాంటి బోల్షివిక్ ఎవరన్నా దొరికిందా ఏమిటి?"

నేను నవ్వి–"లేదు అన్నాయ్! నేను ఇవ్వాళే అమ్మతో అన్నాయి పెళ్ళి చేసుకుంటా డని చెప్పుతాను" అన్నాను.

"ఇప్పుడు నాకు పరీక్షలు దగ్గిరికొచ్చినై. ఇలాంటి వేవీ నే నిప్పుడు పెట్టుకోను" అని వెళ్ళిపోయాడు అన్నయ్య.

అన్నయ్య వెళ్ళిపోయిన తర్వాత నాకు దివాకరశర్మ మాటలే తలపుకు రాసాగినై. పాశ్చాత్యదేశాలలో వివాహాలు తగ్గటంచేత నైతిక పతనం ఎక్కువైందని అతను రాశాడు. మనదేశంలో ప్రతివారూ పెళ్ళి చేసుకుంటూనే




ఉన్నారు; ముఖ్యంగా ఆడవాళ్ళు మానుకోవటానికే వీలులేదు. అలాంటప్పుడు ఇక్కడ నైతికపతనం ఇంత ఎక్కువగా ఎందుకు ఉంది? దీనికి బాధ్యత పురుషులమీద లేదా? దివాకర శర్మకు ఆమాత్రం తోచలేదా? ఉన్నత విద్య నభ్యసించిన స్త్రీల విషయంలో కూడా దివాకరశర్మ రాసింది చాలాతప్పు. మొన్న ఈ మధ్యని 'ఇండియా అండ్ ది వరల్డు' పత్రిక, ఒక అమెరికన్ స్త్రీ వ్రాసిన వ్యాసం ప్రకటించింది. అందులో 1900 సంవత్సరానికి క్రితం గ్రాడ్యుయేట్ అయిన స్త్రీలలో నూటికి 50 మంది వివాహం చేసుకున్నారనీ, తలకు ఒక్క సంతానంచొప్పున కన్నారనీ, ఈనాడు గ్రాడ్యుయేట్ ఐన స్త్రీలు నూటికి 75 మంది వివాహం చేసుకున్నారనీ, తలకు ఇద్దరు ముగ్గురు చొప్పున సంతానం కంటున్నారనీ వ్రాసింది. ఈనాడు అమెరికను కాలేజీలు ముఖ్యంగా

స్త్రీలకు గార్హస్థ్య విజ్ఞానం నేర్పడంపట్ల శ్రద్ధ వహిస్తున్న వనీ, అయితే విధిగా పెళ్ళి చేసుకుతీరా లనిమాత్రమే చెప్పటంలేదని రాసింది

## 3

అన్నయ్య పెళ్ళినిగురించి మా అమ్మ చాలా రోజులుగా వత్తిడి చేస్తోంది. అన్నయ్యమాత్రం - 'ఇంటో పెళ్ళికాని చెల్లెల్ని అట్టేపెట్టి నే నెలా చేసుకునేది ముందు నీరూకు పెళ్ళి చేయి!'' అనేవాడు

''అమ్మాయి బి యే ప్యాసుకాంది నేను పెళ్లి చేసుకో నని ప్రతిజ్ఞచేసి కూచుందిగా-కాని, నాకు మాత్రం వంటో వోపిక తగ్గిపోతోంది నే నిక ఈ సంసారం ఈడ్చలేను న న్నీ చివరిదశలోనన్నా కాస్త సుఖపడనివ్వవా?'' అని అమ్మ ఒకనాడు అన్నయ్య దగ్గర కన్నీరు కార్చింది అమ్మ కన్నీరు చూసి నేను అన్నయ్య వెంటపడ్డాను ఆఖరికి అన్నయ్య మంచిపిల్ల దొరికితే చూడ మన్నాడు ''అంటే, ఆఅమ్మాయి రూపంలో లక్ష్మి, గుణాల్లో సరస్వతీలా ఉండా లనా ?'' అని అడిగాను

''నాకు నీలాంటి విదుషి అక్కర్లేదు'' అన్నాడు అన్నయ్య

''నీ కేం భయంలేదు అన్నయ్యా! నీ దాసత్వానికి ఒప్పుకునే పిల్లనే తీసుకు వస్తాను'' అన్నాను నేను

బేథూన్ స్కూల్లో ఒక అమ్మాయి ఆ సంవత్సరం ఐదోఫారంలో ఫస్టున పాసయి అందరి దృష్టి ఆకర్షించింది. ఆ పిల్లపేరు ప్రమీల. పిల్ల ఎరుపు, అందకత్తె, వక్తృత్వ పోటీలోకూడా మొదటి బహుమానం సంపాయించింది. అయితే పాటలోమాత్రం ఇంకో నల్లపిల్ల గెలిచింది. నేను అనేకచోట్ల చూశాను నల్లపిల్ల గొంతు ఎంతో కమ్మదనంగా ఉంటుంది బహుశా దీనికి కారణం కోకల నల్లది కావడమే నేమో? నే నా పిల్లతండ్రి పేరూ, ఇంటి చిరునామా కనుక్కున్నాను అమ్మతో చెప్పితే ఆమె అక్కడికి మధ్యవర్తులను కూడా పంపింది వాళ్లూ ఆ పిల్లకు పెళ్ళి చేయా లనే చూస్తున్నారట కాని స్కూలు ఫైనలు పూర్తి చేయిద్దా మనుకున్నారట. అయితే మా సంబంధం మంచి దని నిర్ణయించుకుని ఈ సంవత్సరమే చేయటానికి వొప్పుకున్నారట మా అన్నయ్య ఇద్దరు స్నేహితులతో వెళ్ళి పిల్లని చూసివచ్చాడు అన్నయ్య ముఖం వికసించి ఉండటం చూసి పిల్ల నచ్చిం దని గ్రహించాను

''ఏం. అన్నాయ్! నచ్చినట్టేనా ?'' అని అడిగాను.

''ఎవరికి?''

"నీకే పెళ్ళి చేసుకోబోయేవాడివి నువ్వు. నీకు కాకపోతే ఇంకెవరికి?"

—'కాదు నీ వరుడికి నచ్చటం ప్రధానం "

"అదేమిటీ? నువ్వు పెళ్ళికూతురును చూడటానికి పోయి, నా సంగతి తీసుకొస్తా వెందుకూ?"

"చూడు నీరూ! చాలా గమ్మత్తు అయింది మేము ఆ యింటికి వెళ్ళేవరకు ఆజానులంబితబాహువులతో, ఉన్నత లలాటంతో, దీర్ఘనాసికతో, ఎర్రని—"

"చాలు, చాలు! అతని వర్ణన నాకు అక్కర్లేదు. నీ సంగతి చెప్పు' అన్నాను నేను మధ్యనే విసుగుతో.

"ముందు వినరాదూ!-ఎర్రని యువకుడు మందహాసంతో మమ్మల్ని ఆహ్వానించాడు. నా ప్రక్క నున్న కుర్రవాడు అతన్ని చూసి—'అరే, శంకరే, ఇక్కడెలా ఉన్నావు?' అన్నాడు. శంకర్ ని నేను ఎం. ఏ. క్లాసులో చూశాను. కాని అతనితో నాకు పరిచయంలేదు. అతన్ని చూడగానే మన నీరూకు ఇతన్ని పట్టుకోగలిగితే బాగా ఉజ్జీ సరిపోతుం దని నాకు అనిపించింది. అలాంటి వీరుణ్ణి చూసి, ఏ కన్య అతనికి దాసత్వచీటీ వ్రాసిఇవ్వదు?"

నేను కోపాన్ని వెల్లడిస్తూ- "నా సంగతి నువ్వేమీ విచారించనక్కర్లేదు. నీ గొడవ నీవు చూసుకుంటేచాలు, ఇంతకూ నీ కా పిల్ల నచ్చిందా?" అన్నాను.

"నచ్చ కేం చేస్తుందీ, నువ్వు ఇష్టపడ్డ తర్వాత! అయితే మీ చదువుల సరస్వతి కుందే చాలా సిగ్గులాగా ఉంది. ఆవాళ అంతమందీ ఎదట ఎలా పాడిందో తెలియదుకాని, మే మడిగితే సిగ్గు ముంచుకొచ్చింది. ఎంతోసేపు సాగదీయించుకుని ఒక్కపాట పాడింది."

"అంతమాత్రం సిగ్గు ఉండదా, కాబోయే భర్తదగ్గర? ఎలాగైనా హిందువుల పిల్లకదా!"

ఇది జరిగిన కొన్నాళ్ళకు పిల్లతండ్రి బంధువులతో మా యింటికి వచ్చాడు. అన్నయ్య వాళ్ళలో ఉన్న ఒక యువకుణ్ణి చూపి-"అదుగో, అతనే శంకర్, ఎలా ఉన్నాడు?" అని అడిగాడు.

నేను కొంచెం కోపంతో- "నా కెలా ఉంటేయేం? నీకు కాబోయే బావ మరిది. నీకు బాగా ఉంటాడుకూడా!" అన్నాను.

అన్నయ్య వాళ్ళను ఆహ్వానించి కూర్చోబెట్టాడు-ఇంకా ఇంటో ఎవ్వరూ మగవాళ్ళు లేరుగా - నేనే ఫలహారం అదీ తయారుచేశాను. మామూలు క్రతువులు అయిపోయిన తర్వాత అమ్మ ఫలహారం వడ్డించింది. నాకు,

ఎందుకనో వాళ్ళ ఎదటికి పోవటానికి సిగ్గేసింది. అమ్మకూడా నన్ను వొత్తిడికి పెట్టలేదు. పొమ్మని పోతే ఇంత పెద్దపిల్లకి ఎందుకు పెళ్ళికాలేదు అనేదానికి సమాధానం ఇవ్వవలసివచ్చేది! నేను చాటునుండి అన్నయ్య వర్ణించిన వీర పురుషుణ్ణి చూశాను-చూడదగిన వ్యక్తే కూడా.

కొన్నాళ్ళకు మా దూరపు మామ ఒక ఆయన వచ్చి లగ్నాలు పెట్టుకు వచ్చాడు. ఆయనవెంట మా అన్నయ్యా, ఇద్దరు స్నేహితులూ వెళ్ళారు.

పెళ్ళి అయిపోయింది. పిల్లను తీసుకుని మా అన్నయ్య ఇంటికి వచ్చాడు. నేను ప్రమీలను తీసుకుని గదిలోకి వెళ్లాను. ప్రమీల నావంక చాలాసేపు చూస్తూ అట్లాగే నిలుచుంది!

"ఏం, నా మొహం ఎరిగిందిలాగా ఉందా?" అని నేను అడిగాను.

ప్రమీల నవ్వి - "మిమ్మల్ని బేధూను కాలేజీలో చూసినట్టు ఉంది" అన్నది.

"ఆవాళ మీస్కూలు వార్షికోత్సవానికి నేనూ వచ్చాను. నీ గంతు లవీకూడా చూశాను. నాటకంలో నీ వేషం బాగాఉంది!" అన్నాను నేను.

నే నీమాట అనేవరకు సిగ్గుతో మొహాన గుడ్డ అడ్డం పెట్టుకున్నది.

"ఇదిగో పిల్లా! నువ్వు నన్ను నీరూదీ అని పిలువు; నేను నిన్ను వదినె అని పిలవను, ప్రమీలా అని పిలుస్తాను. తెలిసిందా? నేను బోల్షివిక్కును. నేను అన్నయ్యనుకూడా అంత లెఖ్ఖచేయను!" అన్నాను నేను.

"బోల్షివిక్ అంటే ఏమిటి?" అని అడిగింది ప్రమీల.

నేను ఎద్దేవగా అన్నాను :—"బోల్షివిక్ అంటే తెలియదూ? పాశవిక బలాన్ని ఆరాధించినవారు. బలం అంటే శక్తి, అంటే బ్రూట్ ఫోర్స్. నేను సాంఘిక చట్టాల్ని బలవంతంగానైనా సరే భగ్నం చేయాలనేదాన్ని. అందుకనే, నేను నీకంటే ఎంతో పెద్దదాన్నయినా ఇంకా ముడి వేయించుకోలేదు!"

"మా అన్నయ్యకూడా ఇలాంటి భావాలు కలవాడే" అన్నది ప్రమీల.

"నిజం! అయితే ఆయనతో బాగా స్నేహం కలపవచ్చు - కాని ఆయన్ని పెళ్ళిమాత్రం చేసుకోను."

"అన్నయ్యకు కూడా పెళ్ళి చేసుకోవాలని లేదు"

"ఇంకేం, చిక్కేలేదు పెళ్ళి ఎందుకూ? స్నేహం వుంటే చాలు"

ఈ సమయంలో అన్నాయి హఠాత్తుగా అక్కడికి వచ్చాడు ప్రమీల ముఖం మీదికి ముసుగులాగి కూచుంది.




''ఏమోయ్ నీరూ! ఇప్పటినించే పెళ్ళికూతురుకు నీ బోల్షివిక్ తత్వం ఎక్కిస్తున్నట్లు ఉందే?'' అన్నాడు.

''నేను నేర్పనక్కర్లేదు. నీ భార్య ఇదివరకే వీరాంగన వేషం వేసింది'' అన్నాను.

''చాలు, చాలు! ఈ వీరాంగనని చూశావుగా. ఇక ఈ వీరాంగన సోదరుణ్ణి చూస్తే ఏమంటావో!''

''ఆయన సంగతి విన్నాను, వారూ నాలాగే బోల్షివిక్ అట-అంటే నారీ ద్వేషి-పెళ్ళి చేసుకోడట.''

"ఓ, అయితే ఈలోపలే అన్ని విషయాలూ తెలుసుకున్నా వన్నమాట. సరే, నేను ఎందుకు వచ్చానో చెప్పటం మరిచిపోయాను—"

"మరిచిపోలేదు—ఇదుగో చూడు !" అని ప్రమీల ముఖంమీద ముసుగు తీసి చూపాను.

అన్నాయి మందహాసం చేసి, కొంచెం కోపంతో - "హా ! నువ్వు ఉత్త వాగుడుకాయవి ! భోజనాలకి ఎవరెవర్ని పిలవాలో కనుక్కుపోదా మని వచ్చాను. నువ్వు రా" అన్నాడు.

## 4

విందుకు చాలామంది చుట్టాలనూ స్నేహితులనూ పిలిచాము. అన్నయ్య కాలేజీ స్నేహితులుకూడా చాలామంది వచ్చారు. వాళ్ళందరూ డ్రాయింగు రూంలో కూచుని రకరకాల విషయాలూ చర్చిస్తూ అల్లరి చేస్తున్నారు. వాళ్ళలో ఒక కుర్రవాడుమాత్రం వేరుగా కూచుని ఏదో ఆలోచిస్తున్నాడు. మా అన్నయ్య ఆ గదిలోకి పోగానే ఒక కుర్రవాడు, "ఏమోయ్, సుకుమార్! మీ బావమరిది కనిపించటంలేదేం ?" అని అడిగాడు. ఇంతలో ఒక కుర్రవాడు నాలుగు దిక్కులూ చూసి, "అదుగో, శంకర్ ! రావోయ్ ఇటూ; చాటుగా కూచున్నా వెందుకూ ?" అన్నాడు,

"నేను మీ రహస్యాలు వింటున్నాను !" అని నవ్వుతూ శంకర్ అన్నాడు.

అన్నయ్య అతన్ని చేసైగతో పిలిచి నాగదికి తీసుకువచ్చి నాకు పరిచయం చేశాడు. "శంకర్ బాబూ ! ఈపిల్ల మా చెల్లెలు నీరూ. పూర్తి పేరు నీహారిక. బేథూన్‌లో బి. ఏ. చదువుతున్నది."

నేను సిగ్గుతో తడబడ్డాను. శంకర్ నాకు చిన్న నమస్కారం చేశాడు. నా కిలా హఠాత్తుగా తీసుకువచ్చి, పరిచయం చేయటం అన్నయ్యది తప్పు. నాకు కోపం వచ్చిందికూడా. అయినా నేను మర్యాద కోసం అది అణిచివేసి మామూలుగా కనిపించాను. శంకర్‌కు ఏమి మాట్లాడాలో తోచలేదు. అతని అవస్థ గ్రహించి నేను—"రండి, మీ చెల్లెల్ని చూద్దురుగాని" అని అతన్ని ప్రమీల ఉన్న గదిలోకి తీసుకొచ్చాను. అన్నయ్య బయటి మిత్రులదగ్గరికి వెళ్లాడు.

"ప్రమీలా ! ముసుగు తీసి చూడు, ఎవరు వచ్చారో !" అన్నాను నేను ప్రమీలతో.

"ఏమే ! మరీ నువ్వు తాటాకుల బొమ్మలాగా కూచున్నావు ?"

"మీ చెల్లెలికి చాలా సిగ్గండీ! ఇంగ్లీషు చదువుకున్న పిల్లలకు ఇంత సిగ్గు ఎందుకూ ?"

నామాట విని ప్రమీల ముసుగు తీసి అన్నను చూసింది

శంకర్ అన్నాడు: "కొత్త పెళ్లికూతురు కాదూ ? కొన్నాళ్లు సిగ్గుగానే ఉంటుంది. ఉన్నతవిద్య చదివిన మీలాంటి ఆడబిడ్డలు దొరకటం నిజంగా మా చెల్లెలు అదృష్టం. లేకపోతే ఇంగ్లీషు చదువుకున్న పిల్లల్ని అందరూ దొరసాన్లని ఎగతాళి చేస్తారు."

ఆ సంగతి నాకూ తెలుసు. కాని ప్రమీలను చూస్తేమాత్రం ఎవ్వరూ ఇంగ్లీషు చదివినపిల్ల అని అనుకోరు. నా ఉద్దేశం స్త్రీలు మెత్తగా ఉండకూడదని. వాళ్లు ఆత్మాభిమానం చంపుకోకుండా ఆత్మగౌరవాన్ని కాపాడుకోవలసిన సమయం ఆసన్నమైంది. ఇంతవరకు మన సంఘంలో స్త్రీ తన వ్యక్తిత్వాన్ని చంపుకుని భర్తలో కలిసిపోవటమే ఆదర్శం. నేనది వొప్పుకోను. స్త్రీ కూడా మనిషే. వాళ్ళకీ వ్యక్తిత్వం ఉంది. భర్తతో కలిసిపోకుండా విడిగా తన జీవితాన్ని సార్థకం చేసుకోకలదు.... సరే, ఈ ప్రథమ పరిచయంలోనే మీ కీ లెక్చరు ఇచ్చి మిమ్మల్ని విసిగిస్తున్నా ననుకుంటాను."

శంకర్ నవ్వుతూ—"అబ్బే, ఏమీలేదు. మీ వాదన చాలా బాగుంది. మీరు చాలా స్వతంత్రంగా ఆలోచిస్తా రనేది తెలుసుకుని చాలా ఆనందపడ్డాను. ఈ విషయాలు ప్రస్తుతం ఏదో మాసపత్రికలో చర్చిస్తున్నా రనుకుంటాను ?" అని అడిగాడు.

"బహుశా 'భారత ప్రభ'లో చదివి ఉంటారు."

"ఇది మీ చదువుకునే గదేనా ? చాలా పుస్తకా లున్నై."

"అవన్నీ మానాన్నగారివి. వారు కొత్తపుస్తకం కనపడితే చాలు కొనేవారు. మీకు కావలసిన పుస్తకాలు తీసుకెళ్ళి చదువుకోండి. ఇక మీకూ మాకూ చుట్టరికంకూడా కలిసిందిగా."

"అలాగే మీ మాటలు నాకు చాలా బాగా ఉంటున్నై. సరే, మిమ్మల్ని ఏమని పిలవమంటారు? ఈ స్వదేశీయుగంలో మిస్ చటర్జీ, మిస్ బెనర్జీ అని పిలవటము ఏమీ బాగాలేదు."

"నాపేరు నీహారిక- అన్నాయి నీరూ అని పిలుస్తాడు."

"ఆసంగతి విన్నాను. కాని నేను--"

"మీరుకూడా అలాగే కుదించి పిలవండి."

ఇంతలో అమ్మ వచ్చి-"ఏమే నీరూ! పెళ్ళికూతురును చూడటానికి అమ్మ లక్కలు చాలామంది వచ్చారు. ఒకమాటు ఇటు తీసుకురా" అన్నది. ఆమె తనవైపు చూడటం గమనించి శంకర్ అమ్మకు నమస్కారం పెట్టాడు.

"నూరేళ్ళు ఆయుసు నాయనా! ఎంత సేపయింది వచ్చి? చెల్లెలితో మాట్లాడుతున్నా వనుకుంటాను. చాలా మంచిపిల్ల; ఈ నాలుగురోజులకే మా నీరూతో బాగా స్నేహం చేసిందికూడా" అని వెళ్ళిపోగానే శంకరు కూడా బయటికి వెళ్ళాడు. నేనూ ప్రమీలను తీసుకుని అమ్మవెంట వెళ్ళాను.

## 5

పదహారురోజుల పండగకి ప్రమీలను తీసుకుపోవటానికి వాళ్ళ అన్న శంకర్ వచ్చాడు. అన్నయ్య అతన్ని లైబ్రరీ గదిలో కూచోబెట్టి ఈ సంగతి మాకు చెప్పిపోయాడు. అప్పుడు నేను మా అమ్మకు సహాయపడుతున్నాను-కూరలు తరుగుతూ; ప్రమీల పూజాసామగ్రి చక్కబెడుతోంది. అమ్మ నాతో "నీరూ! నువ్వు త్వరగా టీ తయారుచేసి చుట్టానికి ఇచ్చిరా, తర్వాత ఇంటో తింటానికి పిండివంటలు ఏమేమి ఉన్నాయో చూడు!" అని చెప్పి ప్రమీలను పిలుచుకుని వాళ్ళ అన్న దగ్గరికి పోయింది.

నేను టీ తయారుచేస్తూ ఉండగా మళ్ళీ మా అమ్మ తిరిగివచ్చి—"అబ్బాయి చాలా మంచివాడు. వినయ విధేయతలూ బాగా ఉన్నాయి; బాగా చదువుకున్నాడటకూడా. మీ వొదిన అక్కడ ఉంది. నువ్వే పోయి ఫలహారం ఇచ్చిరా" అన్నది.

మా అమ్మా, అన్నాకూడా శంకర్‌ని వేనోళ్ళ పొగుడుతారు. ఈ ప్రశంస ఎందుకూ నాదగ్గిర? ఆమాత్రం అర్థం చేసుకోలేనిదాన్నా నేను!

ఈ మధ్యలో మా అన్న వచ్చి-"ఏమే, టీ అయిందా? ఇం కెంత ఆలస్యం ఉంది?" అన్నాడు.

నేను కోపం నటిస్తూ-"నేను చాలామందిని చూశాను - ఇలా బావమరుదుల్ని వెనకవేసుకు వచ్చేవాళ్ళని. సరే....నీళ్లు కాగనై, నువ్వు తీసుకుపోకూడదూ? ... వద్దులే....నువ్వు కొత్త అల్లుడివి కాదూ వాళ్ళకి; పనిమనిషికూడా బజారుకు పోయింది; సరే, నేనే తీసుకువస్తాలే" అన్నాను.

ఫలహారం, టీ తీసుకున్నాక భారతప్రభ చర్చ వచ్చింది. శంకర్ నా వాదన పట్ల చాలా సానుభూతి చూపించాడు.



"అయితే ఈనాటినించీ దివాకరశర్మకు ఇద్దరు శత్రువు లన్నమాట!" అన్నాడు అన్నాయి.

"దివాకరశర్మ ఎవరూ?" అని అడిగాడు శంకర్.

"ఏం అప్పుడే అసూయా అతనిమీద?"

"అతన్ని నేను ఎరగనన్నా ఎరగనే! అతనిమీద నా కెందుకు అసూయ ఉంటుంది?" అన్నాడు శంకర్.

"అన్నాయ్! నీ నోట్లో ఏదీ దాగదు!" అని కోపడ్డాను నేను.

నా ఈ కోపం చూసి అన్నయ్య ముసిముసి నవ్వు నవ్వాడు. శంకర్‌కు ఏమీ అర్థంకాక నావంక చూస్తూ ఉండిపోయాడు. నాకూ దివాకరశర్మకూ జరుగుతున్న చర్చ వెల్లడించటం ఇష్టంలేక నేను – "శంకర్‌బాబూ! మీరు భారతప్రభ చదవరేమిటి?" అని అడిగాను.

"ప్రతిమాసం చదవను; అప్పుడప్పుడు చదువుతాను."

"అయితే ప్రతిమాసం చూడండి. దివాకారశర్మ ఎవరో తెలుస్తుంది" అని నేను అక్కడనించి వెళ్ళిపోయాను.

ఆనాటి మధ్యాహ్నం భోజనా లయినాక శంకర్ ప్రమీలను తీసుకుని వాళ్ళ ఇంటికి వెళ్ళాడు ఆ తర్వాత పదిరోజులకు మా అన్నయ్య మళ్ళీ ప్రమీలను తీసుకువచ్చాడు

## 6

ఈ మధ్య అన్నయ్య పెళ్ళిహడావుడిలో నా రాతపని సాగలేదు దివాకర శర్మ చివరి వ్యాసానికి జవా బివ్వా లని నా మనస్సు చాలా తహతహ పడుతోంది తీరిక చేసుకుని కొద్దిగా రాశానుకూడా అది నా కే చప్పగాఉండి చించివేశాను దివాకరశర్మ రాసిన—"ప్రకృతి స్త్రీని ప్రతి అంగములోనూ పురుషుడికంటే హీనంగా సృష్టించింది" అనేది చదివినప్పుడెల్లా నావొళ్ళు మండేది, కాని నిజం చెప్పాలంటే స్త్రీ సౌందర్యంలో అధికారు లయినా అవయవపటుత్వంలో పురుషుడికన్న తక్కు వే నని ఒప్పుకోవాలి, కాని శారీరిక బలమే ముఖ్య మని ఎలా ఒప్పుకోగలము? ఈ ప్రపంచంలోని మహాపురుషులలో చాలామంది మల్లులు కారు! ప్రపంచంలో శౌర్యానికి, యుద్ధనైపుణ్యానికి ప్రసిద్ధిచెందిన సేనానాయకు లెవరూ శారీరికంగా బలవంతులు కారు-పైగా రాజకీయల్లోనూ, యుద్ధరంగాల్లోనూ ప్రఖ్యాతి గడించిన స్త్రీలు మనదేశంలో చాలామంది ఉన్నారు అయితే స్త్రీ తన సౌందర్యం మూలానే పురుషులచేత ఆకర్షింపబడి, వాళ్ళ ప్రలోభనలకు లోనై ఇంటో బంధింపబడింది. స్త్రీకి ఈ దుర్గతి తెచ్చింది ఆమె ప్రేమపూరిత హృదయమే ఈ దౌర్బల్యంవల్లనే ఆమె పురుషుడికి సులభంగ స్వాధీన మవుతుంది దీనికి ఉదాహరణ నా కళ్ళముందే ఉన్నది మా అన్నయ్యా, ప్రమీలా పెళ్ళి కాకముందు ఒకరినొకరు ఎరగరు పెళ్ళి అయిన కొద్దికాలానికే వాళ్ళు ఎంత సన్నిహితు లైనారంటే కాసేపు ఒకరినొకరు చూసుకోకుండా ఉండలేరు వాళ్ళ హృదయపద్మాలు ప్రేమ స్పర్శతో నిల్చుకుంటున్నై దీనిలో బలత్కార మేమీలేదు కాబట్టి దివాకర శర్మ రాసినట్టు స్త్రీ దుర్బలమైన దని ఒప్పుకోవలసివస్తోంది

అయితే స్త్రీ మానసికంగా తక్కు వని వొప్పుకోను. ఎక్కువమంది లేక పోయినా మేడమ్‌క్యూరీలాంటివారు కొద్దిగానైనా దొరుకుతారు, అన్ని రంగాలలో, సెల్మాలాగర్లాఫ్ సాహిత్యంలో నోబుల్ బహుమానం సంపా యించింది అవకాశ మివ్వాలి కాని స్త్రీలు ఎంతైనా ముందుకు రాగలరు. శారీరికంగాకూడా ఇంగ్లీషు ఛానలు యీదిన స్త్రీలూ, విమానంలో అట్లాంటిక్ దాటిన స్త్రీలూ ఉన్నారు.

ప్రమీల మా యింటికి వచ్చిన తర్వాత ఒకనాడు నన్ను అడిగింది

"మా అన్నయ్య నన్ను మెట్రిక్యులేషన్ పరీక్షకు కూర్చోమంటున్నాడు. మీ అభిప్రాయం ఏమిటి ?"

"నాకు ఇష్టమే. ఇక మా అన్నయ్య అభిప్రాయం నువ్వే కనుక్కోకూడదూ ?"

ప్రమీల సిగ్గుతో కూడిన నవ్వు నవ్వి "వారికి ఇష్టమే, అత్తయ్య ఏమంటుందో కనుక్కోవద్దూ !" అన్నది.

"అన్నయ్యకు ఇష్టమైతే అమ్మ ఎందుకు వద్దంటుంది? నువ్వు స్కూలుకు పోవటం లేదుగా."

"మరి ఇంట్లో ఎలా చదవడం. నా కెవరు చెప్పుతారు ?"

"ఒకరు చెప్పటం ఎందుకూ ? నువ్వే చదువు. అర్థం కానిచోట్ల అన్నయ్య చెపుతాడు."

"అది కుదరదు. వా రెప్పుడూ తన చదువే చూసుకుంటారు. తీరిక ఉండదు."

"అయితే నువ్వు స్కూలుకి పోవటానికి అమ్మ వొప్పుకోదు....మీ అన్నయ్య నిన్ను స్కూలుకు పొమ్మని చెప్పాడా ?"

"ఉహుఁ. ఎందుకు చెప్పుతాడూ? 'ఇన్నాళ్ళు ఎలానూ చదివావు, పరీక్షకు కూచుంటే బాగుంటుంది' అన్నాడు."

"మీ అన్నయ్య నీ కింట్లో చదువు చెప్పేవాడా ?"

"ఆఁ, తన చదువుకూడా మానుకుని చెప్పేవాడు."

"మీ అన్నయ్య బెంగాలీ పుస్తకా లేమైనా చదువుతాడా ?"

"ఆఁ. దొరికితే తప్పక చదువుతాడు."

ఇంతలో మా అన్నయ్య వచ్చి-"ఏమిటి, నీరూ! శంకర్ సంగతి మాట్లాడుతున్నావు, వాళ్ళ చెల్లెలితో? అతను నిన్ను మరిచిపోలేదు. రేపు వస్తానన్నాడు."

"నీ బావమరిదికోసం నిద్రాహారాలు మాని కూచున్నాను. అన్నాయ్ ! నువ్వీ విధంగా మాట్లాడేటట్టయితే ఈసూటు అతను వచ్చినప్పుడు నేను ఎదటికే పోను" అన్నాను కోపంతో.

"కోప మెందుకూ? శంకర్ భారతప్రభ లన్నీ తీసుకువచ్చి నీవు వ్రాసినవీ, దివాకరశర్మ వ్రాసినవీ అన్నీ చదివాడట. అత నిప్పుడు నీ పక్షం అయిపోయాడు."

"దివాకరశర్మకి నేను జవాబు ఇచ్చానని ఆయనకి ఎలా తెలిసింది ?"

"ఏం, నే.నే చెప్పాను."

"నువ్వెందుకు చెప్పవలసివచ్చిందీ ?"

"నువ్వతన్ని భారతప్రభ ఎందుకు చదవమన్నావు? అతను నీవ్యాసం చదవాలనీ, నీ అభిప్రాయాలు తెలుసుకోవాలనీ నీ మనసులో ఉద్దేశం నేనదే బయట పెట్టాను. నీకు కోప మెందుకూ ?"

"సరే, అంతా వెల్లడైపోయింది కాబట్టి ఇక నేను రానేదికూడా లేదు. ఆసంగతి పోనివ్వు. ప్రమీలకు చదు వెందుకు చెప్పకూడదూ ? మెట్రిక్‌కు కూచోవా లని చాలా ఇష్టంగా ఉంది; వాళ్ళ అన్నకి కూడా ఇష్టమే."

"నాకు నా చదువుతోనే తీరటంలేదు. నే నింకా ఒకళ్ళ కెక్కడ చెప్పేది?"

"మరి శంకర్ ఎలా చెప్పుతున్నాడూ, ఇన్నాళ్లూ ?"

"శంకర్ యీజ్ ఎ గుడ్ బాయ్, ఐ యామ్ ఎ బ్యాడ్ బాయ్" అని అన్నయ్య వెళ్ళిపోయాడు.

ఆనాటి సాయంత్రంనించే అన్నయ్య ప్రమీలకు చదువు చెప్పడం సాగించాడు.

ఆ మరుసనాడే శంకర్ వచ్చాడు. అన్నయ్య అప్పుడు ఇంటోలేడు. నేను ప్రమీలని అతని దగ్గిరికి పంపాను. శంకర్ లైబ్రరీగదిలో కూచున్నాడు. అన్నాచెల్లెలూ ఏమి మాట్లాడుకుంటారో విందామని నేను గదిబయట నిలబడ్డాను.

"నీరూదేవి ఏదీ ?" అని శంకర్ అడిగాడు.

"ఆ గదిలో ఉంది." అన్నది ప్రమీల.

"ఏమిచేస్తున్నదీ ?"

"ఏమీలేదు, ఊరికే కూచుంది."

అతర్వాత కాసేపు నిశ్శబ్దం. కొంచెంసేపు ఉన్నాక - "ఆమె ఇక్కడికి రాదా ?" అని శంకర్ అడిగాడు.

"నా కెలా తెలుసూ ?" అన్నది ప్రమీల.

"ఇవిగో, మీ పుస్తకాలు. నేను చదువుకోటం కోసం తీసుకుపోయాను. సరే, నేను వచ్చిపోయానని సుకుమార్‌తో చెప్పు." అని అతను బయలుదేరి పోబోతుండగా, నేను వెళ్ళి - "అప్పుడే వెళ్ళుతున్నారే ; అన్నయ్య వచ్చేవేళ అయింది, ఉండండి." అన్నాను.

[సశేషం]

# శీల

*డి. హనుమంతరావు,

"మీట్ మై బాస్!" అంది ఉష. మూర్తికి ఆమె రావుని చూపించి.

"కెప్టెన్ మూర్తి" ఆ తర్వాత మూర్తిని పరిచయం చేసింది రావుకి.

మూర్తీ, రావూ చేతులు కలిపి మామూలు మాట లేవో చెప్పుకున్నారు.

టీ స్టాల్ కెదురుగ్గా రెయిలింగ్ ఆనుకొని నిలబడ్డారు ముగ్గురూ. సాయంకాలం ఆరుగంటల వేళ — రోడ్డు, ఫుట్ పాత్ రకరకాల రంగుల్తో కళకళలాడుతున్నాయి.

"చాలా రోజు లయింది చూసి!" — మూర్తి.

"చాలా ఏళ్లనండి!" — ఉష.

"59 లో అనుకుంటాను! యింతకీ నాకు తెలియకుండానే కుదుర్చుకు



న్నారం జానకి! ఎన్నాళ్లయింది? ఏమన్నా ప్రోగ్రెసా?"

"మీ రెక్కడా పత్తా తెలియకుండా మాయమైపోతే ఎక్కడికని రాయమంటారు? అన్నయ్య పాపం చాలా ట్రై చేశాడు మీ అడ్రస్ కోసం - ఏడాది దాటిందేమో!"

"ప్రోగ్రెస్ కూడా అడిగాన్నేను!"

"పాయింటు మూడు." ఉష సిగ్గుపడి తల దించింది.

"కంగ్రాట్స్. రండి, యీ శుభ సమయంలో టీ పార్టీ చేసుకుందాం."

మూర్తి, ఉషా ముందు నడుస్తుంటే వెనకాల రావు కూడా అడుగులు వేశాడు.

"ఇవాళ ప్రొద్దున్నించీ నాకు ఏమిటో చెప్పలేనంత ఉత్సాహంగా ఉంది. అనుకోకుండా మీరు కనబడ్డానికి నాంది అన్నమాట."

"నాకూ చాలా ఆనందంగా ఉంది. యిన్నేళ్లకి మనం కలుసుకోడం, అందులో యిలా అనుకోకుండా! మీతో ఎన్నో మాట్లాడాలని ఉంది! ఎక్కడ మొదలెట్టాలో తెలియడం లేదు!"

"యిందాకట్నించీ చూస్తున్నా! ఏమిటా మన్నించడం?"

"సారీ. అయిదేళ్లతర్వాత యింకా పాత ధోరణిలో మాట్లాడ్డం...."

"అయిదేళ్లు కాదు, యాభై ఏళ్లయినా మన స్నేహం చెక్కుచెదరదని మీ రారోజు పాంబీచ్‌లో కెరటాలు దిగజారిన చోట అద్దం లాంటి ఇసక జాలుమీద నిలబడి చెప్పారు. గుర్తుందా!"

"ను వ్వేం మారలేదు, ఉష్!"

"ఎన్నేళ్లయిందో ఆ పిలుపు విని!"

"రవి ఏమయ్యాడు?"

"అన్నయ్య హెవీ ఎలక్ట్రికల్స్ ట్రైనింగ్ కి సెకోస్లవేకియా వెళ్లాడు."

"ఏమిటో, యిందులో చేరాక 'నా'అన్నవాళ్లు దూర మయ్యారు!"

"కోరి వెళ్లిందేగా! యింక యిప్పుడు అనుకోడం దేనికి!"

"వెళ్లిందానికి బాధ పడ్తున్నానను కుంటున్నావా? నెవర్."

"మీరు లోప లేమనుకున్నా, నా యెదట తేలనియ్యరని నాకు తెలుసు!"

"నన్ను చూస్తే ఎలా కనబడుతున్నాను! బాధ పడుతున్నవాడిలా ఉన్నానా?"

"ఏమో, నాకళ్లకి అలాగే ఉంది!"

"అది నీ అభిమానం, అంతే."

"పోనీలెండి, యింక యిప్పుడా పాత వాద నెందుకు. అయిందేలాగూ అయింది!"

"యింతకీ యిన్నాళ్లకు కనబడ్డానా; మరి నీ పెళ్లి డిన్నరు ఎప్పుడు తినిపిస్తావు?"

"ఏమిటో మతిలేదు; ఏం మాట్లాడుతున్నానో నాకే తెలియడం లేదు!

రండి, యింటికి వెళ్దాం. అక్కడ తీరిగ్గా మాట్లాడుకోవచ్చు."

''పోనీలే, జ్ఞాపకం చేశా కయినా పిల్చావు !''

''క్షమించండి, ఏదో మాట్లాడుతూ మర్చిపోయాను. అయినా ఆ మాత్రం నన్నర్థం చేసుకోగలరని నాకు తెలుసు."

''అసలు నువ్వు పిలవాలా ఉషా ! నువ్వు ఊర్లో ఉన్నావని తెలిస్తే వెతుక్కుంటూ వచ్చి నువ్వు వెళ్లమన్నదాకా ఉండిపోయేవాణ్ణి !''

''ఉత్తి కబుర్లు చెప్పడం మాత్రం మానలేదు మీరు. యిప్పుడు తప్పించుకోడానికి ప్లాను వేస్తున్నారు. నాకు తెలుసులెండి ! ఆ ఆట లేం సాగవు ! యివాళ మాయింటికి రావలిసిందే !"

''ఇవాళ ఒక్కరోజేనా? నే నింకా ఏ వారం పది రోజులో ఉందా మనుకుంటున్నాను ! నన్ను చాలా నిరాశ పర్చావు ! చూడు, మీ ఆయన కూడా ఏం మాట్లాడ్డం లేదు !'' మూర్తి నవ్వాడు.

"అదేమిటి ! మీరు తప్పకుండా రావాలి. నే నేదో ఆలోచిస్తున్నాను!'' రావు తడబడ్డాడు.

"వారం పదిరోజు లుండక్కర్లేదు లెండి ! యివాళ్టికి రండి. ఆ మాత్రం దయ చాలు."

"నువ్వంటే నా కెంతఅభిమానమో నీ హృదయాన్నడుగు, చెపుతుంది!''

"అడగక్కర్లేదు, నాకు తెలుసు. అంత అభిమానం ఉండబట్టే గాబోలు, ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబు లేకుండా పోయింది !''

''ఉషా, నే నున్న పరిస్థితు లెలాంటివో నీకు తెలియదూ !''

"ఆ పరిస్థితులకి కారణం మీరేగా!"

"యిక్కడే కొంచెం వేదాంతం అవసరం. పరిస్థితులు మనుష్యుల యిష్టాయిష్టా ల్నధిగమించి వస్తూంటాయి !'' నవ్వాడు మూర్తి.

''నాకు మీ వేదాంత మేం అక్కర్లేదు. యిప్పు డింటికి రండి.''

"అయిదేళ్లు దాటినా నువ్వు నా వేదాంతాన్ని గౌరవించడం నేర్చుకో లేదు !''

''మహాప్రభో ! మీరు స్వామి వివేకానంద తర్వాత అంతటివారు. సరేనా ? యింక నా మాటకి సమాధానం చెప్పండి,''

"నాకూ ఓ చెల్లెలున్నా, నీ అంత అభిమానం చూపించేదిగాదేమో !''

"అయితే రారన్నమాట !"

"సారీ, యివాళ గాదు. మరో సారి.''

.... .... .... .... ....

"కోపమా ?''

.... .... .... .... ....

"తల్లివి కాబోతున్నావు. నీ కింకా ముక్కుచిగుర్ను కోపం పనికిరాదు ఉషా!"

"ఎలాగైనా మీ రిహాళ మా యింటికి రావాలి!" రావు బలవంతం చేసే ధోరణిలో అన్నాడు.

"ఆయన పెద్ద ఆర్మీ ఆఫీసరు; ఎనిమిదివందలు జీతం; మనలాంటి సామాన్యుల యిళ్ళకెలా వస్తారండి! అడగడం మనదే తప్పు!" ఉష గొంతులో బాధ ధ్వనించింది.

"మనిద్దరిమధ్య యిలాంటి మాటల కవసరం కలుగుతుం దని ఎప్పుడూ అనుకోలేదు నేను!"

"అవసరం కలిగించింది మీరే!"

"ఉషా!" గట్టిగా నవ్వాడు మూర్తి. "యీ వీకెండ్ పూర్తిగా మీ యింట్లోనే; శనివారం సాయంకాలం అయిదింటికి మీ యింటో హాజరవుతాను. ఆదివారం సాయంత్రం అయిదింటికి నన్ను వదలాలి. యీలోగా డిన్నర్, సినిమా, పిక్నిక్ - ఏం అరేంజ్ చేస్తావో చూస్తాను!"

"వస్తా రని గారంటీ ఏమిటి?"

"నా మాటకి అంత విలువ ఉందన్న మాట నీ దృష్టిలో!"

"అబ్బె, అదేం కాదు, ఊరికే అన్నాను. ఐరన్‌విల్ ఎలాంటిదో నాకు తెలియదూ!" ఉష నిండుగా నవ్వింది.

"ఆకాశంలో చందమామ లేకుండానే మల్లెపూల్లా వెన్నెల విరుస్తోం దేమిటో చిత్రం!"

"ఉహూఁ!" ఉష కోపంగా చూసి మూతి ముడిచింది.

"లోకాన్ని చీకటిచెసేయకుమరి!"

"పాతవిట్లు వల్లించేబదులు క్రొత్త కబుర్లు ఏవన్నా చెప్పకూడదూ! ఏయేచోట్లు తిరిగారు? యిన్నేళ్ళు యెక్కడున్నారు? యెలా గడిచాయి రోజులు? లడఖ్ ఆపరేషన్లో మీరక్కడ ఉన్నారా?"

"యుద్ధ విశేషాలు ఆడవాళ్ళకి చెప్పవద్దని ఇతిహాసం, శాస్త్రం రెండూ చెప్తున్నాయి!"

"నేనేం యుద్ధం గురించి చెప్పమనడంలేదు!"

"అయినా నీ దగ్గిర నాకు దాపరిక మేమిటి ఉషా!"

"అన్నీ మీరే అంటారు! ఎన్నేళ్ళు ఐతే నేం, ఆ మాటల గారడీ యెక్కడికి పోతుంది?"

"అన్నట్టు యిప్పుడా ఓల్డ్ హేగ్ ఎక్కడుంది?"

ఉష విరగబడి నవ్వింది ఆ మాటకి.

"మీ రింకా ఆవిడని క్షమించ లేదన్నమాట! అంత పగ ఏమిటి బాబు!"

"యీ జన్మలో మర్చిపోలేని మహా వ్యక్తుల్లో ఆమె ఒకతే!"




"ఏమోయ్ నీ ఫ్యాక్టరీ కాలిపోయిందటగా! ఆ మంట లెవ్వరూ ఆర్పలేకపోయారటగా! ఇంతకూ ఆ ఫ్యాక్టరీలో ఏం తయారు జేస్తారోయ్?"

"హుఁ, నిప్పు నార్పు యంత్రాలు."

"కాకినాడలో లెక్చరర్ అనుకుంటాను!"

"నీ కెప్పుడన్నా ఉత్తరాలు రాస్తూందా?"

"నా కామెతో పరిచయం తప్పించి స్నేహ మసలులేదు. ఏదో ఒకచోట ఉండే వాళ్ళం గాబట్టి మాట్లాడేదాన్ని. ఐనా మీ రంత మరీ సెన్సిటివ్ అయితే ఎలా చెప్పండి!"

"వా ళ్తేర్లో జరిగిన ప్రతి సంఘటనా, నాలో చెక్కుచెదరకుండా ఎప్పటికీ నిల్చిపోతుంది!"

"ఆ రోజుల ప్రభావం అలాంటిది!"

"నే నొక మనిషిగా తయారయింది యూనివర్సిటీలోనే! అందుకే ఆ రోజుల కంత విలువ!"

"మీ రొక్కరేగాదు అందరూ అంతే"

"అందరి విషయమూ మాట్లాడకు, ఇప్పుడు నీ సంగతి, నా సంగతే మాట్లాడుకుందాం"

యిద్దరూ మెల్లిగా రెయిలింగ్ వైపు చేరారు. హుసేన్ సాగర్ నీళ్ళలో చీకటి తెరలు దిగుతున్నాయి. రాత్రి దీపాలకాంతుల్లో అమ్మాయిలు అబ్బాయిలు క్రొత్త అందాలు అరువు తెచ్చుకుంటున్నారు.

"వెన్నెల రాత్రులు. బీచిలో రెండింటిదాకా నిద్రా, తిండీ మర్చిపోయి ఏమేమిటో పిచ్చిగా మాట్లాడుకున్న ఆ రోజులు లాంటివి మళ్ళీ ఎప్పుడన్నా చూస్తామా అనిపిస్తుంది!"

"ఒకవేళ అలాంటి రాత్రులు వచ్చినా, అలా అనుభవించగల హృదయాలు మన కుండవు. ఆ వయస్సు అలాంటిది!"

"అన్నట్టు మీ ఆర్టిస్టుఫ్రెండ్ ఎక్కడ యిప్పుడు?"

"పాపం, యిబ్బందుల్లో ఉన్నాడు, కృష్ణమోహన్. నా కెంతో సహాయం చేసి ఆదుకున్నాడు. నాకవసరం వచ్చినప్పుడు. అలాంటిది అత నడిగినప్పుడు వేమీ చేయ్యలేకపోయాను! ఆ జ్ఞాపకమే న న్నెప్పటికీ చిత్రవధ చేస్తూంటుంది!"

"ఏం చేస్తాంలెండి! ఒక్కోసారి అవకాశం ఉండకపోతుంది!"

"పాపం, ప్రతీ ఉగాదికీ, దీపావళికీ కొత్త పెయింటింగ్ ఒకటి వారాలకి వారాలు కష్టపడి గీసి, అందమైన గ్రీటింగుతో పంపేవాడు. ఒకసారేం రాశాడో తెలుసా? తనూ, తనలాంటి వాళ్ళెంతోమంది 'ఎంతవాడయ్యాడు మూర్తి' అని అసూయతో కుళ్ళేటంత పెద్దవాడ్నయిపోవాలిట! అంతటి అభిమానానికి నేను చేసిన ప్రతికృతి, అడక్క అడక్క అతను వంద రూపాయలు అడిగితే వీల్లేదని జవాబివ్వడం ఒకోసారి నా అసమర్థతకి నాకు అవమానంగా ఉంటుంది!"

"మీరు గాబట్టి అంతగా ఫీలవుతున్నారు. ప్రతి మనిషి జీవితంలోనూ యిలాంటి సంఘటన లెన్నో జరుగుతూనే ఉంటాయి. వాటిని మర్చిపోవా లంతే!"

"ప్రతీ మనిషి సంగతి అలా ఉంచు. అందర్లాగానే మనమూ ఉండాలా?"

"ఇంతకీ యిన్నేళ్ళ మనస్నేహం యిలా మూలపడినందుకు ఏం విచారం లేదన్నమాట!"

మూర్తి మాట్లాడలేదు.

"మాట్లాడరేం?"

"ఏవో పరిస్థితుల్లో అప్పు డంతా అలా జరిగిపోయింది. ఆ తర్వాత ఎంత ప్రయత్నించినా వీలుకాలేదు. ఒక విధంగా చూస్తే తప్పంతా నాదే. కాని.... జరిగిపోయిందానికి విచారించి లాభ ముండదని తృప్తిపడాలి మనం."

"మన విషయందగ్గిరకి వచ్చేసరికి వేదాంతం వస్తుంది!"

"నీ మనసులో బాధ అణుచుకోలేక నువ్వు బయట పెట్టున్నావు! నేను అది లోపల కాలుస్తున్నా దాచుకోవాలని చూస్తూన్నాను!" అంతే తేడా!"

మూర్తీ, ఉషా దగ్గిరగా నడుస్తూ రహస్యాలు చెప్పుకుంటున్నంత మెల్లిగా మాట్లాడుతూంటే, అడ్డు తగు

ల్తున్న మనుష్యుల్ని తప్పించుకుంటూ అడుగులు వేస్తున్న రావుకి వాళ్ళ మాటలు పూర్తిగా వినబడ్డంలేదు.

బస్ స్టాండ్ దగ్గిర ఆగారు ముగ్గురూ. ఉమ కళ్ళలో నీటిపొరలు మెరవడం చూశాడు రావు. మూర్తి మొగంలో ఆనందమో, విచారమో తెలియని చిరునవ్వుంది.

"వెళ్తానండి. మళ్ళీ కలుసుకుందాం." రావుతో చెప్పాడు మూర్తి.

"శనివారం తప్పకుండా రావాలి." రావు చేతులు కలిపాడు.

"ఉష్ !"

"ఊఁ !"



"వెళ్తున్నా! ఒక్కసారి నవ్వుతావా?"

ఉష పెదాలమీద పేలవంగా కదిలిన నవ్వు పూర్తిగా చూడకుండానే వెళ్లిపోయాడు మూర్తి.

బస్ వచ్చేవరకు అతని వంకే చూశారు యిద్దరూ. బస్‌లో కూర్చొన్నంత సేపు బయటికి, రోడ్డుమీదికి చూస్తూ ఉండిపోయింది ఉష.

"నీకు అంత బాగా తెలుసా ఆయన?" రావు అడిగాడు బస్ దిగి యింటికి నడిచే దారిలో.

"అన్నయ్య కాయన అంటే పంచప్రాణాలు. 'ఆడపిల్ల వయితే అతనికిచ్చి పెళ్లి చేసేవాళ్లం! మగాడివై పోయావు!' అనేది అమ్మ. అన్నయ్యా, ఆయనా హైస్కూలు నుంచి కాలేజీ దాకా కలిసి చదివారు. ఆ తర్వాత ఆయన వార్తేర్లో చేరారు. అన్నయ్య కాకినాడలో. ఆయన వెళ్లిన తర్వాత మరో ఏడాదికి నేను వెళ్లాను. అక్కడే పరిచయం."

మూర్తి పొడుగు కాదు: దృఢమైన శరీరం. యీ లోకంలో ఎవర్నీ లెక్క చెయ్యనట్టు నిర్లక్ష్యం నిండిన చూపులు. సన్నగా నాజూగ్గా ఉన్నాడు—ఆలివ్ గ్రీన్ యూనిఫారం. పీకాక్ క్రాస్ బెల్ట్, బుజాల మీద మూడు నక్షత్రాలు, ప్రక్కల్ని "జాట్" అని ఇంగ్లీషులో మూడు అక్షరాలు—ఇన్‌ఫెంట్రీ యూనిఫాంలో మూర్తి. వాలుందాకి. రివికి నమూనా అన్నట్టున్నాడు ప్రాణాలకి లెక్కచెయ్యని సాహసానికి, శౌర్యానికి ప్రసిద్ధి చెందిన జాట్ రెజిమెంటులో ఆఫీసరుకి కావాలిసిన తెగింపు, పట్టుదల, ఆత్మవిశ్వాసం మూర్తిలో ఉట్టిపడుతున్నాయి. రావుకి మూర్తి విగ్రహం కళ్లెదుట నిల్చింది.

"ఆయనకున్న తెలివితేటలకి, బయటెక్కడున్నా ఆమాత్రం సులభంగా సంపాదించగలరు! కాని ఏమిటో, మనిషి మొదట్నుంచీ అదో మోస్తరు. తన కెంత తోస్తే అంతే. యింక దేవుడు దిగొచ్చినా అనుకున్నది మానడం లేదు. అందులోనూ ఎవరన్నా అది చెయ్యడం కష్టం. అది చెయ్యవద్దంటే, ముమ్మాటికీ చేసితీరే రకం!"

"దేశ రక్షణకి అలాంటి వాళ్లే కావాలి!"

"దేశాన్ని రక్షించడానికి ఈయనే వెళ్ళాలేమిటి?"

"ఎవరిమటుకు వాళ్ళు అలానే అనుకుంటే యింకెలాగ?"

"రేపు యీయన కేమన్నా అయితే ఆ బాధ ఎవరికి?"

రావు మాట్లాడలేదు.

ఆ తర్వాత ఒకటి రెండు రోజులు రావుకి ఉషకి మధ్య సంభాషణలు



"రేయ్ చెల్లాయి చెవి ఎందుకు కొరికావురా ?"
"నే కొరకలేదు నాన్నా. అదే కొరుక్కుని ఏడుస్తోంది."

మూర్తి చుట్టూనే తిరిగాయి రావు మాట్లాడిందేం లేదు ఉషలో మూర్తి ఎంతలోతుగా నాటుకున్నాడో తెలుసుకోడానికి అతను చేసిన ప్రయత్నాలు అవన్నీ

మూర్తి ప్రవర్తన ఎన్నడూ ఎవరూ వంక పెట్టలేనట్టిది. కపటం, కల్మషంలాంటివి అతనికి తెలియవు నిజమనుకున్నది తెగేసి చెప్పడం, నిజం కానిది ఎవరు చెప్పినా అప్పటికప్పుడే ఖండించడం అతని నైజం అతనిలోనూ కొన్ని బలహీనత లున్నాయి. మొండితనం, మితిమీరిన ఆత్మవిశ్వాసం ఎదటివాళ్ళని నిర్లక్ష్యం చేసేంత వరకు. తీసుకుపోతాయి ఒకోసారి పట్టుదల పరిస్థితుల కెదురీదమంటుంది. అందువల్ల భంగపడ్డం మిగుల్తుంది చివరికి కాని యివన్నీ లోపాల్లా కనిపించినా, నిజానికి అతని ధైర్య సాహసాలకి నిదర్శనాలు ఆ పట్టుదలతోనే అత నెన్నిట్లోనో పేరు తెచ్చుకున్నాడు కథలురాశాడు, ఉపన్యాసాలిచ్చాడు నాటకాల్లో వేషాలు వేశాడు నిజానికి వీటిలో ఎందులోనూ అతనికి జన్మతః వచ్చిన కౌశలం అంటూ ఏంలేదు. కేవలం పట్టుదలతో, కుతూహలంతో అన్నిట్లోనూ ఔననిపించుకునేవాడు మూర్తి. చివరి కా పట్టుదలే ఆర్మిలో చేర్పించింది. యింటి దగ్గిర ఏది ఏమిటో తెలియని ముసలివాళ్లని మాయజేసి స్నేహితు లెవరేం చెప్పినా వినకుండా యింత చదువూ

చదివి . ఇన్‌ఫెంట్రీలో జేరాడు! మూర్తిలో అన్నిటికన్నా చెప్పుకోదగింది — స్నేహితులకి స్నేహాలకి అత నిచ్చే విలువ. అతను మనసార నమ్మిన స్నేహితులు కొద్దిమందే అయినా, వాళ్ళకోసం అతను ప్రాణ మిస్తాడు. అంతకన్నా అత నంటే ఎక్కువ అభిమానం అతని స్నేహితులకి. అతనిలో గుణాలకన్నా లోపాలు మరింత ఆకర్షనీయంగా ఉంటాయి. అత న్నెరిగున్నవాళ్ళందరికీ అత నొక ఆదర్శమూర్తి.

ఉష రకరకాల సన్నివేశాల్లో మూర్తి గురించి వ్యక్తపర్చిన అభిప్రాయాల సారాంశం అది. అస లంతగా మాట్లాడే రకంకాదు ఉష. రావు ఆమె నెరిగిఉన్న పడాదిలో ఆ రోజు చూసినంత ఉత్సాహంగా ఉల్లాసంగా ఎన్నడూ చూడలేదు. ఆ రోజు ఆమె మొగంలో, అతనితో మాట్లాడ్తున్నంతసేపూ కోటిదీపాల కాంతి కళకళ్ళాడింది.

---

ఏమిటి సంబంధం? వాళ్ళిద్దరూ వాత్తేర్లో గడిపిన రెండేళ్ళూ రావు ఊహాలోకంలో రకరకాల బొమ్మల్ని చూపెడ్తున్నాయి. రావు వాత్తేర్ చూడలేదు.

అర్ధరాత్రి పన్నెండు గంటలు. వెన్నెల. బీచ్. మూర్తీ, ఉషా యిద్దరూ మరెవ్వరూ లేని ఒంటరి తనంలో సముద్రం అలలు చేసే హోరు మధ్య ఏవో 'స్వీట్ నథింగ్సు' మర్మరిస్తూంటారు. మూర్తి నోటంట వచ్చే ప్రతీ మాటా వేద మన్నట్టు ఆరాధనలో తన్మయురాలై ఉంటుంది ఉష. ఆ సంబంధం ఎలాంటిది?

"వెన్నెల రాత్రులు బీచిలో రెండింటి దాకా నిద్రా, తిండీ మర్చిపోయి ఏమిటేమిటో పిచ్చిగా మాట్లాడుకున్న ఆ రోజుల్లాంటివి మళ్లా ఎప్పుడన్నా చూస్తామా అనిపిస్తుంది!" మూర్తితో ఉష అన్నమాట లవి!

ఆ పిచ్చిమాట లెలా ఉంటాయి? రావు ఆలోచించాడు. ఆలోచించిన కొద్దీ మరీలోతుగా దిగిపోతున్నట్టుంది.

"యింతకీ యిన్నేళ్ల మన స్నేహం యిలా మూలపడినందుకు ఏం విచారం లేదన్నమాట?" మరో సందర్భంలో ఉష అడిగింది.

ఉష కిప్పు డున్న పరిస్థితి బాధాకరంగా ఉందా? మూర్తిని చూడగానే ఆమెలో వెలిగిన కాంతి కేమి టర్థం? ఏ మనుకోవాలి తను?

అసలు........

మొదట్లో పరిచయం చేసేప్పుడు "మీట్ మై బాస్" అంది ఉష. అధునికంగా కనబడింది, గాని—తను యజమాని! అతను స్నేహితుడు! ఆమె దృష్టిలో తమ యిద్దరి స్థితులూ అవేనా? రెంటికీ యెంత తేడా?

. చిన్నవిగా మొదలైన ఆలోచనలు క్షణ క్షణానికి పెద్దవై పోతున్నాయి సాయంకాలం నీడల్లా పెరిగే వాటిని చూస్తే చెప్పలేని భయం, బాధ!

ఉష అందర్లాంటిదీ కాదనుకునే వాడు తను. ఆమె నిబ్బరత్వం, ప్రశాంతత చూసి ఎన్నడూ కఠినంగా మాట్లాడదు, అసలా చూపుల్లోనే ఎదటివాళ్ల కాఠిన్యాన్ని కడిగేసే నిర్మలత నిశ్చలత్వం ఉన్నాయి ఆ నిరాడంబరతని చూసి తను చాలా అదృష్టవంతు డనుకునేవాడు కాని లోతు నీరు గంభీరంగా ఉంటుం దంటారు. ఉష ఆమాట ఋజువు చేసింది ఆమె హృదయపు లోతు తనెంత తరిచినా అంతు చిక్కడంలేదు ఆమె కేవలం అతని అభిమాని మాత్రమేనా? లేక—

"నాకూ ఓ చెల్లెలున్నా, నీ అంత అభిమానం చూపించేది గాదేమో!" మూర్తి అన్నాడు ఒక చోట.

రావు ఒక నిర్ణయాని కొచ్చాడు, యింక ఆలోచనలకి పెద్ద బ్రేకు వేసి మూర్తికి చెల్లెలు లాంటిది ఉష అన్నా చెల్లెళ్లిద్దరికీ మూర్తి ఓ మహామేరు వంతటి మనిషి అతని ఆరాధనలో వాళ్లిద్దరూ లోకాన్నే మర్చిపోతారు లేకపోతే తన ఉనికే గమనించకుండా అతనితో అలా మాట్లాడేదా? తనతో కూడ ఎన్నడూ అంతగా మాట్లాడి ఎరగని ఉష!

అలా అనుకుంటే రావుకి శాంతిగా ఉంది! ఉష మాటలు వేటికీ యిప్పుడు విపరీతార్థాలు రావు. మరోలా అనుకుంటే ఆ జీవితాంతం తనని విడవకుండా వెంటాడే నీడ, తనకీ తన కుటుంబానికీ శాంతి, సుఖం కరువు చేస్తుం దని రావుకి తెలుసు.



# ఆమె చెప్పిన కథ

కె. ఎ. స్వామి

సౌభాగ్యవతి శశికి —

శశీ! ఈ నా ఉత్తరాన్ని చూచి నీవేం ఆశ్చర్య పడనక్కర్లేదు. నీ పై నా కున్న మక్కువ ప్రభావం వల్లో — లేక నాపై నీవు చూపే చొరవ వల్లో నే నీ వాడు నాహృదయాంతరాల్లో ఘోషిస్తోన్న గాథను — కాదు బాధను నీ ముందు వుంచుతున్నాను సావధానంగా చదువు కాని మధ్యలోనే ఉత్తరాన్ని చదువడం ఆపకని నా ప్రార్థన.

నీకు తెలుసు మన చిన్ననాటి ముచ్చట్లూ మురిపేలూ. మన వివాహాలు గూడ ఏ ఏ పరిస్థితుల్లో జరిగాయో గూడ మనం మరువలేం!

చల్లగాలికి నదీతీరాల్లో మెత్తని ఇసుకలో వయ్యారంగా నడుస్తూ ఆకాశపు నీలిని, పండబారిన సూర్యుని కనకాంబరపు సోయగాల్ని విలోకిస్తూ నీ వేమనే దానవో తెల్సా — "చిట్టీ! చంద్రుణ్ణి చూస్తే కలువలకు ఉలుకు చకోరాలకు సంబరం కాని నిన్ను చూస్తే ప్రకృతి యావత్తూ పులకించిపోతుంది" అంటూ నన్నూ, నా అందాన్నీ తెగ పొగిడే దానవు. నిజంగా నాలో అణగారిన అందాన్నీ, అనుభూతుల్నీ రెచ్చగొట్టింది నీవే ఆ నీ పొగడ్తలు విన్నపుడెల్లా ఆనందోద్రేకాల్తో నా శరీరం గగుర్పొడిచేది నా అందాన్ని చూచుకొని నే నెంతో వివశురాల్నయ్యేదాన్ని గూడ.

అందు కనుగుణంగా నీవు గూడ అంటూండే దానవు..."నీ కేం బంగారు బొమ్మవి దానికి తోడు డబ్బుందీ — చదువుంది నీ వో గజిటెడ్ ఆఫీసరుగారి భార్యవు కాకమానవు. అహో! నీ జీవితం ధన్యం."

దాపరిక మెందుకు శశీ! నీవా మాట లన్నపుడెల్లా నే నో గజిటెడ్ ఆఫీసరు గారి భార్యలా, ఆ దిన మంతా రీవిగా, డాంబికంగా మసలేదాన్ని దాంతో ఎన్నో ఆవకతవక పనులు జరగడం, నాలుక్కొరుక్కోవడం ఎన్నోమార్లు జరుగుతుండేంది

ఒక్కమారు ఏమయిందో తెల్సా? మా పక్కింటి నీరజ మద్రాసునుండి తన యింటికి వచ్చిన ఫ్రెండ్సుని మా ఇంటికి తెచ్చింది—నాకు పరిచయం చేయడానికై.



ఆ దినం నిజంగా వేవెలాంటి అనుభూతుల్లో, భావపరంపరల్లో వున్నానో ఏమో – వాళ్ళ మాటలకంత నిర్లక్ష్యంగానూ, ముభావంగానూ సమాధానా లిచ్చానట. అందుకే వాళ్ళు మేడమెట్లు దిగేప్పుడు నాకు వినబడేలా "ఏమి టావిడ

ఉద్దేశ్యం? గజిటెడ్ ఆఫీసర్లా ఆ గుం భనా, ఆ నిర్లక్ష్యమూను . అంతగర్వం దేనికమ్మా" అం దొకామె

"ఛఛ! అలాంటి దేంగాదు ఈ దినం దానికి వంట్లో నలతగుంది గాబోలు" అంటూ సమర్థించింది నీరజ దానికి నా ప్రాణం చివుక్కుమంది నన్ను నేనే నిందించుకున్నాను

చూడు శశీ! నాలో అందంతో బాటు అభివృద్ధి చెందిన యవ్వనం గూడ నన్నుక్కిరిబిక్కిరి చేస్తూ నా చుట్టూ వింత ప్రపంచాన్ని సృష్టించేది ఎన్నో ఆలోచనల్ని, ఆశల్ని రేపి ఊహలకు ఆకారాల్ని గూడ కల్పించి జోలపాట పాడేది దానికి అనుగుణంగా నీవూ తాళం వేసేదానవు—"నీ తీరే వేరు . నీ ఊహలే వేరు నీకు పెళ్ళైనతర్వాత నన్నుమాత్రం మరిచిపోకు."

అమ్మో నిన్ను మరువడమే శశీ! ఆ నీ మాటలు నా నరాలన్నిటినీ ఉత్తేజ పరిచేవి ఊహల్లో స్వర్గంలో విహ రించేదాన్ని ఆ నాటినుండి నా అందంలో, నా యవ్వనంలో, నా ప్రేమలో ఓ ప్రత్యేకత వుందనుకున్నాను, కాని శశీ! అదే నా మొదటి తప్పిదం అనుకుంటా

శశీ! నీకు తెల్సు నేను డాక్టర్ విశ్వంను ఎంతగా ప్రేమించింది అతని చూపుల్లో కమ్మదనం వొలికేది, పాటలో పరవశం పొర్లేది అతని వ్యక్తిత్వం నాకు బాగా నచ్చింది అందుకు నీవు గూడ నన్ను మెచ్చుకున్నావ్! "అతని కేం మన్మధునిలా వున్నాడు, గొప్ప భవి ష్యత్తు గలవాడు" అనిగూడ అన్నావు నాతో దాంతో అతని సాన్నిధ్యాన్ని మరింత అభిలషించాను అతని చూపుకై, అతని మాటకై గిజగిజ లాడాను, ఆ నాటి ఆ నా పరితపన ఈ నాడు తల్చు కుంటే నవ్వొస్తోంది శశీ!

"ఈ దినం కాలేజీకి సెలవుగా మళ్ళీ తయారవుతున్నావు ఎక్కడికో" అం దొకనాడు మా అమ్మమ్మ నా ముస్తా బును చూచి

"లెక్చరర్ ఈ దినం 'అనాటమీ' లో స్పెషల్ క్లాసు పెట్టుకున్నాడు, వెళ్ళాలి అమ్మమ్మా!" అంటూ బైటకు పరు గెత్తాను తిన్నగా విశ్వం రూముకు వెళ్ళి అతనితో అలా 'షైరు' తిరిగివచ్చేదాన్ని అతనికోసం నే నెన్ని అబద్ధా లాడానో, ఎన్ని ప్రయాసలు పడ్డానో అ దంతా వ్రాస్తే అవన్నీ ఓ పురాణం కాగలదు

శశీ! "ఉద్రేకంలో పొరపాట్లనేకం. జాగ్రత్తసుమీ!" అన్న ఆ నాటి నీ మాట లకు అప్పట్లో నే నంత ప్రాముఖ్యం ఇవ్వలేకపోయాను కాని ఈ నాడు అవే నాకు వేదవాక్కులైనాయ్,

నీకు బాగా జ్ఞాపకం నేనే అతణ్ణి ముందుగా అడిగాను — "నే నెలా గుంటాను" అని ఎలాగైనా నా అభి ప్రాయంతో బాటు అతని అభిప్రాయం గూడా తెల్సుకోవా లని నా అభిలాష.

అతడు ముద్దుగా నా వైపు చూస్తూ "బొద్దుగా అచ్చం అజంత సుందరిలా గుంటావు ?" అన్నాడు. పెదాలపై దరహాస రేఖల్ని మెలిబెడ్తూ సిగ్గుతో ఎర్రబడ్డ అధరాల్ని ఒక్కమారు ఎడమ చేత్తో తడువుకొని క్రీగంట అతన్ని చూస్తూ "విశ్వం ! నన్ను చూస్తే నీకేం అవుపించడంలేదూ ?" అన్నాను మళ్ళీ. అలా అడిగినందుకు నాకు నిజంగా సిగ్గేసింది నా గుండె వేగంగా కొట్టుకో సాగింది

అతడు నదిలోని నీళ్ళను కాళ్ళతో చిలికిస్తూ నా వైపు అదోలా చూచి మెల్లగా నవ్వాడు నిజంగా ఆ నవ్వు మరువ రానిది శశీ ! ఆ నవ్వులో వెన్నెలలు కురిశాయి ఆ నవ్వులో అమృతం చిందింది నాలోని కోర్కెలన్నీ ఒక్క మారుగా విజృంభించినాయ్ !

"విశ్వం ! నిన్ను ప్రేమిస్తున్నాను" అన్నాను ఇక ఉండబట్టలేక దానికతడేం అదిరిపడలేదు నిజానికి శశీ ! ఆ నా మాటలకు మరొకరైతే అమాంతం ఆకాశమంత ఎత్తు ఎగిరిపడి ఆనందంతో ఉక్కిరి బిక్కిరై ఆనంద భైరవిలో ఓ ప్రేమగీతాన్ని ఆలాపించి ఉండేవారు కాని విశ్వం మాత్రం గారంగా నా కళ్ళ లోనికి చూస్తూ 'నీ ప్రేమ నాకు తెలుసు చిట్టీ !" అన్నాడు.

"మరెందుకు నన్నిలా వేధించడం? సంకోచించకు నేను నీదాన్ని విశ్వం..." అన్నాను ఉద్రేకంతో, అతని కళ్ళలోకి చిలిపిగా చూస్తూ.

అప్పటికీ అతనిలో ఎలాంటి ఉద్రేకం కనబడలేదు మామూలుగానే నా వైపు తిరిగి "చిట్టీ ! నీవు చాలా త్వరపడు తున్నావు !" అన్నాడు నిజంగా అది నాకేమంత త్వరపడ్డట్లు అవుపించలేదు. ఆ పరిస్థితుల్లో వున్న మరే స్త్రీ అయినా సరే నాలానే ప్రవర్తించివుండే దనడంలో సందేహంలేదు అందువల్ల అతని మాటలు నన్ను నిరుత్సాహం పర్చినయి. అయినా నాలో ఎలాంటి మార్పును కన బర్చక ఎప్పటిలా నవ్వుతూ "ఇందులో ఆలోచించవలసింది ఏముంది విశ్వం?" అన్నాను

అతడు నా ఎడమచెక్కిల్ని తన కుడి చూపుడువ్రేలితో నొక్కి "భవిష్యత్తును గూర్చి ఆలోచించాలి చిట్టీ ! అదే మనకు ముఖ్యం" అన్నాడు నవ్వుతూ.

ఆతనిలోని భావా లేమిటో అప్పటి కేమీ నాకు అంతు చిక్కలేదు. వలచి వచ్చిన స్త్రీని అంత చులకనగా చూడ్డం నిజంగా మగవారికి క్షంతవ్యం గాని అపరాధంగా భావించాను ఆ విషయం అంతటితోనే ముగించడం మంచిదనుకొని సంభాషణ మరో విషయం మీదకు మార్చాను

ఆ రాత్రంతా నాకు నిద్ర పట్టలేదు అతని ఉద్దేశ్యం ఏమిటో ఎంత ఆలో చించినా తలకు వేడితప్ప మరేం ప్రయో

జనం లేకపోయింది. క్షణికోద్రేకాల్తో కేవలం శరీర వాంఛల్నీ... వరాల ఉద్రేకాల్నీ అణచుకొనేందుకు నే నలా ఆన్నా నని ఆత డనుకున్నాడేమో నని చాలాసేపు బాధ పడ్డానుగూడ చివరకు నే నొక నిర్ణయానికి వచ్చాను

శశీ! ఆ నా నిర్ణయాన్ని నీవుగూడ బలపరిచావు! "నీవు ఎంతైనా తెలివిగల దానవు! మీ ఇంటను చూచి లోకం ఈర్ష్యపడక మానదు" అన్నావు నా కళ్ళ లోకి సూటిగా చూస్తూ.

ఆ తర్వాత నా నిర్ణయాన్నేమీ దాచుకోకుండా మా నాన్నగార్కి తెలియ పర్చాను. విశ్వంను గురించి ఊరించి చెప్పానుగూడా. దానికి మా నాన్నగారు నవ్వారు. "అమ్మాయ్! నీ వంతగా చెప్పాలా? ఏనాడుమాత్రం నీ మాటను కాదన్నా నని? ఆతణ్ణి గూర్చి ఇంతకు ముందే విన్నానుగూడ. మంచి భవిష్యత్తు గలవాడు, నీ అందానికీ, ఆశయాలకూ తగ్గవాడు. నీ తల్లి జీవించి వుంటే ఎంత సంతోషించి వుండేదో?... నీకోరిక తప్పక నెరవేరుస్తానమ్మా..." అన్నాడు స్వర్గంలోని మాఅమ్మకునాన్న జ్ఞాపకం వచ్చేసరికి మా నాన్నగారి కంఠం రుద్ధత పొందింది

ఆ క్షణంలోగూడ కళ్ళనిండా నీళ్ళు తిరిగినయ్, నిజంగా అమ్మేగనుక బ్రతికి వుంటే నన్ను చూచి ఎంత సంబర పడేదో? అమ్మకు లోలోపల్నే జోహారు లర్పించాను సజల నేత్రాల్తో.

శశీ! విశ్వంతో పెళ్ళికి మా నాన్న గారు ఒప్పుకున్నందుకు నీవు గూడ నా చుబుకాన్ని నిమురుతూ "చిట్టీ! నిజంగా నీ జాతకం అపూర్వం నిన్ను చూస్తే అందరూ మంత్రముగ్ధుల్లా నిన్నను సరిస్తారు. అదే నీలోని ప్రత్యేకత అలాంటిది అందరికీ లభ్యమౌతుందా?" అన్నావు అప్పుడు నిన్నావేశంతో ముద్దు పెట్టుకొన్నట్లుగూడ నాకు బాగా జ్ఞాపకం శశీ! నా అల్లరికి నీవు అప్పుడప్పుడు విసుక్కొనే దానవుగూడ అయినా నన్నేనాడూ నీవు విడిచియుండే దానవు గాదు నేను నా హృదయాన్ని నీ ముందు విప్పంది వుండేదాన్నిగాదు.

శశీ! నా నిర్ణయాన్ని విన్న విశ్వం నా జడ రిబ్బను మెలిబెడ్తూ "నీవు నిజంగా సాహసవంతురాలివి చిట్టీ" అన్నాడు అనురాగపూరితంగా.

"నా ఆరాధ్యదైవాన్ని నాలో ప్రతిష్ఠించుకోవడం ఒక సాహసంగాదు దాన్ని కలకాలం పూజించే యోగ్యతే నిజమైన సాహసం ఔతుంది" అన్నాను, అతని చొక్కాకాలర్ సరిచేస్తూ

దాని కతడు వీలుగా నావైపు తిరిగి "అదిన్నీ నీ చేతులలోనే వుంది చిట్టీ" అన్నారు "అది నిజంసుమీ" అన్నట్టు అప్పుడే ఓ ప్యాసెంజర్ ట్రైన్ కుంగ




భద్ర బ్రిడ్జిమీంచి హైదరాబాదువైపు వెళ్ళిపోయింది

శశీ! నిజాని కానాడు అతనిమాటల్లోని పరమార్థా న్నాలోచించవలసినంత అవసరం లేకపోయింది కాని ఈ నా డది నా జీవిత ధ్యేయాన్నే తలక్రిందు లొనర్చింది

నా సుఖమే తన సుఖంగా—అంతేగాదు తనకర్తవ్యంగాగూడ భావించే మా నాన్నగారు విశ్వం పెద్దల్తో సంప్రతించి విశ్వంతో నా వివాహం జరిపించేశారు.

మా పెళ్ళి మహా వైభవంగా జరిగిపోయిందనీ, నిజంగా అలాంటి పెళ్ళిళ్లు మన దేశంలో బహు అరుదనీ నీవు ఆనాడు అన్నావు' అదేమోగాని శశీ! ఆనాటి నీ మాటలన్నీ వేదవాక్కులనుకో నిజంగా నాలాంటి పెళ్ళిళ్ళు బహుశః ఈలోకంలోనే అరుదని నేను ఘంటాపదంగా చెప్పగలను ఈనాడు

శశీ! ఇంతవరకు సవ్యంగా జరిగిపోయిందంతా ఇక ఇక్కణ్ణుంచే అసలుకథ మొదలౌతుంది ఈ ఉత్తరం వ్రాయడానికి నన్నావేశపరచిన హృదయాంతరాల్లోని ప్రళయతాండవం బైటపడ్తుంది సావధానంగా చదువు

శశీ! అతణ్ణిగూర్చి నే పొందిన అనుభూతులూ, కన్న కలలూ, నిర్మించుకొన్న సౌధాలూ నిజంగా పేకమేడ లని నా కిప్పుడు తెలిసివచ్చింది అయినా అందు క్కారణం మరెవ్వరో గాదు

చేజేతుల నిర్మించుకొన్న నరకం ఇది శశీ! చేతులు కాలిన తర్వాత ఆకుల్ని పట్టు కోవడం అర్థరహితం అందుకే ఏవర్నీ నేను నిందించడంలేదు నీవుమాత్రం నా చెలివనీ, నా ఆప్తురాలివనీ ఎప్పటిలా నా హృదయంలోని తాపాన్నీ, పరితప నసీ నీముందు వుంచుతున్నా

మా పెళ్ళినాటికి పరీక్షలు రెండే రెండు మాసాలుండడంవల్ల మా శోభనం వాయిదా పడది అది నీకూ తెల్సు నిజానికి అత డిక నావాడై పోయినందున అది నా కేమంత బాధ అనిపించలేదు అతని సాన్నిధ్యంలో, అతని చూపుల్లో, అతని పలుకరింపుల్లో, లాలింపు కవ్వింపుల్లో ఎంతో మురిసిపోయేదాన్ని

రెండునెలలూ రెండుక్షణాల్లా దొర్లి పోయినయ్ ఇద్దరం పరీక్షలు బాగా వ్రాశాము పరీక్షలు ముగియగానే అతడు మా అందరి వద్దా సెలవు తీసుకొని హైద్రాబాదు వెళ్ళిపోయాడు

నా హృదయం, నా నైజం మా అమ్మమ్మకు బాగా తెల్సు వెంటనే నాన్నగారితో మాట్లాడి శోభనానికి ముహూర్తం నిశ్చయం చేయించింది శశీ, స్త్రీ పురుషుల సహజ వాంఛల్నీ, సంస్కారాల్నీ తీర్చి దిద్దగల ఆ రాత్రి కోసం పరితపించిన నా హృదయానికి అదో శుభోదయం అయిపోయింది ఆయినా ఆ ఉద్రేకం, ఆ ఉల్లాసం నాలో ఎంతోకాలం నిలువలేదు, ఆ ఒకే ఒక్క రాత్రితో నా బ్రతుకుబాట ఛిన్నాభిన్నమై పోయింది శశీ!...ఏమని చెప్పను?... అది నిజంగా శోభనంగాదు నా పాలిటి యమకూపం

జాజి విరజాజుల నెరజిమ్మి చక్కగా అలంకరింపబడిన శోభనపు గదిలో పట్టు పీతాంబరాల పాన్పుపై పవళించిన విశ్వం నా కళ్ళకు మన్మధునిలా అగు పడ్డాడు. ఆ సన్నివేశంలో ప్రతి స్త్రీ హృదయంలోనూ అలాంటి భావనే విలసిత మౌతుందనడం సత్యవిదూరం గాదు శశీ!

అతణ్ణి చూస్తూ నే నూరకుండలేక పోయాను నా నరాల తపనసీ నా రక్తపు ఘోషనీ ఆపలేకపోయాను ఒక్క ఉదుటులో అతని వళ్ళో దూరి అతణ్ణి తీవెలా అల్లుకపోయాను సిగ్గు లేక అతని అధరాలపై ముద్దులవర్షం కురిపించానుగూడ

అప్పట్లో అతని అనుభూతు లేవో, అతని ఆలోచన లేవో నే నూహించనే లేదు కేవలం నా నరాల తృష్ణనీ, నా అధరాల ఉలుకునీ పులకింపజేయడమే నా తక్షణ కర్తవ్యం అయ్యింది నా ఆవేశానికతడు చిలిపిగా నవ్వుతూ నన్ను తన కౌగిట్లో ఇరికించుకున్నాడు నా ముంగురుల్ని సర్దుతూ అన్నాడుగదా "చిట్టీ ఒక్కమాట"

అంతటి ఆనందసమయంలో అనవల సిందీ, మాట్లాడవలసిందీ ఒక్క

మాచేసే శశీ! వందలో...వే లో. అయినా నాలో ఎలాంటి భావనా కనబడ నీక నవ్వుతోనే "ఇంకా ఒక్కమా టేమిటి విశ్వం?" అన్నాను

విశ్వం నాలోకి అనురాగంగా చూస్తూ "మాటగాదు చిట్టీ! అదొక సమస్య దానికి నీ సమాధానం కావాలి" అన్నాడు.

"సమస్య?...నీవు విడదీయ లేని సమస్య ఏముంది విశ్వం? చెప్పు త్వరగా" అంటూ అతని ఒడిలో తల పెట్టి వెల్లకిలా పరున్నాను అత డా సమ స్యను చెప్పేంత సేపూ అతని ముఖంలో ఎన్ని భావాలు దొర్లాయో, ఎన్ని రంగులు మారాయో తల్చుకుంటే నా గుండె తరుక్కుపోతోంది శశీ!!

ఇంతకూ అతడు చెప్పిన సమస్య సారాంశం ఏమిటంటే ఒక అందమైన అమ్మాయి ఒక అబ్బాయిని ప్రేమించిం దట అంతేగాదు అతణ్ణి మహా వైభ వంగా పెళ్ళాడిందటగూడ కాని తీరా పెళ్ళయిన తర్వాత ఆమె ఆశించిన మధురతా ..ఊహించుకొన్న స్వర్గాలూ బూడిదపా లయ్యాయట అందు క్కారణం . అతడు...నపుంసకుడట శశీ!... నపుంసకుడట ఇదంతా చెప్పుకొచ్చిన తర్వాత అతడు "చిట్టీ, ఆమె బ్రతుకులో ఇక ఆరనిచిచ్చు రగిలిపొరలవలసిందేనా? విముక్తి కిక మార్గం లేదా?" అన్నాడు

దాని కిక సమాధానం ఏమని చెప్ప గలను శశీ! ఆమె అతణ్ణి ప్రేమించి, తనకై తానే పెళ్ళి ప్రయత్నాలు జరిపి, వివాహ మాడినంతమాత్రాన తప్పంతా ఆమెదే నని చెప్పగలమా? ఇక పోతే అతడు ఆమె అనురాగాన్నీ, ప్రణయ పిపాసనూ చూచింతర్వాతనైనా ఆ ఘనుడు తన స్థితినీ, తన ధ్యేయాన్నీ ఆమె ముందు ఏకరువు పెట్టాల్సింది అప్పు డామె తన తప్పిదాన్ని సరిదిద్దు కొనేది కాని అత డలా చేయ లేక పోయాడు అందుకే బాగా ఆలోచించి "అతడు పచ్చి మోసగాడు" అన్నాను, విశ్వానికి నా అభిప్రాయాన్ని వివరిస్తూ.

"అదెలా చిట్టీ! అతడు మాట్లాడేం దుకు గూడ తగిన అవకాశం ఆమె కల్పించకపోతే అత డేం చేయగల డిక? ఆమె గారడి చేస్తోంటే ప్రేక్షకునిలా చూస్తూ ఊరకుండిపోయాడు" అన్నాడు విశ్వం

అతని మాటలకు నవ్వుకున్నా న్నేను. అతని మాటల్లో నిజంకూడా లేకపో లేదు అందుకే కాసేపు మౌనంగా వుండి, "అయినా విశ్వం! ఇలాంటి మధుర ఘడియల్లో ఏవేవో ఆలోచనల్తో సతమత మవ్వడం మన కెందుకొచ్చిన గోల" అన్నాను అతని పెదాల దగ్గరకు నా పెదాల్ని తీసుకెళ్తూ

"ఇది గోలగాదు చిట్టీ!...గోలగాదు, తీరని సమస్య అందులో ఇది మన సమస్య'' అన్నాడు విశ్వం పైన తిరిగే "ఫేన్" వైపు చూస్తూ.

దాంతో నా నెత్తిన పిడుగు పడ్డట్లయింది. కళ్ళు గిర్రున తిరిగాయి. రక్తం చల్లబడిపోయింది. వళ్ళు సళ్ళు బారిపోయింది. చివరకు అతిభారంగా "ఇది నిజమా విశ్వం" అన్నాను.

"చిట్టీ! నీతో అబద్ధం చెప్పాల్సినంత అవసరం నాకెందుకు? అంటూ అతడు కిటికీదగ్గరకు వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.

నాకు భోరున ఏడ్వాలనిపించింది. అయినా కళ్ళకు నీళ్ళు రాలేదు. ఏదేదో అనాలనుకున్నాను. కాని నోరు పిడచ గట్టుకొని పోయినందున మాటలు దొర్ల లేదు. వెర్రిగా, అర్థరహితంగా అట్లే కూర్చుండిపోయాను. యధాస్థితికి వచ్చి కళ్ళు నులుపుకొని చూద్దునుగదా— గదిలో విశ్వం కనబడలేదు. క్రింద ఎవరో మాట్లాడుకోవడం నాకు వినిపించింది. వాచీ చూచుకున్నాను. అయిదుగంటలు దాటిపోయింది. అంటే తెల్లవారవచ్చిందన్నమాట. కాని శశీ! నన్నుమాత్రం గాడాంధకారం చుట్టుముట్టేసింది. అప్పట్లో నా పరిస్థితి నీవు వూహించుకోవలసిందే కాని వ్రాయడానికి మాటలు చాలడంలేదు శశీ!!

ఆ తర్వాత అతడు నన్ను అనునయించబోయాడు. కాని నా కదంతా అసహ్యంగా వుండిపోయింది. అయినా శశీ! ఒక్కటి మాత్రం ధైర్యంగా చెప్పగలను. పురుషుడు తన బలహీనతను బహిర్గత పరచ నిచ్చగించ డేనాడూ. అది తన పురుషత్వానికే తీరని మచ్చని అతని భావం. కాని అతని ఆ దౌర్బల్యానికి ఎందరు ఎలా నాశన మైపోతారో ఆలోచించనైనా ఆలోచించడు. తీరా దాని ప్రభావం పరులకు ఉరిపాశమై విలయ తాండవం ఆడినప్పుడు కేవలం ఒక్క సానుభూతితో తప్పించుకో జూస్తాడేగాని తన ఆనందాన్నీ ఆశయాల్నీ ఏ మాత్రం వదులుకోడు. నిజంగా ఇదెంత నీచమో చూడు శశీ!!

ఎంతైనా నేను ఆడదాన్ని. నాలోనూ ఆశలూ, ఆశయా లున్నాయ్! నా నరాల్లో ఇరగని తృష్ణా, ఎముకల్లో తరగని గుంజూ వున్నాయ్! ఆలోచించుకొనే శక్తీ, నిర్ణయించుకునే స్థోమతా వుంది. ముందుముందు నా బ్రతుకుబాటలో ఇంకెన్ని మజిలీ లున్నాయో ఇప్పట్లో చెప్పలేను. నాలాంటి పరిస్థితుల్లో పరిభ్రమించే ఏ స్త్రీ అయినా ఎలాంటి నిర్ణయానికి రాగలదో నీవే ఊహించుకో. అది నీకే వదిలేస్తున్నా.

శశీ! నెలరోజులుగా వుత్తరం వ్రాయలే దెందుకన్నావు. అందుకే ఇంత పెద్దవుత్తరం విపులంగా వ్రాస్తున్నాను. నీ అభిప్రాయంగానీ, చివరకు నీ సానుభూతిగానీ కాదు నా క్కావలసింది. మరువకుండా నే నెక్కడున్నా నీ యోగ క్షేమాల్ని మాత్రం తెల్పుతూండు.

నీ... చిట్టి.




గోపాలాని కొక పెద్ద ధర్మసందేహం పట్టుకుంది—ఆ సినిమా ట్రూపులో బొంబాయి వెళ్ళిన తన తమ్ముడు పార్వతీశం ఎవతెనన్నా తగులుకున్నాడా, లేదా ?

తన తమ్ముడు నైతిక క్షేమంతో గోపాలాని కేం పనో ఊహించటం కష్టం. తమ్ముడు ఎవతెనన్నా తగులుకున్నాడని రుజువైతే తన కెక్కువ తృప్తో, నీతిగా ఉన్నాడంటే ఎక్కువ తృప్తో గోపాలానికే తెలీదు.

గోపాలానికి ఒక్కటే తెలుసు: పార్వతీశాన్ని తను పెంచి పెద్దవాణ్ణి చేశాడు. చదువు పూర్తిగా చెప్పించాడు! ఒక ఇంటివాణ్ణి చెయ్యటం మాత్రమే తనమీద ఉంది. ఈ పరిస్థితుల్లో పార్వతీశం ఇప్పుడే కోతికళలు పోవటం జరిగితే, ఏ నిక్షేపమంటి పిల్లనో తెచ్చి వాడి కంటగట్టటం తన వల్ల ఒక్కనాటికూడా జరగదు!

తన తమ్ముడిమీద కంటె, గోపాలానికి, ఆ తమ్ముడికి ముడిపెట్టబోయే పిల్లమీద ఇంత అభిమానం దేనికో అది కూడా మనం సులభంగా ఊహించలేం.

ఏమైనా పార్వతీశం ప్రవర్తనను గురించి స్పష్టంగా తెలుసుకునేదాకా గోపాలానికి నిద్రపట్టే లక్షణాలు కనుపించలేదు.

అసలే సినిమా కంపెనీ! అందరూ లఫూటుగాళ్లు చేరతారు. ఆపైన ఆడవాళ్ళూ మగవాళ్ళూ కలిసి తైతక్కలాట్టం! ఆ ముండలన్నా సంసార్లా అంటే—సంసార్లు హాయిగా మొగు

కొడవటిగంటి కుటుంబరావు

ళ్ళకు వంట చేసిపెడుతూ పిల్లల్ని కనక సినిమాల్లో కెందుకు పోతారు ?

పార్వతీశం వెంట తమ గ్రామం నించి ఇంకా అయిదారుగురు వెళ్లారు అసలా సినిమా తీసిన కంపెనీ ఆ వూరి వాళ్ళదే. అందుకని గోపాలం నలుగురి దగ్గిరా ఆరా తియ్యటానికి బయల్దేరాడు

"ఏమోయ్, లక్ష్మీనారాయణా ! నువుకూడా బొంబాయి వెళ్ళావు గామల్లు. ఏమిటి కబుర్లు? మా తమ్ముడు పార్వతీశం. ఒళ్లు దగ్గిరపెట్టి మసులుకున్నాడా ?'' అన్నాడు గోపాలం

"ఏవాళ్ళు ఎవరి దగ్గిర పెట్టి ?'' అన్నాడు లక్ష్మీనారాయణ విచక్షణగా

తాగుబోతు వెధవ ! వాణ్ణి అడగటం తనదే పొరపాటు !

"ఏమండీ, కృష్ణశాస్త్రిగారూ, మీ రంతా కలిసే ఉన్నారు గామాలు! మా తమ్ముడు, పార్వతీశం, ఆడవాళ్ల జోలి కేమీ-పో లేదుకద ?"

"ఎబ్బే, అటువంటి దేమీ ఉన్నట్టు లేదులెండి నా కతనితో ఆట్టే పరిచయం కలగలేదుగాని—వస్తాను !''

ఎందుకు చెబుతాడూ ? అంతా తోడుదొంగలు !

"ఏమోయ్, సూర్యం మావాడు బొంబాయిలో ఛటాచోరుముండల్నెవర్నీ తగులుకోలేదుగద ?''

"ఓ రహస్యం చెప్పనా ? మళ్ళీ ఎవరితోనన్నా అనేరు ! నేను తలుపు కంతల్లోనుంచి చూశాగాని, నా కేమీ కనిపించలా. చీకట్లో ! తెలీనిమాట చెప్పి ఎట్లా పాపం కట్టుకునేదీ !''

వీ డో దొమ్మరముండాకొడుకు ! చిన్నంతరమూ పెద్దంతరమూ ఎరగడు !

ఇంత శ్రమపడి ఆ ముండ దగ్గిరికి పోయి అ దేమంటుందో ఆ సంగతి కూడా తేల్చుకోస్తే సరిపోతుందిగా !

గోపాలం ప్రాణా లరిచేతిలో పెట్టుకొని దాని ఇల్లు విచారించుకుంటూ వెళ్ళాడు

పొద్దూకిం దప్పుడే. "కూర్చోండి, పంతులుగారూ ?'' అంటూ అది తన ఎదటే చీరవిప్పి మరోచీర కట్టుకోసాగింది

"అయితే—ఇదుగో—చూడూ ! నీ పే రేమిటో ? మీ వెంట పార్వతీశమని ఒక కుర్రాడొచ్చాడే! వాడు మీతో వచ్చిన ఆడవాళ్ళ నెవర్నన్నా మరిగాడా ?"

"ఆ అబ్బాయి అటువంటి వాడైతే నే నొదిలిపెడతానుటండీ, పంతులుగారూ ? వెళుతున్నా రేం ? రాత్రి కుండరూ ?"

అదురుతున్న గుండెతో గోపాలం బయటపడ్డాడు తన తమ్ముడి శీలం చెడలేదని రూఢి అయిందిగాని. అందువల్ల కలగదగిన సంతోషం మాత్రం గోపాలానికి కలగలేదు.






“వీళ్ళల్లో ఎవడో చెప్పు, పెళ్ళాం కొంగట్టుకు తిరుగుతా డంది.”

# దేవుడు చేసిన



రాఘవేంద్రానికి ముఫ్ఫై సంవత్సరాలు నిండి — వొకరోజు అయింది. అతను — తన పుట్టినరోజు మర్చిపోయినందుకు బాధపడలేదు వచ్చే వయసును తను కాదన్నా ఆపేది లేదు ప్రయాణంలో మైలురాళ్ళు – వెనక పడి మనం ముందుకు పోతుంటే ఆనందం వేస్తుంది బ్రతుకు — యెంత చేదయినదయినా — చివరకు వెడుతూందంటే భయం సహజంగా కలుగుతుంది అయితే తనకు "బ్రతుకేమిచ్చింది" అని చాలాకాలంగా ప్రశ్నించుకుంటే, నిరాశా, దుఃఖం రెండు వైపులా నిలబడి, తనని టగ్ ఆఫ్ వార్ ఆడించాయి — అనే జవాబు చాలా రోజులుగా వస్తూంది. యివాళ్టి రోజు ఆ ప్రశ్న వేసుకోబుద్ధి వేయలేదు— రాఘవేంద్రానికి

చటుక్కున, నేను బ్రతుకులోంచి కావాలని యెన్ని వదులుకున్నాను, అని తర్కించుకోవడం మొదలుపెట్టాడు

న్యాయశాస్త్రంలో 'డిఫెన్సు' పార్టీని రక్షిస్తుంది కాని జీవితంలో కూడా

# మనుషులు

## శ్రీరమణ

దాన్ని 'యింప్లిమెంట్' చేస్కుంటే — మనిషి ఆత్మరక్షణకు అలవాటుపడి పోయి — తుదిగా వ్యక్తి దూషణలోకి దిగి — ఆఖరికి, తన కష్టాలకూ, దుఃఖానికీ కారణం చుట్టూ మనుషులనీ, దేవుళ్ళనీ పేరు పేరునా దుయ్యబట్టడం ప్రారంభిస్తాడు

యెప్పుడైతే రాఘవేంద్రం 'అఫెన్సివ్'గా తర్కించుకున్నాడో — స్వంతం మీద—తెలియని జ్వాల చప్పున లేచింది.

అసలిక్కడ రాఘవేంద్రం గురించి రెండుమాటలు చెప్పాలి. చిన్నప్పుడు తల్లి — ఆ తరువాత తండ్రీ పోయి — బంధువుల ప్రాపకంలో పెరిగి — అదీ — వారి స్వార్థంకోసం పెంచబడిన, యువకులకు రాఘవేంద్రం వో ప్రతినిధి అసలు తల్లీ, తండ్రీలేని పిల్లల్ని బంధువులు చేరదీసి — యెందుకు పెంచి పెద్ద చేస్తారా అన్పిస్తుంది యిష్టం లేనివాళ్ళు తమ మానాన్ని తాము పోక — వాళ్లని — అయిష్టంగా — పెంచుతూండడం మన దేశంలో వో ఆచారం వాళ్ళు ప్రతీ



క్షణం ఆ అయిష్టత — విభిన్న రూపాల్లో ప్రదర్శించడం కూడా మానరు.

ఆ వింత వాతావరణలో పెరిగిన వాళ్ళు — అష్టావక్రుడిలా - నమ్మకం, ప్రేమ అనేదీ - వాటిరూపం యెలా వుంటుందో తెలియకుండానే పెరుగుతారు పెరిగినతర్వాత — వాళ్ళు మనుష్యుల్లో మంచితనం వుంటుందంటే — ఆప్యాయత అనురాగాల అంచులు దాటి ప్రవహిస్తూంటే — క్రొత్తగా, వింతగా చూస్తారు ఆ క్రొత్తదనం — పైగా శరీరావసరాలు - మరీక్రొత్తచేసి — ఆ అనుభవాలనుంచి - దూరంగా పారిపోయేటట్టుకూడా చేస్తుంది. సరిగ్గా రాఘవేంద్రం అదేమూసలో పెరిగి పెద్దవా డయ్యాడు. పెంచిన కాంతమ్మ గారు కన్నకూతుళ్ళకు, కొడుకులకు పెళ్ళి చేసింది, వాళ్ళు పిల్లలు కనడానికి యింటికి వస్తూంటారు. తిరిగి యెవరి దోవన వాళ్లు పోతారు.

రాఘవేంద్రంలో యేమూలో యిన్ని ఆవకతవకల మధ్య వుండుండి - అప్పుడప్పుడు యౌవనం తలెత్తి రగులుస్తూనే వుంది ఆ బాధ - తీరేదారిలేక అతను — మరింత ఛీదరపడి పోయేవాడు

రాఘవేంద్రంలో వస్తున్న మార్పులు కాంతమ్మకు తెలియనివి కావు అందుకే ఆవిడ అతని యౌవనం అనే క్రొత్తగా విత్తులేస్తున్న కలలమీద - చన్నీళ్ళు యెప్పటికప్పుడు చల్లుతూనేవుంది

"చూశావురా రాఘవా. మీ మామయ్య చెబితే విన్నారా? సరోజకు పెళ్ళి చేశారు వాడు ప్రేమించాడన్నారు నానాకోతాపెట్టు న్నాట్ట - యేకా ముండ లనీ తాగు డనీ - అది వొకటే గోల. ."

ప్రేమించినవాళ్ళు కొన్ని నిబంధనలు పాటించా లని అతనికి తెలియదు అలా అతనికి తెలియకపోవడం తప్పుకాదు

"అది సరే మన ప్రసాదం పెళ్ళాం- వొకటేపోరు నాల్గురోజులకోసారి పుట్టింటికి పోతా నంటుందట వాడి వుద్యోగం దానికి నచ్చలేదట...పైగా యీవిషయం విన్నావా?...నువ్వు అందగాడివి కావం దిట పూర్వంలో అందరూ రాఘవేంద్రం పెళ్ళాం అనేవా రా అమ్మాయిని "

రాఘవేంద్రానికి తన అందం గుర్తొచ్చింది. ఆఖరి ఆయుధం వుపయోగించనే వుపయోగించింది "నువ్వు పెళ్ళి చేసొక్కో-బోకురా . యేదో నే నున్నంత కాలం నీ కేం రే పెవత్తో వచ్చి - నిన్నూ, నన్నూ నానా హింస పెడితే . మనిద్దరం.. "

రాఘవేంద్రానికి డోకు వచ్చినంత పనైంది సంసారం గురించిన 'మంచి రూపం' తెలియని అతనికి యీ బంధాలు భయంకరమైన వుచ్చు లనిపించాయి

తనకి అందంలేదు, మంచి చదు వేలేదు తనకి పెళ్ళయితే తనూ అందరిలాగా బాధ పడా లన్నమాట...పోనీ మానేద్దామన్నా శరీరంలోపలి అగ్ని చల్లారడానికి

దారి తెలిలియలేదు. అస లీ ప్రపంచం అంతా తగులబడిపోతే బావుణ్ణని పించింది అతనిలో వున్న వొంటరి అంతా లావాలా రంకెలు వేసింది

* * *

చలపతిరావుగారు — నడుం వంగిన మనిషి ఆయన ఆజాతశత్రు వంటారు అందరూను తనకీ శత్రువులు వున్నారు అంటా డాయన అందులో మొదటి శత్రువు అనాకారి కూతురు సరస్వతి రెండోది ఆయన అసమర్థత యీ రెండూ ఆయన్ని నడుంవంచి యేడ్పిస్తున్నాయి రోజూ — కూతురుకు చదువు చెప్పించాడు — రోజూ కొంత సేపైనా కూతురు గురించి ఆలోచన దూరం చేసుకుందుకు. వోరోజు కమ్మాయి ట్రయినింగు పూర్తి చేసి — వుద్యోగం దొరక్క యింటి లోనే వుండిపోయింది

తిరిగి సమస్య తీవ్రరూపంలో అను క్షణం కోత పెడ్తూంది మళ్ళీ ఆయన బాధ మొదలయింది ఆ బాధ మరీ తీవ్రమైనప్పుడు "యీ పీనుగని యెవ డైనా ప్రేమించకూడదా ?" అనుకునే వాడు ..యేడాది కాచుకున్నా యేదీ జరగలేదు

యీ యేడా దంతా ఎవరో శపించి నట్లు అన్నీ అశుభాలే జరిగేయి ..పిల్ల లకూ తనకూ అస్వస్థత, యెంతకాలం నుండో రోగంతో తీసుకుంటున్న భార్య కన్ను మూయడం... పైగా తన రిటైర్ మెంట్...

అయితే కొన్ని రోజులకు సరస్వతి-వుద్యోగంలో చేరింది.

సరస్వతికీ తండ్రి కొచ్చిన వూహలు— కలలుగా వచ్చేయి లేచి చూస్తే దగ్గు తున్న తండ్రీ. ఖాళీ కూరలబుట్టా — బోసిమెడ — జడుసుకున్న తన గుండెలు— ఛీ ఛీ నా బ్రతు కేమిటి — అనుకుంద

ఆ మరునాడు యింటిపన్ను కడు తూంటే చలపతిరావుగారికి రాఘవేంద్రం కన్పించాడు — ఆఫీసులోంచివస్తూ చలపతిరావు యింటిమీద జప్తు రాకుండా రాఘవేంద్రమే సహాయం చేశాడు, తన స్నేహితులతో చెప్పి

ఆయన రాఘవవేంద్రాన్ని యెంతో మెచ్చుకున్నాడు. యోగక్షేమా లడిగి పిల్ల లెందరు బాబూ అన్నాడు అంతే... రాఘవేంద్రం జవాబు — చలపతిరావు గారిని ఆ సాయంకాలం — కాంతమ్మగారి యింటిముందు వాలేటట్టు చేసింది

కాంతమ్మగారు రాఘవేంద్రం పక్కన లేకపోతే ఆ పక్షిని ఆ క్షణాన్నే తోలే సేది ఆయన "నీకు నచ్చితేనే" అంటూ కాళ్ళూ కడుపూ పట్టుకోవడంతో "సరే వస్తాంలెండి" అంది

మరునాడు చలపతిరావుగారు వచ్చి కూడావుండి రాఘవేంద్రాన్నీ, కాంతమ్మ గారినీ తీసుకువెళ్ళి — సరస్వతిని చూపించాడు

రాఘవేంద్రం బ్రతు కంటే యెంత జడుసుకున్నా — తనని ఆడఅవయవాలూ —వూహలూ రెచ్చగొడుతూంటే—గాలిలో తేలిపోయాడు. యెటూ — యేమీలేని ఆ బ్రాహ్మడి ఆర్ద్రిత — కాంతమ్మగారికి వెగటుగా వుంది

"నా మొహంలా వుంది — గెడ కర్రలా అదేం రూపు"

ఎలాగో అలాగ నీ కంటగట్టాలని ఆ ముసలాడి వుదేశ్యం నీ కేం నిక్షేపంలా గున్నావు — యిదికాకపోతే యింతకు మించిన మంచిపిల్ల దొరక్క—పోతుందా— నువ్వు చేసుకుంటా ననాలే కాని, నువ్వు అనకుండా నే నెందుకు చూడ్డం అనికాని యీసరికి నీకు వో దీపంలాంటి పిల్లని చూసి ముడెయ్యకపోదునా...నువ్వేమంటావో నని ..

వెనకోసారి యెవరితోనో కాంతమ్మ "వాడేం బాగుంటాడని పెళ్ళవుతుంది" అన్న మాటలు — వెనుకగా విన్న రాఘవేంద్రం యీ క్షణాన గుర్తుకుతెచ్చుకో లేకపోయాడు. నా బ్రతుకు నేను బ్రతుకుతున్నానా లేదా అనుకున్నాడు చిరాగ్గా

మరునాడే కాంతమ్మ చలపతిరావుకు నిరాశ జవాబుగా పంపించింది

ఇప్పుడైనా రాఘవేంద్రం బ్రతుకు వెనక్కు—వెళ్ళి చూసుకోకపోను కానీ యిన్నాళ్ళకు అతను పనిచేసే స్కూల్లోకి సరస్వతి ట్రాన్స్ఫర్ అయిరావడంతో అతని మనసు తిరగమరగ పడింది... రూపాయ బిళ్ళలా — తనూ బాధపడపోను...కానీ సరస్వతే చెప్పిందో — యెలా తెలిసిందోగాని — స్కూల్లో తనతో పనిచేసే జనార్దనంగారు ఆప్యాయంగా యింటికి తీసుకువెళ్ళి నల్గురు పిల్లల తల్లి. ఆయన భార్య అయిన వరలక్ష్మిగారితో కలిసి ఆ విషయం అడిగారు

'సరస్వతిని నువ్వు చూస్తున్నావుట కదూ''

''ఆ. చాలా రోజులక్రితం''

"మరేం''

"అంటే''

"చేసుకోలేకపోయావూ"

''యేమిటి చేసుకోవడం"

"యేం. ఆ అమ్మాయి కేమయ్యా? భగవంతుడు మనకు తగ్గవాళ్ళను యేరే మనకు పడేస్తాడు "బాగాలేదన్నావట" నువ్వు బాగున్నావేమిటి చెప్పు ... పోనీ యివ్వాళ చూడు ముప్పై యేండ్లు వచ్చి పెళ్లిలేకుండా యేం బ్రతు కది?"

రాఘవేంద్రానికి కోపం వచ్చింది

''పెళ్లి లేకుండా బ్రతకలేనా"

''సంతానికయితే బ్రతకొచ్చు నువ్వంటే ప్రేమించేవాళ్ళు — యెప్పుడూ వుండడంకోసం. ఆ సంపద వృద్ధికోసం పెళ్ళాం.. తద్వారా పిల్లలు వుండి తీరాలి"

"నన్ను చాలామంది- మా అత్తయ్య అభిమానిస్తోంది'' అమాయకంగా చెప్పినట్లు చెప్పేడు రాఘవేంద్రం —

"మీ అత్తయ్య!...నువ్వు విడిచి పోతా వని భయం"

"యేం కాదు" అనాలనుకున్నాడు...?

"నల్లగా వుందా...ను వ్వెరుపేమిటి? గంతకు తగ్గ బొంత – కూతురు పెళ్ళి చూసుకోకుండా చచ్చిపోయేదు కదయ్యా ముసిలాడు పాపం–

"ఆమాట కొస్తే నువ్వే చంపావన్నా తప్పులేదు."

"నేమకాదు" అప్రయత్నంగా గట్టిగా అన్నాడు

"నువ్వే నువ్వే...పెద్ద హీరో నను కుని..."

కళ్ళు గిర్రున తిరిగాయి తనని నలుగురి ముందూ సిగ్గుపడేటట్టు చేసిన సరస్వతిని ఎన్నో తిట్టాలనీ, గట్టిగా బుద్ధి చెప్పాలనీ వెళ్ళాడు–

వెళ్ళేటప్పటికి–సరస్వతి యింటిలో మంచంమీద పడుకుని యేడుస్తోంది... వెక్కి–వెక్కి... పెళ్ళి అవ లేద నే కాబోలు... యేం చెయ్యాలో తోచింది కాదు... యేడుస్తోం దని అనుకోగానే అతనిలో జాలి అడుగులు కదుపుకుంది, వెంటనే అత్తయ్య పక్కింటావిడతో "వీడికి పెళ్ళేమిటి–కోతిగాడు'' అన్న విషపు మాటలు రగిలి – పౌరుషం తలెత్తింది

కొంచెం దగ్గరగా వెళ్ళి "మీరు" అన్నాడు ఆ అమ్మాయ్ హడలిపోయి యిటు తిరిగి – రాఘవేంద్రాన్ని చూసి "మీరు'' అని వూరుకుంది

రాఘవేంద్రం పూనకం వచ్చినట్లు మాట్లాడాడు "క్షమించండి – మిమ్మల్ని యింతకాలం బాధ పెట్టాను అసలు



మిమ్మల్ని నే నేమీ అనలేదు – అన్నీ మా అత్తయ్యే!"

సరస్వతి ఆశ్చర్యంగా వింటోంది. తను యధాలాపంగా వరలక్షమ్మగారితో చెప్పిన సంగతి యితని కెలా తెలిసిందా అని.

"నిజంగా చెప్తున్నాను – మీ రంటే నా కయిష్టంలేదు – నే నేం అందగాణ్ణినా – మీరు అందంగా లేరనడానికి –" ఆమెలో చాలాకాలంగా నిద్రపోయిన ఆశ లేచి సరసరాల్నీ తీపితో ముంచుతోంది. ఆ ఆనందంలో దుఃఖం రెండింతలయ్యింది.

"యేడవకండి. నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటాను. రేపు అన్నివిషయాలు మాట్లాడుకుందాం...వస్తాను –"

మాటలు రాని చిత్తరువే అయింది సరస్వతి.

"దీంతో అత్తయ్యా, అందరూ వో కొలిక్కి వస్తారు – లేకపోతే" అనుకున్నాడు.

"రాఘవేంద్రంగారా వచ్చింది లేక – దేవుడా" అనుకుంది సరస్వతి ఆనందం చేత నిస్పత్తువగా...

కాదు మన మందరం దేముడు చేసిన మనుష్యులం...అని తెలియ జెప్పాడు రాఘవేంద్రం.



# ప్రేమికుల చిత్రాలలోని ఆచారు పీజీ

కేబేజీ అంటే ఏమిటో తెలియనివాళ్లు ఈ 'గ్రోమోర్ ఫుడ్' రోజుల్లో ఉండరనుకుంటాను. తెలియని పల్లెటూరివా రెక్కడేనా వుంటే వెంటనే మీ సామీప్య పట్నానికి వెళ్ళి కూరల మార్కెట్టులో దాని దర్శనం చేసుకోండి. లేకపోతే మీ డివిజనుకు చెందిన నేషనల్ వార్ ఫ్రంటు ఆర్గనైజరుకు వ్రాయండి. దానికి సంబంధించిన వాఙ్మయం, ఫోటోలతో సహా పంపిస్తాడు.

ఈ చిన్న ఉపోద్ఘాతంతో కేబేజీ తత్వాన్ని బోధించే ఒక చిన్న ఇతిహాసాన్ని ఇక్కడ వివరిస్తాను.

ఇది పాతిక ముప్ఫయి సంవత్సరాల నాటి మాట. ఇండియాకువచ్చి కలక్టరు ఉద్యోగం స్వీకరించిన ఒక పాశ్చాత్యుడు ఒకరోజున ముచ్చటపడి తన వంటవాడ్ని పిలిచి తన కావేళ కేబేజీ కూర చేసిపెట్ట మన్నాడు. ఆ వంటవాడికి కేబేజీ అంటే ఏమిటో అంత వరకూ అనుభవంలేదు. అది ఫలానా మార్కెట్టులో ఫలానా అంగడివాడి వద్ద వుంటుంది, కొనిపట్రా అని సలహా యిచ్చాడు వాడికి, దొరగారు —

కొంత సేపటికి కేబేజీ యథావిధిగా వంటిల్లు జేరుకుంది. వంటవాడు దాని పైనవుండే చీరలన్నీ ఒలవడం ప్రారంభించాడు. ఒక్కొక్క ఆకు చొప్పున సమూలంగా దాన్ని అక్కడ ఒలిచి పెట్టి, ఏమీ కనపడకపోగా విభ్రాంతుడై దొరగార్ని సమీపించి 'స్వామీ! దుకాణదారుడు మనల్ని మోసగించాడు - మీకీ వేళ కేబేజీ కూర తినే అదృష్టం పట్టలేదు-' అన్నాడు.

దొరగారు ఆశ్చర్యపోతూ 'ఏం జరిగిందేమిటి చెప్పు-కేబేజీకుళ్ళిందా?' అన్నాడు.

అప్పుడు వంటవాడు 'కుళ్లలేదండి- కాని, దాన్ని ఎంత ఒలిచి చూచినా ఆకులే వస్తున్నాయి గాని కూర వండడానికి తగిన సంభారమేమీ అందులో లేదు-ఆ ఆకులన్నీ తీసికెళ్ళి మీ గుర్రం నోటి కందించాను-'అన్నాడు.

ఈ సంజాయిషీతో దొరగారిశ్వాస నిలిచిపోయి, ఉక్కిరిబిక్కి రయ్యాడు. కొంత సేపటికి తేరుకుని కేబేజీ తత్వమంతా వంటవాడికి బోధించి అతడిచేత యెన్నో కేబేజీలను ఒలిపించుకుని, ఒండించుకుని తిన్నాడు.

---

యం. యస్. మూర్తి

కాని. వంటవాడికి మాత్రం ఆ కేబేజీ ఎప్పటికీ అర్థంకాక అతని దృష్టి పథంలో అదొక మాయాబజారులోని 'ఎక్జిబిట్' గానే వుండిపోయింది. అంతా శ్రమపడి తెచ్చి, తుదంటా ఒలిచిచూస్తే ఆకులుతప్ప మరేమీ మిగలకపోవడం అనే విషయంతో అతడు రాజీ పడలేకపోయాడు!

ఎందుచేతనోగాని ప్రేమించి పెళ్లాడటమంటే పైన వివరించిన కేబేజీ గాథ జ్ఞప్తికి వస్తుంది మనకు. ఇందులో మనం గమనించాల్సినవి మూడు ప్రధాన హాంశాలు-ఒకటి! కేబేజీ-ఇది స్త్రీ, రెండు దీన్ని పచనంచేసి అరగించేవాడు - పురుషుడు, మూడు దీన్ని ఒలిచి కూరగా వండడం అనే క్రియ ఇదే ప్రేమించి, పెళ్ళిచేసుకోవడమంటే! ఈ విషయం తరిచిచూసినకొద్దీ పై కథలోని వంటవాడితో మనం ఏకీభవించాల్సిన కారణాలు అనేకం మనకి కనబడుతూంటాయి.

కేబేజీ తత్వం గల స్త్రీని ప్రేమించడం, ప్రేమించాననుకోవడం మొగవాడుపడే భ్రాంతులలో ఒకటి ఒలవగా ఆకులేతప్ప హృదయం కనబడదు, ఈ ప్రేమ సంఘటనలో.

'స్త్రీ అనేది ఒక కేబేజీ, మొగవాడనే చీడపురుగు దాన్ని ఆశ్రయించుకుని, దానిమీద ప్రాకుతూ, ఒక్కొక్క ఆకునే తిని, జీర్ణించుకుంటూ, చివరకు మిగిలేది ఏమీలేదని తెలుసుకుంటాడు' అన్నాడు విజ్ఞానవేత్త

ప్రేమికుల చిరాలో చివర పేజీన ఎర్రటి అక్షరాలతో లిఖింపబడివుండే శాశ్వతమైన నిజం - చిరానిల్వ - ఈ పిచ్చే!

స్త్రీ పురుషులు తమ శారీరిక లక్షణాలచేత ఆకర్షింపబడి ఒకరికొకరు దగ్గిరవుతారు హృదయాల రాపిడికి అగ్ని ప్రజ్వరిల్లుతుంది. ఆ హోమగుండంలో ఇద్దరూ ఆహుతి అవుతారు. దీన్ని స్నేహం అనండి, వాంఛ అనండి, అవసరం అనండి, నరాల యుద్ధం అనండి, ఏమన్నా అనండి - ప్రేమ అని మాత్రం అనకండి






గంగానదితీరంలో వున్న ఒక మామిడి తోటలో ఒక బాలుడు, సాయం సమయపు గంగానదీప్రవాహం చేసే కల కల ధ్వనిని వింటూ కూచున్నాడు అతని పాదాలముందున్న పట్టు తివాశీ లాంటి మెత్తని పచ్చికపై ఒక బాలిక పడుకుని, ఆ బాలుని ముఖంలోకి చూస్తున్నది. ఆమె మధ్య మధ్య ఆకాశంకేసీ, తోటలోని చెట్లకేసీ చూస్తున్నా, తిరిగి ముఖంమీదికే దృష్టిని మరల్చుతున్నది. ఆ బాలునిపేరు ప్రతాపుడు; బాలికపేరు శైవలిని శైవలిని వయస్సు ఏడెనిమిది సంవత్సరా లుంటుంది, ప్రతాపుని వయస్సు పదీపన్నెండుమధ్య వుంటుంది.

హఠాత్తుగా చాతకపక్షి ఒకటి, వారి తలమీదిగా కలకలారావం చేస్తూ ఎగిరి వెళ్ళింది. శైవలిని దాని కంఠధ్వనిని

బంకించంద్ర చటర్జీ

అనుకరిస్తూ, తన్నూ కూత వేసింది ఆకూత మామిడితోటలో ప్రతిధ్వనించింది

శైవలిని తను పడుకున్న చోటునుంచి లేచి తోటలోవున్న పుష్పాలనుకోసితెచ్చి, మాలగాగుచ్చి ప్రతాపుడి మెడలో వేశింది అంతలోనే దానిని తీసుకుని, తన జడకు అల్లుకున్నది తరవాత అటూయిటూ కొంచెం సేపుచూసి, ఆ దాపులనే మేస్తున్న ఒక ఆవుకొమ్ములకు ఆ మాలను చుట్టింది

సూర్యుడస్తమించాడు. వినీలనిర్మలాకాశంలో నక్షత్రాలు మినుకు మినుకు మంటూ కనిపించసాగినై ఆ ఇద్దరూ నక్షత్రాలను లెక్కించ సాగారు ఆ సమయంలో వాదులాట ప్రారంభమైంది అన్నిటికన్నా ముందుగా ఉదయించిన నక్షత్ర మేది ? నీ కెన్ని నక్షత్రాలు కనిపిస్తున్నాయి ? నాలుగేనా ? ఆహా, నాకు పది కనిపిస్తున్నాయి ఇదిగో, యిక్కడొకటి, అక్కడ యింకొకటి, మొత్తం పది ! శైవలిని ఎడాపెడా అబద్ధా లాడేస్తున్నది ఆమెకు నిజంగా, పక్షత్రాలు కనిపించనేలేదు

ప్రతాప్, శైవలినీలహృదయాల్లో ఈ విధంగా ప్రేమ ఉదయించింది దాన్ని ప్రేమ అనగలిగితే లనవచ్చు కారణం నాయకుడికి పన్నెండు సంవత్సరాలు, నాయికకు ఎనిమిదేళ్ళు

కాలం గడుస్తున్నది క్రమంగా వాళ్ళిద్దరూ యౌవన దశలోకి అడుగు పెట్టారు ప్రతాపుడితో తనకు వివాహం జరుగుతుం దని శైవలిని కలలు కనేది కాని అది అసంభవం ఆ సంగతి ప్రతాపుడికి తెలుసు వా రిద్దరి మతం ఒకటైనా, కులం ఒకటి కాదు

ఈ వాస్తవం గురించి అర్థం చేసుకోవడానికి శైవలినికి చాలాకాలంపట్టింది. ఆ తర్వాత ఆమె ప్రతాపుడితో తమ భవిష్యత్తు గురించి చర్చించింది ఎంతో రహస్యంగా, ఎన్నోదినాలు చర్చించుకున్న మీదట వా ళ్ళొక నిర్ణయానికి వచ్చారు

వా ళ్ళిద్దరూ ఒకనాడు గంగానదికి వెళ్లారు, ఆ సమయంలో చాలా మంది నదిలో స్నానాలు చేస్తున్నారు ప్రతాపుడు అందరూ వినేట్టుగా, "శైవలినీ, రా ! నదిలో స్నానం చేద్దాం," అన్నాడు

ఇద్దరూ నదిలోకి దిగారు ఒడ్డున స్నానాలు చేస్తున్నవారినుంచి దూరంగా పోయి, ఈతకు ఉపక్రమించారు. అది వానాకాలం, గంగానది పెద్ద కెరటాలతో మహా వేగంగా ప్రవహిస్తున్నది ఇద్దరూ ఈతలో దిట్టలే, ఆ గ్రామంలో వారిలా యీదగలిగినవా రెవరూ లేరు

నదీ జలాల్ని చిమ్ముకుంటూ శైవలినీ ప్రతాప్‌లు నదిలోకి చాలాదూరం వెళ్ళిపోయారు అది చూసి స్నానాలు చేస్తున్నవారిలో కొందరు పెద్ద కేకలు వేసి, వాళ్ళను తిరిగి రమ్మని హెచ్చరించారు. కాని, అ వేమీ వా ళ్ళ



విన్పించుకోలేదు సరిగా నది మధ్యకు వెళ్ళిన తరువాత ప్రతాప్ యీదుతున్న వాడల్లా ఆగి, "శైలీ మనిద్దరి వివాహం యిక్కడే!" అన్నాడు

"అవును, యింకా యీదుకుంటూ పోవటం ఎందుకు?" అన్నది శైవలిని ప్రతాపుడు శైవలిని ముఖంలోకి ఓమారు చూసి బుడుంగుమని మునిగి పోయాడు

శైవలిని కూడా అతనితో పాటు మునగాలన్న ప్రయత్నం చేసింది, కాని భయపడిపోయింది. 'నేనెందుకుచావాలి?' అనుకున్న దామె. 'ప్రతాప్ నా కేమవు తాడు?' అనికూడా ప్రశ్నించుకున్నది

'ఊహూ(, నే చావను"అంటూ ఓ చిన్న కేకపెట్టి ఆమె ఈదుకుంటూ నది ఒడ్డుకు చేరింది

* * *

ప్రతాప్ ఒక రకంగా అదృష్టవంతుడు అతడు నీటిలో మునిగిపోవటాన్ని, అల్లంత దూరంలో పోతున్న పడవలోని ఒక వ్యక్తి చూశాడు వెంటనే అతడు నదిలోకి దూకి ప్రతాప్‌ను ఒడిసి పట్టుకొని పడవ మీదికి లాక్కుపోయాడు

ప్రతాప్‌ను యీ విధంగా రక్షించిన వ్యక్తి పేరు చంద్రశేఖరశర్మ, అతడు ప్రతాప్ ఆ నదీతీర గ్రామస్తుడని తెలుసు

కొని, పడవను తీరం చేర్చి, ప్రతాప్‌ను అతడి ఇంటికి తీసుకుపోయాడు జరిగిన సంగతి విని ప్రతాప్ ముసలితల్లి చంద్రశేఖరుడి పాదాలు పట్టుకుని, అతన్ని ఆ పూటకు తమ యింట ఆతిధ్యం స్వీకరించమని వేడుకున్నది

శైవలిని, ప్రతాప్ క్షేమ సమాచారాల సంగతి తెలుసుకునే ప్రయత్నం చేయలేదు ఆమె అతడికి తన ముఖం చూపగూడదనుకున్నది చంద్రశేఖరుడు మర్నాడు ప్రయాణమైపోతూ, ఒక వీధి మొగలో శైవలినివి చూశాడు ముప్ఫైరెండేళ్ళ వయస్సులో గూడా కఠిన బ్రహ్మచర్య నిష్ఠల మధ్య కాలం గడిపే అతడి మనస్సు చలించింది. శైవలిని సౌందర్యం అతన్ని ముగ్ధుణ్ణి చేసింది.

చంద్రశేఖరుడు గొప్ప సంపన్నుడు కాకపోయినా, కూటికీ గుడ్డకూ లోటు లేని ఆస్తిపాస్తులు గలవాడు సంవత్సరం కిందట తల్లి మరణించే వరకూ అతడికి తన వివాహాన్ని గురించిన సమస్యే ఎదురు కాలేదు అతడు కాలాన్నంతా విజ్ఞాన సముపార్జనలో విని యోగిస్తూండేవాడు కాని, తల్లి మరణించగానే అతన్ని గృహ నిర్వహణ సమస్య ఎదుర్కొన్నది అంతదాకా గ్రంథపఠనంలో మునిగి తేలే అతడికి స్వయంగా భోజనం తయారు చేసుకోవటం పెద్ద బాధగా తయారయింది

ఈ పరిస్థితుల్లో తను వివాహమాడటం అన్నివిధాలా సౌఖ్యంగా వుంటుందేమో అన్న ఆలోచన అతడికి కలిగింది వివాహ మాడాలన్న నిర్ణయాని కొచ్చిన తరువాత, అతడు సౌందర్యవతి అయిన భార్యను మాత్రం తెచ్చుకోగూడదనుకున్నాడు కారణం– అందమైన ఇల్లాలి మోహబంధాల్లో చిక్కి, ఆ విధంగా తను ప్రాపంచిక సుఖాలలో జీవితాన్ని లగ్నం చేస్తే, త నింతవరకూ సంపాయించిన జ్ఞానం కాస్తా నీట కలుస్తుందని అతడు భయపడ్డాడు

చంద్రశేఖరుడు మానసికంగా యిలాంటి అస్తవ్యస్తస్థితిలో వున్నప్పుడే అతడు శైవలినిని చూడటం జరిగింది ఆమె ముగ్ధమోహనరూపం అతడి సంశయాలనూ, నిగ్రహాన్నీ పటాపంచలు చేసింది అతడు తనకై తాను పూనుకుని శైవలిని ముసలితల్లితో మాట్లాడి, ఆమె అంగీకారంతో శైవలినిని వివాహ మాడాడు

శైవలనీ, చంద్రశేఖరుల వివాహం జరిగిన ఎనిమిదేళ్ళ అనంతరం యీ కాబోయే ముఖ్య కథాభాగం ప్రారంభమవుతుంది

## 1

మీర్‌కాశింఖాన్ బెంగాలు, బీహారు, ఒరిస్సా ప్రాంతాలకు నవాబు అతడు ముంగేరుకోటలో నివశిస్తున్నాడు కోటలో జనానాస్త్రీలు వుండే రంగ

మహల్ అత్యంత రమణీయమైన శిల్ప సౌందర్యం కలది ఆ మహల్లోని ఒక గదిలో సుగంధతైలపు వెండిదీపాల వెలుగులో ఒక యువతి పట్టుతివాసీమీద కూర్చుని వున్నది. ఆమె గులిస్తాం అనే పారసీక పద్యకావ్యాన్ని చదవాలని ప్రయత్నిస్తున్నది, కాని, ఆమె మనస్సు అందులో లగ్నంకావటంలేదు

అది రాత్రి మొదటిజాము. కోట అంతా నిశ్శబ్దంగా వున్నది యువతి, చేతిలోని పుస్తకాన్ని తివాసిమీద జారవిడిచి, గవాక్షం దగ్గరకు వెళ్ళి బయిటికి చూసింది. తరవాత ఉస్సురంటూ వెనుదిరిగి, "ఆయ నెందు కొస్తారు? ఆయనకున్న వేలకొద్ది దాసీల్లో నేనూ ఒకదాన్ని" అనుకున్నది అంతలో ఆమె దృష్టి దంతపుబల్లమీద పెట్టివున్న వీణమీదికి పోయింది. ఆమె అక్కడికి పోయి వీణను చేతికి తీసుకుని తంత్రులను మీటుతూ మృదుస్వరంతో నెమ్మదిగా పాడ నారంభించింది. హఠాత్తుగా కాపలా వాడి 'సలాం' అన్నమాటా, గుర్రపు గిట్టల చప్పుడూ వినిపించింది యువతి వీణను కిందపెట్టి ద్వారం దగ్గరకు వెళ్ళింది. మీర్ కాశింఖాన్ నవాబు గుర్రం దిగి చరచర నడుస్తూ ద్వారంకేసి వచ్చాడు

యువతి నవాబును చూస్తూనే సిగ్గుతో బిడియంతో ద్వారంపక్కకు తప్పుకున్నది అతడు గదిలోకి ప్రవేశిస్తూనే తివాసీమీద పడివున్న వీణను చూసి చిరునవ్వు నవ్వుతూ, "దలనీబీబీ! ఏంపాట పాడుతున్నావు?" అని అడిగాడు. ఆ యువతిపేరు దౌలతున్నీసా. మీర్ కాశిం ఆమెను దలనీ అని పిలుస్తాడు.

దలనీ ఆ ప్రశ్న వింటూనే మరింత సిగ్గుపడిపోయి తలవంచుకున్నది. కాశిం ఆమెను సమీపించి, "దలనీ, ఏదో పాడుతున్నావుగా, ఆపాటే పాడు" అన్నాడు.

నవాబు ఆ విధంగా మరోసారి తన కోర్కె తెలియపరిచే సరికి దలనీ వీణను తీసుకుని, తంత్రులను సరిచేయ ప్రయత్నించింది కాని, ఎంత చేసినా శ్రుతి కలవలేదు. నవాబు సామీప్యత ఆమెను చాలా గజిబిజి చేసింది వీణను ప్రక్కన పెట్టి మరో వాయిద్యాన్ని తీసుకున్నా, అదీ శ్రుతి కలవలేదు,

ఇదంతా శ్రద్ధగా గమనిస్తున్న కాశిం పెద్దగా నవ్వుతూ, "సరే ఏంచేస్తాం, ఆలాగే పాడు,'' అన్నాడు.

ఆ మాటలో తనకు శ్రుతిజ్ఞానమే లేదని అతడు చెపుతున్నట్టు దలనీ అనుమానించింది దానితో ఆమెకు ఎంత ప్రయత్నించినా కంఠమే పెగలలేదు, అయినా, మరోసారి వీణను తీసుకుని శ్రుతి చేసి పాడాలని ప్రయత్నించింది, కాని ఫలితం లేకపోయింది. చివరకు దలనీ వీణను కింద పెడుతూ, "కలకత్తాలో ఇంగ్లీషువాళ్ళు పాడేటప్పుడు ఉపయోగించే వాయిద్యాన్ని తెచ్చి యిచ్చినప్పుడే, మీ ముందు పాడగలను. లేక

పోతే యిక ఎన్నటికీ పాడనే పాడను." అనేశింది

"ఆ ఇంగ్లీషువాళ్ళ వాయిద్యమా! సరే, చూతాం వాళ్ళదగ్గరకు పోయే మార్గం ముళ్ళమయిం కాకపోతే, తేగలను." అన్నాడు కాశిం

"ముళ్ళమయమా?" అన్నది, దలనీ ఆశ్చర్యంగా

"ఆ ఇంగ్లీషు వాళ్ళకూ మనకూ శత్రుత్వం ఖాయమైనట్టే నేను భావిస్తున్నాను, ఆ సంగతులేవీ నీకుతెలియవా?" అన్నాడు కాశిం విచారంగా

"ఏదో కొంచెం విన్నాను." అంటూ దలనీ తలాడించి మౌనంగా వుండి పోయింది

కాశిం ఆమెకేసి ఓ క్షణకాలం చూసి, "మౌనం వహించావేమ్! ఏమి టాలోచిస్తున్నావు?" అని అడిగాడు

"ఇంగ్లీషువాళ్ళతో యుద్ధం పెట్టుకున్నవాళ్ళంతా ఓడి పోతారని ఒకనాడు మీరే నాతో చెప్పారు ఆలాంటప్పుడు మీరు వాళ్ళతో ఎందుకు యుద్ధం చేయాలనుకుంటున్నారు? నేను, మీ దాసీదాన్ని ఈ ప్రశ్న వేసినందుకు క్షమించండి." అన్నది దలనీ.

మీర్ కాశిం తల పంకిస్తూ, "దలనీ, నువ్వు నా దాసీవికాదు, నా ప్రేయసివి నిన్ను ప్రేమించినవిధంగా మరేస్త్రీని నేను ప్రేమించలేదు సరే, ఆ ఇంగ్లీషువాళ్ళ విషయం - వాళ్ళతో యుద్ధం పెట్టుకుంటే నేను రాజ్యాన్నీ ప్రాణాన్నీకూడా కోల్పోవచ్చు ఆ సంగతి తెలిసినా, యుద్ధంకాక మరో మార్గంలేదు, నాకు. 'చక్రవర్తులం మేము! ప్రజల్ని పీడించి డబ్బు వసూలు చేసి, మాకు ఒప్పచెప్పే అధికారం మాత్రం మీది' అంటున్నారు వాళ్ళు ప్రజల మేలుకు అనుగుణంగా రాజ్యాన్ని పాలించలేనప్పుడు, ఆ రాజ్యాధికారం నా కెందుకు? ప్రజల్ని హింసించి ఇంగ్లీషువాళ్ళ బొక్కసాలు నింపటానికి, నేను సిరాజుద్దౌలానూ కాదు, మీర్ జాఫర్‌నూ కాదు," అన్నాడు.

"ప్రభూ, మీ రలా అన్నతరువాత నే చెప్పేదేముంది కాని, నా కో భిక్ష ప్రసాదించండి మీరు మాత్రం యుద్ధరంగానికి వెళ్ళనని మాట యివ్వండి" అన్నది దలనీ చేతులు జోడించి

"యుద్ధ విషయాల్లో స్త్రీల సలహాలు పాటించటం బెంగాలు నవాబు లెవరూ ఎరగ రనుకుంటాను!" అన్నాడు మీర్ కాశిం కటువుగా

ఆ కటుస్వరం వింటూనే దలనీ నిశ్చేష్టురాలై, కొంచెంసేపు మౌనంగా వూరుకొని, తరవాత చిన్న గొంతుతో, "నా అపరాధాన్ని క్షమించండి నేను తమర్ని మరొక భిక్ష కోరుతున్నాను మీ వెంట నన్నుకూడా యుద్ధరంగానికి తీసుకువెళ్ళండి," అన్నది

"నువ్వు యుద్ధరంగానికి వస్తావా ఏం? సేనాని గుర్గన్‌ఖాన్‌ను తీసివేసి



ఆపదవిలోనిన్ను నియమించమంటావా?" అన్నాడు మీర్ కాసిం

దలనీ తిరిగి మౌనం వహించింది. కాసిం ఆ మౌనాని కేదో ప్రబల కారణం వుంటుం దని వూహించి, "ఇంతకూ నువ్వు యుద్ధభూమికి రావాలని ఎందు కను కుంటున్నావు ?" అని ప్రశ్నించాడు ప్రేమగా

దలనీ మందహాసం చేస్తూ, "చక్ర వర్తీ! మీరు జ్యోతిశ్శాస్త్రం తెలిసినవారు గదా-ఆ జరగబోయే యుద్ధసమయంలో నే నెక్క డుంటానో, చెప్పండి," అని అడిగింది

మీర్ కాశిం కలం కాయితం తీసుకుని ఏవో లెక్కలు వేసిచూసి, తల అడ్డంగా తిప్పుతూ కాయితాన్ని ఉండగా చుట్టి దూరంగా విసిరివేసి, విచారంగా తల వంచు కూర్చున్నాడు.

"లెక్కకట్టి చూశారా ?' అన్నది దలనీ.

"చూశాను అంతా ఆశ్చర్యంగా వున్నది నువ్వు వినకపోవటం మం చిది" అంటూ కాశిం లేచి, ద్వారం దగ్గ రకు పోయి, మీర్ మున్షీ అనే ఉద్యో గిని పిలిచి, "చంద్రశేఖరశర్మ అనే బ్రాహ్మణుడు ముర్షీదాబాద్ సమీపంలో వున్న వేదగ్రామంలో వుంటాడు. అత

దికి ముర్షీదాబాద్‌లో వున్న మన హిందూఉద్యోగి ద్వారా కబురు పంపండి. ఇంగ్లీషు వాళ్ళతో మనకు రానున్న యుద్ధ సమయంలో దలనీబేగం ఎక్కడ వుంటుందో, ఆమె భవిష్యత్తు ఏమిటో అడిగి తెలుసుకోమనండి" అని ఉత్తరు విచ్చాడు.

## 2

వేదగ్రామాన్ని ఆనుకునే భీమ అనే పెద్ద చెరు వొకటున్నది అది సాయం సంధ్యాకాలం ఆ సమయంలో శైవలిని, తన పొరుగింటి యువతి సుందరితో కలిసి చెరువుకు నీళ్ళకు వచ్చింది ఇద్దరూ బిందెలతో నీళ్ళు ముంచి ఒడ్డున పెట్టి, గొంతుబంటికి నీళ్ళలోకి వెళ్ళి ఒకళ్ళమీద ఒకళ్ళు నీళ్ళు చిమ్ముకుంటూ స్నానాలు చేయసాగారు

క్రమంగా మసక చీకటి ముంచుకొస్తున్నది. చెరువుగట్టున వున్న పెద్దపెద్ద తాటిచెట్లు బారులు తీరి నిలచిన భూతాల్లా కనిపించసాగినై సుందరి ఒకసారి తల ఎత్తి తాటిచెట్లకేసి చూసి, "శైవలీ, ఇక బయలుదేరుదాం చీకటి పడిపోతున్నది" అన్నది.

"పడనీ, ఏం, భయమా?'' అన్నది శైవలిని, తడిసిన జుట్టును చేతితో విదిలిస్తూ.

"భయంకాదా! ఈ సమయంలో ఒక ఆంగ్లేయుడు రోజూ ఇటుకేసి వస్తున్నాడని క్షేమాతల్లి చెప్పింది'' అన్నదిసుందరి భయపడుతున్నట్టు ముఖం పెట్టి.

శైవలిని చిరునవ్వు నవ్వుతూ, తన వేలిని దూరంగా వున్న ఒక తాటిచెట్టు కేసి చూపింది సుందరి తన దృష్టిని అటు సారిస్తూనే కెవ్వుమని ఒక చిన్న కేక పెట్టి, "శైలీ! యిక రా, నే పోతున్నాను,'' అంటూ ఒడ్డుకు పరిగెత్తింది

శైవలిని చూపిన తాటిచెట్టు కింద ఒక ఆంగ్లేయుడు నిలబడి, చెరువులో జలకాలాడుతున్న శైవలినీ, సుందరీల కేసి చూస్తున్నాడు సుందరి ఒడ్డుకు పరిగెత్తి బిందెను భుజంమీద పెట్టుకుంటూ, అటుకేసి చూసేసరికి ఆంగ్లేయుడు ముందుకు కదిలాడు అది చూస్తూనే సుందరి పెద్దగా కేకపెట్టి శైవలినినిపిలుస్తూ, పరిగెత్తబోయేసరికి బిందె కాస్తా జారి పెద్ద శబ్దం చేస్తూ కింద పడిపోయింది సుందరి వెనక్కు తిరిగిచూడకుండా గ్రామంలోకి పరిగెత్తింది

శైవలిని మాత్రం నీటిలో వున్న చోటనే కదలా మెదలక వుండిపోయి, తనకేసే వస్తున్న ఆంగ్లేయుణ్ణి పరీక్షగా చూడసాగింది. ఆంగ్లేయుడు సుందరి పారిపోవటం చూస్తూనే చకచక నడిచి వచ్చి, శైవలిని వున్న చోటును సమీపిస్తూనే, ఇంగ్లీషులో ఏదో అన్నాడు.

శైవలిని ఆ భాష తన కేమీ తెలియదన్నట్టు అడ్డంగా తలాడించింది ఆంగ్లే

యుడు చిరునవ్వునవ్వి, "మేమూ ఎగేన్ వచ్చినామూ," అన్నాడు

"ఎందుకూ? యమధర్మరా జింటికి దారి యిదేనా? "అన్నది శైవలిని.

ఆ మాటల్లోని వ్యంగ్యం ఏమీ అర్థం కాక ఆంగ్లేయుడు, "వ్హాట్...ఏమ్టి...? అన్నాడు, నీటి అంచుకు వస్తూ

"యముడు నీ సంగతి పట్టించుకో వటంలేదని బాధగావుందా, అంటున్నాను" అన్నది శైవలిని

"యమ్, యమ్! ఓ యమర్సన్ యూ మీన్ ? మేం ఎమర్సన్ కాదు మేం లారెన్స్!'' అన్నాడు ఆంగ్లేయుడు.

"ఓహో, మీరు లారెన్సులా! అంటే కోతన్నమాట. ఒక ఇంగ్లీషుమాట నేర్చు కున్నాను" అన్నది శైవలిని

ఆ సంజెవేళ లారెన్స్ ఫాస్టర్ యీ విధంగా శైవలినిచేత ఒకటికి రెండు తిట్లు తిని తన మకాంకు తిరిగి వెళ్ళాడు

శైవలిని ముసిముసి నవ్వుకుంటూ నీళ్ళలోనుంచి బయటికివచ్చి బిందెభుజాన వెట్టుకుని ఇంటికి వెళ్ళింది. ఆ సమ యంలో చంద్రశేఖరుడు, రామనామం అద్దిన దుప్పటిని నడుమునుంచి మోకా ళ్ళకు బిగించి, ప్రమిదె వెలుగులో, ఒక తాళపత్ర గ్రంథాన్ని పరిశీలిస్తూ, బ్రహ్మ సూత్రాల్లో ఒక ముఖ్య సూత్రానికి తాత్ప ర్యంకోసం ఆలోచిస్తున్నాడు.

తన భర్త చెరువునుంచి యింత ఆల శ్యంగా ఎందుకొచ్చా వని అడగకపోయే సరికి శైవలినికి ఎందుకనో నవ్వొచ్చింది ఆ నవ్వు వింటూనే చంద్రశేఖరుడు తః ఎత్తి, "వేళ కాని వేళ యీ మెరు పేమిటి?" అన్నాడు

"నేను చెరువు నుంచి రావటం ఆలస్య మైనందుకు," అన్నది శైవలిని

"అవునవును ఇంత ఆలస్యంగా వచ్చావేం?" అన్నాడు చంద్ర శేఖరుడు,

"ఆలస్యం కాకేంచేస్తుంది! అక్కడి కొక ఆంగ్లేయు డొచ్చాడు భయంవల్ల నేను నీళ్ళలో నుంచి కదల లేక పోయాను సుందరి మాత్రం పారి పోయింది, ఆ ఆంగ్లేయుడు తిరిగి వెళ్ళ గానే, ధైర్యం తెచ్చుకొని నేను నీళ్ళలో నుంచి ఒడ్డుకు చేరాను," అన్నది శైవలిని

"ఇంకెప్పుడూ చీకటిపడి అటు వెళ్ళకు," అంటూ చంద్రశేఖరుడు పక్కన వున్న శంకరభాష్యం తీసుకుని చదవసాగాడు

* * *

రాత్రి మూడవజాము చంద్రశేఖ రుడు యింకా తాళపత్ర గ్రంథాలు తిరగవేస్తూనే వున్నాడు మాయ, స్ఫోటము, ప్రేమ, అపౌరుషేయ తత్వము — యిలాంటి తర్క వితర్కాల్లో అతడి మనస్సు లగ్నమై పోయింది. ఉన్నట్టుండి ఒక గుడ్ల గూబ కఠోరంగా అరుస్తూ యింటిమీదుగా

పోవటంతో చంద్రశేఖరుడు తల ఎత్తి చూశాడు. శైవలిని దూరంగా చాపమీద గాఢనిద్ర పోతూ అతడి కంటబడింది. ఆమె సౌందర్యం, యవ్వనం అతడి మనస్సును వ్యాకుల పరిచింది "అయ్యో! ఇంత సుందరాంగిని నే నెందుకు వివాహ మాడాను? ఈ రత్నం ఏ మహారాజు మకుటంలోనో ప్రకాశించ వలసింది. శాస్త్ర గ్రంథ పారాయణంలో లీనమైన ఈ బ్రాహ్మణ పండితు డింటికి యీమె నెందుకు తెచ్చినట్టు! ఈమె రాక నాకు సుఖా న్నిచ్చినమాట నిజమే! కాని. నా వల్ల యీమె పొందుతున్న సుఖ మేమిటి'" అనుకుంటూ చంద్రశేఖరుడు కన్నీళ్ళు కార్చసాగాడు.

మర్నాటి సూర్యోదయంవేళ మీర్ కాశింనుంచి అతడికి ముర్షిదాబాదు రావల సిందిగా అహ్వానం వచ్చింది.

3

వేదగ్రామానికి దగ్గర్లోనే పురందర



పుర మనే గ్రామం ఒక టున్నది ఆ గ్రామం ఇంగ్లీషు వాళ్ళ వర్తక స్థానం దానికి లారెన్స్‌ఫాస్టర్ అధిపతి అతడీమధ్యనే భారత దేశం వచ్చాడు అందమైన యువకుడు ఆకాలంనాటి ఆంగ్లేయులందరిలాగే అతడికి బెంగాలు గాలి సోకగానే ధనదాహం పట్టుకున్నది దానితో అతడికి అన్ని విషయాల్లోనూ నీతి నియమాల పట్టింపు వదిలిపోయింది

ఫాస్టర్ ఒకనాడు భీమా తటాకం దగ్గరకు సాయంకాలం వేళ వాహ్యాళికి వచ్చి నీటిలో పద్మంలా మెరిసిపోతున్న శైవలిని చూసి మోహావివశుడయ్యాడు అప్పటికే ధనాశ చూపి బెంగాలు యువతుల్ని తమ వశం చేసుకున్న





ఆంగ్లేయుల్ని కొందరి నత దెరుగు. డబ్బుతో కానిపని అంటూ యీ దేశంలో ఏదీ లేదని ఆత దొక నిర్ధారణ కొచ్చాడు

శైవలినికోసం ఫాస్టర్ నాలుగైదు సార్లు ప్రయత్నంచేసి విఫలు డయ్యాడు కాని, ఆతడికి తాను విజయం పొందుతా ననే ఆశమాత్రం వదలలేదు శైవలిని తనను మొదటిసారి చూసినప్పుడు కన బరచిన అయిష్టతా, భయం క్రమంగా ఆమెలో మటుమాయ మవుతున్నట్టు అతడు ఊహించాడు ఇందులో కొంత నిజం లేకపోలేదు

సాధారణంగా తెల్లముఖం కనబడితే, అదేదో భూతమో, పిశాచమో అన్నట్టు భయపడిపోయి ముఖం తిప్పేసుకోవటం బెంగాలు పిల్లలూ, యువతులూ చేసేపని కాని వాళ్ళల్లో కొందరు మూర్ఖులు ఆ తెల్లముఖాన్ని దగ్గర్లో చూడాలని మంకు పట్టు పడతారు శైవలిని ఆ కోవకు చెందు తుంది ప్రథమంలో ఫాస్టర్‌ను చూసి ఆమె నిజంగానే భయపడిపోయింది. కాని ఆ తర్వాత, "ఈ ఇంగ్లీషువాళ్ళు మను షుల్ని తినే పిశాచాలుకాదు, అందమైన అద్భుత జంతువులు! ఒకసారి పరిశీ లించిచూడు," అని ఎవరో ఆమెకు చెవిలో రహస్యంగా చెప్పినట్టయింది ఆ క్షణంనుంచీ ఆమె ఫాస్టరు కనబడితే సుందరిలా పారిపోవడం మానింది క్రమంగా అతడితో సంభాషణకూ్కడా దిగింది

పరిస్థితు లిలా వుండగా కలకత్తా కంపెనీ హెడ్‌క్వార్టర్స్‌నుంచి ఫాస్టర్‌కు హఠాత్తుగా ఒక ఉత్తరు వొచ్చింది పురందరపురంలో కంపెనీ పనులు చూసేందుకు మరొకరిని నియమించామనీ అతణ్ణి త్వరలో బయలుదేరి కలకత్తా రమ్మనీ వాళ్ళు రాశారు. ఆ వుత్తరాలతో, కొత్తగా పురందరపురంలో నియమించ బడిన వ్యక్తి ఫాస్టర్ దగ్గరకు వచ్చాడు

ఈ ఉత్తరువు చూసి ఫాస్టర్‌కు వెర్రెత్తిపోయింది అతడి మనస్సులో శైవలిని సౌందర్యం అచ్చుగుద్దుకు పోయింది పని సానుకూలం అయ్యే దశలో, యీ ఆదేశం రావటం అతడికి నెత్తిన పిడుగుపాటులా తోచింది ఎది ఏమైనాసరే, శైవలిని వెంట లేకుండా కలకత్తా వెళ్ళగూడ దని ఫాస్టర్ నిశ్చ యించుకున్నాడు ఆ కాలంలో బెంగా లులో వున్న ఆంగ్లేయులు రెండే రెండు విషయాల్లో అసమర్థులు వాళ్ళు కాంక్షిం చిన ఏ వస్తువునైనా సరే వదులుకోవ డానికి అసమర్థులు, అపజయాన్ని అంగీకరించటానికి అసమర్థులు

ఫాస్టర్ బాగా ఆలోచించి ఒక నిర్ణ యానికి వచ్చాడు అతడు కలకత్తాకు ప్రయాణమై వెళ్లవలసినరోజుకు ముందు రోజున కంపెనీ నౌకర్లలో ఒకణ్ణి రహ స్యంగా శైవలిని వద్దకు పంపాడు ఆ నౌకరు శైవలినితో మాట్లాడి, సంగతి సందర్భాలన్నీ ఫాస్టరుకుతెలియపరిచాడు.

ఆ రాత్రి చంద్రశేఖరుడి ఇల్లు దోపిడీ కాబోతున్న దని వేదగ్రామంలో ఒక పుకారు బయలు దేరింది. చంద్రశేఖరుడు ఇంట లేడు. మీర్‌కాశిం పంపిన ఆదేశం అందుకుని అతడు ముర్షీదాబాదు వెళ్లాడు. రాత్రి సగం గడిచేటప్పటికి పగలు పుట్టిన పుకారు కాస్తా నిజమై వూరుకున్నది.

హఠాత్తుగా గ్రామంమధ్య తుపాకులు పేలినై. కాగడాలు పట్టుకున్న అనేక మంది వ్యక్తులు కోలాహలంగా అరుస్తూ చంద్రశేఖరుడి ఇంటిపై బడ్డారు. గ్రామవాసులు ఎవరి గడపల్లో వారుండి యీ దోపిడీని చూడసాగారు. ఎవరూ సాహసించి దొంగలను అటకాయించే ప్రయత్నం చెయ్యలేదు.

ఒక గంట తరువాత దొంగలు అట్టహాసాలు చేస్తూ ఇంటినుంచి బయటకు వచ్చారు. వాళ్ళ వెనగ్గా నలుగురు బోయీలు ఒక పల్లకీ నెత్తుకుని వీధిలోకి వచ్చారు. పల్లకీ తలుపులు బిగించి వున్నాయి. దానివెనక తుపాకీలు భుజాన పెట్టుకుని పురందరపురం కంపెనీ యజమాని ఫాస్టర్ నడుస్తున్నాడు. గ్రామవాసులు పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు.

దోపిడీదార్లు అటు గ్రామం వదలి పోగానే, యిటు గ్రామస్థు లంతా బిలబిలమంటూ ఇళ్ళనుంచి బయిటికి వచ్చి, చంద్రశేఖరుడి యింటిని చుట్టుముట్టారు. ఇంట్లో దోచుకోబడిన సామాన్లు బహు కొద్ది. చాలా వస్తువులు ఎక్కడివక్కడే చెక్కు చెదరకుండా వున్నవి. శైవలిని మాత్రం లేదు.

"పాపం, భయపడి ఎక్కడో దాక్కుని వుంటుంది. ఇహ వచ్చేస్తుంది'' అన్నారు కొందరు.

"ఇహ రాదు. ఒకవేళ వచ్చినా, చంద్రశేఖరుడు ఆమెను ఇంట అడుగు పెట్టనివ్వడు. ఆ పల్లకీలో చిన్నదెవరను కున్నారు? శైవలినే. హాయిగా వెళ్ళి పోయింది," అన్నారు మరికొందరు.

ఈ ధోరణిలో రాత్రి చాలా పొద్దు పోయిన వరకూ మాట్లాడుకుని గ్రామస్థులు ఎవరిళ్ళకు వారు వెళ్ళిపోయారు. కాని, ఒక్క సుందరిమాత్రం తెల్లవార్లు ఆ ఇంట్లోనే దుఃఖిస్తూ కూర్చున్నది. ఆమెకు శైవలిని తిరిగి వస్తుం దన్న ఆశ పోలేదు. సుందరి శైవలిని స్నేహితురాలు. చంద్రశేఖరుడికి వరసకు చెల్లెలవుతుంది.

సుందరి సూర్యోదయం అయ్యే వరకూ, కాలం గడిపి, శైవలిని తిరిగి రాదని నిశ్చయించుకుని, ఇంటికి పోయి రోదించసాగింది.

## 4

లారెన్స్ ఫాస్టర్ గంగానదీ తీరం వరకూ శైవలిని వున్న పల్లకీవెంట నడిచాడు. అక్కడ అత డిదివరకే సిద్ధం చేయించిన చిన్నపడవ ఒకటి రేవులో

వున్నది. పడవమీద హిందూ నౌకర్లూ, దాసీలూ వున్నారు ఫాస్టర్ శైవలినిని అ పడవలో ఎక్కించి, దానిని ముంగేరుకు తీసుకు వెళ్లవలసిందిగా కళాసులను ఆజ్ఞాపించాడు

శైవలిని వున్న చిన్న పడవతోపాటు తను మరొక పడవలో బయలుదేరితే తను గడువు లోపల కలకత్తా చేరటం అసంభవం, అని ఫాస్టర్ నిర్ణయించు కున్నాడు శైవలిని వున్నది తెడ్లపడవ ఆ కారణంగా ఫాస్టర్ వేగంగా పోయే తెరచాపలు గల పెద్దపడవ నొకటి ఎక్కి కలకత్తా బయలుదేరాడు శైవలిని వున్న పడవకు సైనిక కాపలా లేనందున దాన్ని అటకాయించి, ఆమెను విడిపిస్తా రేమో అన్న భయం ఫాస్టర్‌కులేదు. అంగ్లే యుడి తాలూకు పడవ అని తెలిస్తేచాలు, ఆ ఛాయలకు ఎవరూ రారు

శైవలిని వున్న పడవ ప్రశాంతంగా వున్న గంగానదిలో ప్రయాణిస్తూ ముంగేరుకేసి కదిలింది మధ్యాహ్నం వరకూ ప్రశాంతంగా వున్న వాతా వరణం, సూర్యుడు పడమటికి కొంచెం వాలగానే పెద్ద గాలితో, మేఘ గర్జనలతో రౌద్ర రూపం ధరించింది కళాసులు బలంగా తెడ్లు వేసి పడవను ముందుకు నడిపేందుకు ప్రయత్నించారు కాని, నదిలో లేచిన పెద్దపెద్ద అలలు పడవ ముందుభాగాన్ని తాకి, దానిని గిర్రున తిప్పసాగాయి ఇక లాభం లేదని కళాసులు పడవను దాపులనే వున్న భద్రావతి రేవుకు తీసుకువచ్చి లంగరు దించారు

రేవులో పడవ ఆగిన మరుక్షణం ఒక దాసీమనిషి ముఖం కనబడీ కనబడ నట్టు ముసుగు కప్పుకుని పడవమీదికి, వచ్చింది. ఆమెకు పడవమీద, శైవలిని వెంటవున్న దాసీల్లో ఒకతె ఎదురై, "ఎవరు నీవు? ఇక్కడికెందు కొచ్చావు?" అంటూ హుంకరించింది

"నేను దాసీదాన్ని, పడవలో వున్న స్త్రీల కెవరికైనా నలుగుపెట్టి స్నానాలు చేయించే పనేమైనా దొరుకుతుందేమో అని వచ్చాను. మీ రెక్కడినుంచి వస్తు న్నారు?" అన్న దా దాసీమనిషి

ఆ ప్రశ్న వింటూనే, ఇంగ్లీషు దొర దగ్గిర కొలువు చేస్తున్నా ననే గర్వంతో వున్న దాసీదానికి ఎక్కడలేని కోపం వచ్చింది. అది కళ్ళురుముతూ, "నీ వెవత్తెవే యీ ప్రశ్న లడగటానికి? మేం ఢిల్లీ నుంచి వస్తున్నాం, మక్కా నుంచి వస్తున్నాం, ఆ ఆజ అంతా నీ కెందుకు?" అన్నది

"ఏదో తెలియ కడిగానమ్మా! కాస్త పనిప్పిస్తే నీ మేలు మరువను," అన్నది, పనికోసం వచ్చిన దాసీమనిషి

ఆ ప్రార్థనతో మెత్తబడిన దాసీది లోపలికి వెళ్ళి శైవలినితో సంగతి చెప్పి, "కాళ్ళకు పారాణేమయినా పెట్టించుకుం

టారా, అమ్మా!'' అన్నది. శైవలిని తల వూపింది

పనికోసం వచ్చిన దాసీది పడవలోకి వెళ్ళి శైవలిని వున్న గది ప్రవేశించింది అక్కడ శైవలిని తప్ప మరెవరూ లేరు శైవలిని కనపడగానే ఆ దాసీమనిషి తలమీది ముసుగు మరికాస్త ముందుకు లాక్కుని, ఆమె కాళ్ళకు పారాణి పెట్టసాగింది

శైవలిని ఆ దాసీమనిషిని కాసేపు పరిశీలనగా చూసి, ''ఏమే, నీ పేరు ఏమిటి'' అని అడిగింది. జవాబు లేదు శైవలిని ఆ మనిషి కేసి మరికాస్త పరిశీలనగా చూసి, "ఏమే, ఏడుస్తున్నావా?" అని ప్రశ్నించింది ఆశ్చర్యంగా

"ఊహుఁ లేదు,'' అన్నది దాసీ మనిషి చిన్న గొంతుతో

"కాదు, అబద్ధ మాడుతున్నావ్ !" అంటూ శైవలిని, పనిమనిషి తలమీది ముసుగు లాగివేసి నిశ్చేష్టురాలైంది

ఇంతకూ ఆ దాసీమనిషి వేషంలో పడవ మీదికి వచ్చింది మరెవరో కాదు, సుందరి!

"సుందరీ, ఏమి టీ సాహసం! నువ్విక్కడి కెలా వచ్చావ్ ?" అన్నది శైవలిని ఆదుర్దా కనబరుస్తూ.

"ఆ సంగతు లన్నీ తరువాత చెప్తాను ముందు నువ్వు నా చీర కట్టుకుని యిక్కణ్ణించి పారిపో. ఇవిగో, యీ గాజులు కూడా తొడుక్కో. తల మీద ముసుగు వేసుకుని మెల్లిగా పడవ దిగి వెళ్ళు'' అని తొందర చేసింది సుందరి.

శైవలిని ఆమె మాట లేమీ వినిపించుకున్నట్టులేదు ఆమె సుందరి కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "అసలు నువ్విక్కడికి ఎలా రాగలిగావు?" అని ప్రశ్నించింది

"నువ్వెక్కిన పల్లకీ గంగాతీరం కేసి వెళ్ళిందని చూసినవాళ్ళు చెప్పారు. ఉదయానే నువ్వు పడవలో బయలుదేరటం కూడా చూసినవా ళ్ళున్నారు ఆ భోగట్టా అంతా తెలుసుకుని, మీ అన్నగారు తోడు రాగా చిన్న పడవ ఎక్కి, నీ వున్న పడవను అనుసరించి వచ్చి, యిక్కడికి దాపులనే ఒడ్డు చేరాను సరే, ఆ వివరా లన్నీ యిప్పుడెందుకు? నువ్వు దుస్తులు మార్చుకొని, పడవ దిగి, నదికి దిగువగా కొద్ది దూరం వెళ్లావంటే, అక్కడ మీ అన్నగారు కన్పిస్తారు ఆయన్ని అన్నయ్యా అని పిలిచేందు కేమీ సిగ్గుపడకు పడవ మీద ఆయన నిన్ను సురక్షితంగా ఇల్లు చేరుస్తారు" అన్నది సుందరి.

శైవలిని కొంచెముసే పాలోచించి, "నే వెళ్ళి పోయిం తరవాత నువ్విక్కడ చిక్కుల్లో పడతావు ఆ సంగతి ఆలోచించావా ?" అని అడిగింది

"ఆ భయం నా కేమీలేదు. నే నీ పడవ నుంచి తప్పించుకు రాగలను. బ్రాహ్మణ

యువతిని. బ్రాహ్మణ యిల్లాలిని. అన్ని ఆపదల్నుంచీ మనను ఆ పరమాత్మడే రక్షిస్తాడు నేను రాత్రికి తప్పక ఇల్లు చేరుకుంటాను. నువ్విక ఆలశ్యం చేయకు మీ అన్నగారింత వరకూ భోజనం చెయ్యలేదు ఊఁ, తొందరగా యీ చీర కట్టుకో," అంటూ సుందరి, శైవలినిని వేగిర పరిచింది

శైవలిని అయిష్టంగా తలాడిస్తూ, "ఉహూఁ, కుదరదు, నే నింటికి వెళ్ళినా, ఆయన నన్నా ఇంట్లోకి రానివ్వరు" అన్నది

"ఏమిటా మాటలు!" అంటూ సుందరి విసుక్కున్నది

"చూడు, సుందరీ! నన్ను ఒక ఆంగ్లేయుడు యిక్కడికి తీసుకొచ్చాడు ఇప్పుడు నేను కులం, జాతీ అన్నీ పోగొట్టుకున్న దాననే గదా?" అంది శైవలిని

సుందరి ఆశ్చర్యంగా శైవలిని ముఖం లోకి చూసి, "ఒక్క ప్రశ్న అడుగుతాను, నిజం చెపుతావా'' అన్నది

"అడుగు,'' అన్నది శైవలిని

"ఈ గంగానది సాక్షిగా ''

సుందరి యిలా అనేసరికి శైవలిని కంపించిపోతూ, "నువ్వడగ దలిచిన ప్రశ్నేమిటో నాకు తెలుసు ఈ పడవ ఎక్కిన తరువాత యింతవరకూ ఆ ఆంగ్లేయుణ్ణి నేను చూడలేదు నన్ను తిరిగి స్వీకరించినంత మాత్రాన, నాభర్త ధర్మ చ్యుతులు కారు,'' అన్నది

"అలా అయితే, నీ భర్త నిన్ను తప్పక స్వీకరిస్తారు ఆయన చాలా ధర్మాత్ములు ఎందుకింకా కాలయాపన చేస్తావే?'' అని సుందరి తొందర పెట్టింది

శైవలిని తల వంచుకుని కాస్సేపు మౌనంగా వుండి, తరవాత తల ఎత్తి సుందరికేసి చూసి, కన్నీటిని కొంగుతో తుడుచుకుంటూ, "నువ్వన్నట్టు, నేను తిరిగివస్తే ఆయన స్వీకరిస్తారు కాని, వచ్చిన యీ కళంకం ఎన్నటికీ చెరిగి పోయేదికాదు," అన్నది గాద్గదికంగా

సుందరి మాట్లాడలేకపోయింది.

శైవలిని బొటబొట కన్నీరు కారుస్తూ "నన్ను వారు స్వీకరించినా, నా కళంకం పోదు గ్రామంలోని యువతులందరూ నన్ను చూసినప్పుడల్లా, 'ఇదుగో, ఆ ఇంగ్లీషువాడు ఎత్తుకుపోయిం దీమెనే,' అంటారు. నాకొకవేళ ఏ కూతురో కలిగితే, బ్రాహ్మణకులంలో ఎవరైనా ఆమెను చేసుకుంటారా? నే నిప్పుడు ఇంటికి వచ్చి, 'నేను పవిత్రంగానే వున్నాను' అని చెపితే ఎవరైనా నమ్ముతా రంటావా?'' అనడిగింది

"నువ్వను మానిస్తున్నదే నిజం కావొచ్చు అయినా, నీ ఇంట్లో నువ్వు పడి వుండటం మేలుకదా," అన్నది సుందరి

"ఏం సుఖం వుంటుం దని ఆ ఇంట్లో పడి వుండను? తల్లి, తండ్రి, అన్న ఎవరూ లేనిదాన్ని కదా_''

"భర్త మాటేమిటి? ఈ స్త్రీ జన్మ."

"భర్త! ఆయన సంగతి తెలుసుగదా? ఆయన.........''

శైవలిని మాట పూర్తి చేయకుండానే సుందరి అందుకుని, కోపంతో వణికి పోతున్న గొంతుతో, "ఆయన సంగతి తెలుసు! ఈ భూమ్మీద నీకంటె పాపాత్మురాలు వుండబోదు నీభర్త వంటివాడు లభించడమే మహాభాగ్యం. ఆయన ధర్మాత్ములు, పండితులు నువ్వేమో పాపివి," అన్నది

శైవలిని దుఃఖం వల్ల వణికిపోతున్న కంఠస్వరంతో, "నేను ఇంటికి వచ్చి ప్రయోజనంలేదు ఆ ఇంట్లో వున్నా, నా మన స్సెప్పుడూ, నాతండ్రితరుపు బంధువుల ఇళ్ళకు వెళ్ళివుందా మనో, కాశీకి పోయి భిక్ష మెత్తుకు బతుకుదా మనో, ఏనూతిలోనైనా పడిచద్దా మనో మాత్రమే ఆలోచిస్తూ వుంటుంది మృత్యువుతప్ప నా కిక మరోమార్గంలేదు నేనిక ఇంటికి రానని ప్రతిజ్ఞ చేస్తున్నాను నువ్వు అనవసరంగా నాకోసం చాలా శ్రమపడ్డావు నేను చచ్చిపోయా ననుకో. ఇక వెళ్ళు," అన్నది

ఆ మాటలతో సుందరి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి ఆమె ఏడుస్తూ, "శైవలీ, నువ్వు త్వరలోనే చస్తా వని నమ్ముతున్నాను. చావటానికి అవసరం అయిన మనోబలం నీకు ప్రసాదించా లని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. ముంగేరు చేరక పూర్వమే నువ్వు చావాలి ప్రళయమో, తుఫానో వచ్చి నీ వున్న పడవ గంగా జలంలో కలిసిపోవాలి," అంటూ పడవ దిగి, నదిఒడ్డున నడుస్తూ, తన భర్త వున్నచోటుకు వెళ్ళిపోయింది.

## 5

నవాబ్ మీర్‌కాశిం కబురు పంపగా ముర్షీదాబాదు వెళ్ళిన చంద్రశేఖరుడు, అక్కడ హిందూరాజోద్యోగిని కలుసుకున్నాడు. ఆయనద్వారా, ఇంగ్లీషు వాళ్ళతో రానున్న యుద్ధసమయంలో దలనీబేగం ఎక్కడ వుంటుందో తెల్సుకోవాలని నవాబు కాంక్షిస్తున్నట్టు విన్నాడు.

చంద్రశేఖరుడు తనకు తెలిసిన జ్యోతిశ్శాస్త్ర జ్ఞానా న్నంతా వినియోగించి లెక్కలు వేసిచూసి, హిందూ ఉద్యోగితో "మహాశయా! నేను నా చేతనైనంత వరకూ ఆ బేగంగారి భవిష్యత్తు ఎలా వుంటుందో తెలుసుకునే ప్రయత్నం చేసి, విఫలు ణ్ణయ్యాను ఈ సంగతి నవాబుగారికి విన్నవించండి" అన్నాడు

హిందూ ఉద్యోగి ఆశ్చర్యపోతూ, "మీరు విఫలులు కావటమా! ఎందువల్ల!" అని అడిగాడు

"అన్నీ జ్యోతిశ్శాస్త్రాధారంతో గ్రహించలేము. అయితే, మనిషి సర్వజ్ఞు డవుతాడు నే నేమీ జ్యోతిషంలో మహా

పండితుణ్ణి కాను." అన్నాడు చంద్ర శేఖరుడు

ఈ జవాబుకు హిందూ ఉద్యోగి చిరు నవ్వు నవ్వుతూ, "ఆ మాట నేను నమ్మను. బుద్ధిమంతులు రా జు ల కు అసంతృప్తి కలిగించే మాట లేవీ చెప్ప కూడ దంటారు బహుశా, అది కారణం అనుకుంటాను ఏదైతేనేం, మీరు చెప్పిన మాటలే నవాబుగారికి విన్నవిస్తాను." అన్నాడు

చంద్రశేఖరుడు ఆయన దగ్గిర శెలవు తీసుకుని స్వగ్రామానికి బయలు దేరాడు గ్రామం అంతదూరంలో కన బడగానే, ఎందుకనో అతడి మనస్సు కలత చెందింది. తను, ఇంటలేని సమ యంలో శైవలిని కేమీ ఆపద రాలేదు కదా ! అనుకున్నాడు. అతడి ఆలోచ నలు పరిపరివిధాల పోయినై

గ్రామంలో అడుగిడుతోనే అతడు తన కెదురైనవారి ప్రవర్తన చూసి కొంచె మాశ్చర్యపడ్డాడు. ఎదురైనపెద్దలు తలలు వంచుకొని పక్కకు తప్పుకున్నారు పిల్లలూ, కుర్రకారూ అదోరకంగా పళ్ళికి లించారు. ఇంటిని సమీపిస్తూనే అతడు వీధిద్వారం తలుపులు మూసివుండటం గమనించాడు

నేను భయపడుతున్నట్టే ఏదో ప్రమాదం జరిగింది అనుకున్నాడు చంద్ర శేఖరుడు. అతడు ద్వారాన్ని సమీపించి తలుపులను నెట్టిచూశాడు. లోపల గడి వేసివుంది తలుపులమీద గట్టిగాకొట్టాడు ఆ వెంటనే నౌకరు తలుపులు తెరిచి, చంద్రశేఖరుణ్ణి చూసి పెద్దగా ఏడ్చాడు

"ఏం జరిగింది?" అని అడిగాడు చంద్రశేఖరుడు నౌక రేమీ జవాబు చెప్ప కుండా పక్కకు తొలగి నించున్నాడు

చంద్రశేఖరుడు మనస్సులో ఓ మారు తన ఇష్టదైవాన్ని స్మరించి, ఇల్లంతా కలయ చూశాడు ఇల్లు ఊడ్చినట్టులేదు చండీదేవి మండపంనిండా దుమ్మూ దూగరా పడివున్నది అక్కడక్కడా కాలిన కాగడా పీలికలూ, విరిగిన కొయ్య ముక్కలూ పడివున్నాయి. అతడు గబ గబా ముందుకు వెళ్ళి పెరటి తలుపులు తెరుస్తూ, "శై వ లి నీ!" అంటూ బొంగురు పోయిన గొంతుతో పెద్దకేక పెట్టాడు.

ఎవరూ జవాబు పలకలేదు పెరట్లో ఒకమూల చెట్టుకింద కూచునివున్న దాసీడిమాత్రం ఆకేక విని పెద్దగా శోకాలు ప్రారంభించింది చంద్రశేఖరుడు మరొక మారు, "శైవలినీ!" అంటూ కేక పెట్టాడు. ఆకేక ఇంట్లో అన్నిమూలలా ప్రతిధ్వనించింది. చంద్రశేఖరుడు హతా శుడై, బరువెక్కిన గుండెల్తో వెనుదిరిగి చండీదేవి మండపంముందు కూలబడ్డాడు.

* * *

చంద్రశేఖరుడు జరిగిన దంతా ఇంటి నౌకర్ల ద్వారా, పొరుగిళ్ళవాళ్ళ ద్వారా విన్నాడు ఆ తరువాత దీర్ఘంగా ఆలో

చించి ఒక నిర్ణయానికి వచ్చాడు. ముందు, తను పూజించే విష్ణుమూర్తి విగ్రహాన్ని జాగ్రత్తగా తీసి సుందరి తండ్రీవాళ్ళ ఇంట్లో దాచాడు. తరవాత ఇంట్లో వున్న విలువైన వస్త్రాలూ, సామాన్లూ అన్నీ పొరుగున వున్న బీద కుటుంబాలవాళ్ళకు పంచేశాడు.

సూర్యాస్తమయ కాలం కాగానే తన వద్ద నున్న విలువైన గ్రంథా లన్నిటినీ ఒక చోట గుట్టవేశాడు ఆ గుట్ట మీద ఇంత నూనె పోసి దానికి నిప్పంటించాడు. అప్పుడు లేచిన అగ్ని జ్వాలలో చరిత్రలు, పురాణాలు, కావ్యాలు, అలంకార, వ్యాకరణ శాస్త్రాలు—అన్నీ భగ్గున మండిపోయాయి మను, పరాశర, యాజ్ఞవల్క్యులు రచించిన స్మృతులూ, న్యాయ, వేదాంత, సాంఖ్య శాస్త్ర గ్రంథాలూ, ఉపనిషత్తులూ అన్నీ కాలి బూడిద అయిపోయాయి

చంద్రశేఖరుడు ప్రాణప్రదంగా చూసుకునే గ్రంథా లన్నీ యీ విధంగా కాలి మసిమసి అయిపోయే సమయానికి బాగా చీకటి పడింది అతడు ఆ బూడిద కుప్ప ముందునుంచి లేచి, ఒకే ఒక ఉత్తరీయాన్ని మాత్రం తీసుకొని, వీధిలోకి వెళ్ళిపోయాడు

## 6

కోటలోని ఉద్యానంలో దలపీబేగమ్, తన దాసీదానితో కలిసి, పెంపుడు నెమళ్ళు పురి విప్పి చేసే నాట్యాన్ని తిలకిస్తున్నది. వాటి నాట్యం మధ్యలో చెట్టుకు వేలాడుతున్న పంజరంలో నుంచి ఒక తెల్ల చిలుక, "దాసీదానా! దాసీదానా!" అంటూ అరిచింది ఆ అరుపు వింటూనే నెమళ్ళు పింఛాలు ముడిచి దూరంగా వెళ్ళిపోయినై దలపీబేగం వాటి వెంటపడి ఒకదాని తోక పట్టుకు లాగింది ఒకదాని మెడలో తన చేతి నుంచి రత్నాలు చెక్కిన గాజు తీసి వేసింది అయినా అవి తిరిగి నాట్యం చేసే ధోరణి కనబరచలేదు

''బేగం, మీ రెందుకు వృథా శ్రమ పడతారు అవి ఇక ఆడవు," అన్నది దాసీది.

''ఆడకపోతే పోనీలే, నువ్వు చెప్పదలుచుకున్న దేమిటో చెప్పు కుల్‌సమ్!" అన్నది దలపీబేగం

"అందరూ గగ్గోలు పడిపోతున్నారు బేగం ఆయుధాలు మోసుకుపోతున్న రెండు నావలు యిప్పుడు రేవులో వున్నాయి వాటిమీద ఒక ఆంగ్లేయుడున్నాడు. సేనాని గుర్గన్‌ఖాన్‌గారు వాటిని పోకుండా అటకాయించాడు. అలీ ఇబ్రహింఖాన్ గారు 'వాటిని వదలకపోతే ఆంగ్లేయులతో యుద్ధం వస్తుంది. వదల' మని సలహా యిచ్చాడు, కాని, గుర్గన్‌ఖాన్‌గారు, 'అంత యుద్ధం వస్తే రానీ, నావల్ని మాత్రం వదలను' అని తేల్చి చెప్పేశాడు," అన్నది కుల్‌సమ్.

ఇంతకీ ఆ ఆయుధాలు పోతున్న దెక్కడికి?" అని అడిగింది, దలనీ

"అవి, వాళ్ళ పాట్నా కంపెనీకి పోతున్నాయట. యుద్ధం మొదలైతే అది అక్కడే ముందు తలఎత్తుతుంది ఆ స్థావరాన్ని అంగ్లేయులు ఏ పరిస్థితుల్లోనూ వదులుకోరు," అన్నది కుల్సమ్.

"ఆ ఆయుధా లున్న నావల్ని అడ్డగించటంలో గుర్గన్ ఖాన్ అభిప్రాయమేమిటో నాకు అవగాహన కావటం లేదు," అన్నది దలనీ.

"ఏముంది? అన్ని ఆయుధాలు పాట్నాకు చేరితే ఇక అంగ్లేయులతో యుద్ధం చేసి జయించటం కష్టమంటున్నారాయన. ఇక అలీ ఇబ్రహీం ఖాన్ గారేమో 'అసలు అంగ్లేయులతో మనం పోరి జయించలేం కనక, వాళ్ళతో కయ్యం పెట్టుకోవటమే అనవసరం అలాంటప్పుడు నావల్ని అడ్డగించి యుద్ధం కొనితెచ్చుకోవటం ఎందుకు?' అంటున్నారయన ఆయన చెప్పిందే వాస్తవం అంగ్లేయుల్ని ఎవరు జయించగలరు! చూస్తూంటే, మళ్ళీ సిరాజుద్దౌలా కథే జరిగేట్టుంది," అన్నది కుల్సమ్

దలనీబేగం కాసేపు మౌనంగా వూరుకుని, తరవాత కుల్సమ్‌తో, "కుల్సమ్ నీ వో సాహస కార్యం చేయగలవా?" అని అడిగింది.

"సాహస కార్యమా! అదెంత, చేసేస్తాను,'' అంటూ కుల్సమ్ నవ్వింది

"కుల్సమ్, ఇది నవ్వేల కనేమాట కాదు ఆ సంగతి బయటపడిందో నవాబుగారు మనిద్దర్నీ ఏనుగులతో తొక్కిస్తారు," అన్నది దలనీ

"నవాబుగారికి తెలిస్తేగదా? అత్తరు, పన్నీరు, వెండి, బంగారు లెన్ని దొంగిలించానుకాను ఎవరికి తెలిసింది? మన ఆడవాళ్ళ జిత్తులు మగవాళ్ళేం కనుక్కోగలరు" అంటూ కుల్సమ్ ముసి ముసి నవ్వులు నవ్వింది.

"నోరుముయ్! ఇది హాస్యంకాదు. సేనాని గుర్గన్ ఖాన్‌గారికి ఒక వుత్తరం తీసుకుపోయి యివ్వాలి" అన్నది దలనీ

కుల్సమ్ ఆ మాటలు వింటూనే ఆశ్చర్యంతో, భయంతో కంపించిపోయింది జవాబు చెప్పేందుకు గొంతు పెగలలేదు.

"ఏమంటావ్?" అని అడిగింది దలనీబేగమ్

"ఎవరురాసిన ఉత్తరం, అది?" అని ప్రశ్నించింది కుల్సమ్.

"ఎవరిదో కాదు, నేను రాసిందే ఉత్తరంకూడా సిద్ధంగా వుంది'' అన్నది దలనీ,

"మీ క్కేమైనా మతి పోయిందా!'' అన్నది కుల్సమ్ కటువుగా.

"అంతే ఆయి వుంటుంది!'' అని దలనీ మౌనంగా తల వంచుకున్నది

కుల్సమ్ దలనీకేసి కొంచెం సేపు గుచ్చిగుచ్చి చూసి, తర్వాతఏదోనిశ్చయాని కొచ్చినదానిలా తలాడిస్తూ" ఆ వుత్తరం యిటివ్వండి నేను బానిసను మీ పను లకు అడ్డు చెప్పేందుకు నే నెవతను? ఆ వుత్తరం, కాస్త డబ్బూ యిప్పిం చండి నవాబుగారికి తెలిస్తే, యిద్దరికీ మరణం తప్పదు" అంటూ చేయి చాచింది

దలనీబేగమ్ తన దుస్తులో దాచుకున్న వుత్తరాన్ని బయిటికి తీసి, కుల్సమ్‌కు యిచ్చింది. కుల్సమ్ కూడా మాటాడ కుండా అక్కణ్ణించి వెళ్ళిపోయింది ఈ ఉత్తరం ద్వారానే విధి దలనీ, శైవలినీల అదృష్ట దురదృష్టాలను ఒకటిగా ముడి వేశాడు

* * *

గుర్గన్‌ఖాన్ ఆర్మీనియా దేశస్తుడు అతడు భారతదేశం వచ్చిన కొత్తలో, వస్త్రాలమూట నెత్తిన పెట్టుకుని ఊళ్ళు తిరిగి అమ్ముకుంటూండేవా డని చెపు తారు కాని, ఒకసారి నవాబు మీర్‌కాసిం కొలువులో ప్రవేశించిన తరవాత, తారా జువ్వలా ఒక్కవూపున సర్వసేనాని పదవికి వెళ్ళిపోయాడు అందు క్కారణం, అతడు అత్యంత సమర్థుడు, ప్రతి భావంతుడు

సేనానాయకత్వం రాగానే గుర్గన్ ఖాన్, సైనికులకు యూరోపియన్ పద్ధ తిలో తరిఫీదు ఇప్పించటమేగాక, బల మైన తుపాకీ దళాలను కూడా కొన్ని టిని తయారు చేయించాడు అతడి సహా యంతో ఆంగ్లేయుల్ని తన రాజ్యంనుంచి తరిమివేయ గల ననే ధైర్యం మీర్ కాసిమ్‌కు కలిగింది. గుర్గన్‌ఖాన్ సలహా లేకుండా అత డే ముఖ్యకార్యం చేసే వాడుకాడు.

అది రాత్రి రెండవజాము గుర్గన్ ఖాన్ తన గదిలో కూచుని దీపం వెలు గులో కుప్పగా పడివున్న వుత్తరాల్లో ఒకటొకటి తీసి, చదివి పక్కన పెడు తున్నాడు ఇలా కొంతసేపు జరిగిన తరవాత, అతడు వుత్తరాలను పక్కకు నెట్టి కాపలా సైనికుడ్ని కేకవేసి, "భవ నం తలుపు లన్నీ తెరచే వున్నాయా?" అని ప్రశ్నించాడు.

"చిత్తం" అన్నాడు సైనికుడు.

"ఈ రాత్రి నా దగ్గరకు వచ్చేవాళ్ళ నెవర్నీ అటకాయించవద్దు. ఎవరు మీరు? అని కూడా ప్రశ్నించవద్దు, తెలి సిందా? పోయి యీ సంగతి కాపలావా ళ్ళందరికీ చెప్పు." అని ఆజ్ఞాపించాడు గుర్గన్‌ఖాన్

సైనికుడు వెళ్ళిపోయాడు గుర్గన్ ఖాన్ ఆసనానికి చేరగిలపడి ఆలోచనల్లో మునిగిపోయాడు నే నిప్పు డేపద్ధతి నవ లంభించటం ఉత్తమం? అన్న ఆలోచన

కలిగిం దతడికి. ప్రస్తుతం భారత దేశం ఒక మహా సముద్రంలా వుంది సాహసించి ఎవ డెంత మునిగి దమ్ముపట్ట గలిగితే, అన్ని విలువైన రత్నాలు తెచ్చుకో గలడు గట్టున కూచుని అలలు లెక్కిస్తూంటే కలిగే ప్రయోజన మేముంది? ఇప్పుడు ఈ బెంగాలు, బీహారు, ఒరిస్సాలకు పేరుకు నవాబు కాశిం అయినా, నిజమైన ప్రభువులు ఆంగ్లేయులు అంటే నేను బానిసకు బానిస నన్నమాట! నేను తలుచుకుంటే యీ మీర్ కాశింను గద్దె నుంచి దించగలను. కాని, అప్పుడు నా గద్దెకు యీ ఆంగ్లేయులు తప్పక ముప్పు తెస్తారు అందువల్ల ముందు కాశింకు సహాయం చేసి, ఆంగ్లేయుల్ని రాజ్యం నుంచి తరిమి, ఆ తరవాత అతణ్ణి గద్దె దించాలి ఇప్పుడు నేను చేయవలసింది, ఏదో విధంగా ఆంగ్లేయులతో యుద్ధం పొసిగేలా చూడటం...ఈ పిల్ల ఉత్తరం రాసేంత సాహసం ఎందుకు చేసింది? ఇంత అపాయకరమైన......

గుర్గన్ ఖాన్ యీ విధంగా ఎవర్ని గురించయితే ఆలోచిస్తున్నాడో, ఆమె హఠాత్తుగా అతడి ముందు ప్రత్యక్షమైంది. అతడు ఆమెకు ఎదురుగా ఒక ఆసనం చూపించాడు ఆమె కూచున్నది, ఆమె దలనీ బేగం.

"నువ్వు నవాబుగారి జనానాలో ప్రవేసించిన తరవాత, యిదే చూడటం. ఇంత ప్రమాదకరమైన పనికి ఎందుకు పూనుకున్నావ్? ఈ సంగతి నవాబు గారికి తెలిస్తే, ఇద్దరి ప్రాణాలూ దక్కవు" అన్నాడు గుర్గన్ ఖాన్

అంత మనిద్దరి ప్రాణాలూ పోయేస్థితే వస్తే, మనయిద్దరి సంబంధాన్ని గురించి ఆయనతో చెప్పేస్తాను,'' అన్నది దలనీ తొణకకుండా

"గొంతు మీదికి వచ్చిం తరవాత చెపితే, ఆ మాట ఎవరు నమ్మతారు? సరే, యింతకూ వచ్చిన పనేమిటి?'' అని ప్రశ్నించాడు గుర్గన్ ఖాన్.

''పని ముఖ్యమైందే మీరు ఆంగ్లేయుల్ని యుద్ధానికి రెచ్చకొడుతున్నారట ఆ మాటలు నిజమేనా?" అన్నది దలనీ

"నిజమే అనుకుందాం వాళ్ళతో యుద్ధం జరిగితే నీకూ, నాకూ వచ్చే నష్టమేముంది?'' అన్నాడు గుర్గన్ ఖాన్

''వాళ్ళతో యుద్ధం చేసి జయించగలమనుకుంటున్నారా?"

''జయిస్తా ననే నమ్మకం ''

''ఆంగ్లేయుల్ని యింతవరకూ ఎవరైనా జయించారా?'' అన్నది దలనీ కటువుగా

'వాళ్ళు, యీనాటి వరకూ గుర్గన్ ఖాన్ లాంటి వారితో యుద్ధం చేశారా?'' అని ప్రశ్నించాడు గుర్గన్ ఖాన్, పౌరుషం పుట్టిపడుతున్న స్వరంతో

''సిరాజుద్దౌలా కూడా యిలాగే అనుకున్నాడు ఆంగ్లేయుల్తో యుద్ధం పెట్టుకో వద్దని ప్రార్థించటానికే యిక్కడి

కొచ్చాను" అన్నది దలనీ వణకుతున్న గొంతుకతో

"ఎందు కంత విచారిస్తున్నావు?'' ఒక వేళ యుద్ధంలో మీర్ కాశిం పదచ్యుతు డై తే నిన్ను నా వెంట తీసుకు పోతాను" అన్నాడు గుర్గన్ ఖాన్.

ఆ మాటతో దలనీ తోక తొక్కిన తాచులా లేచింది. ఆమె నేత్రాల్లో క్రోధాగ్ని ప్రజ్వరిల్లింది ''మీర్ కాశిం. నా భర్త అన్న సంగతి మర్చి పో తున్నావా?'' అంటూ ఆసనంమీంచి లేచి నిలబడింది "నువ్వు సర్వనాశనం అయి పోవాలి ఏ విషమ ఘడియనో, నేను నీకు చెల్లెలుగా జన్మించాను. ఏ దుర్ముహూర్తానో, నీకు సహాయం చేస్తానని వాగ్దానం చేశాను ఆంగ్లేయుల్తో యుద్ధప్రయత్నం మానావా సరేసరి, లేకపోతే మనిద్దరికీ శత్రుత్వమే. ఈనాటి నుంచీ మనం సోదరీ సోదరులంకాదు," అంటూ దలనీ దివ్వున బయటికి వెళ్ళి పోయింది

దలనీబేగం పోయినదిక్కు కేసి గుర్గన్ ఖాన్ ఒక క్షణంసేపు చూసి తల పంకిస్తూ, "ఈమెకు నామీద అన్న అనే గౌరవంగాని, ప్రేమగాని లేదు ఆమెకు సర్వం భర్త మీర్ కాశిమే'' అంటూ పళ్ళు కొరికి, సైనికు నొకణ్ణి పిలిచాడు వాడు రాగానే, "ఇప్పు డొచ్చిన స్త్రీని, కోటలోకి వెళ్ళనీయవద్దు" అని చెప్పాడు

దలనీబేగం, కుల్ సమ్ తోడు రాగా కోటద్వారం దగ్గరకు వెళ్ళింది అక్కడ కాపలా వున్న సైనికులు, వాళ్ళను లోప లకు వెళ్ళటానికి వీలులేదని అటకాయిం చారు దలనీ కన్నీరు కారుస్తూ, ఉన్న చోటనే కూలబడి, "నా సోదరుడే నాకు నిలవ నీడ కూడా లేకుండా చేశాడు," అని ఏడ్వసాగింది

గుర్గన్ ఖాన్, దలనీల మధ్య జరిగిన సంభాషణ వినివుండని కుల్ సమ్, "పద బేగం, ఆ సేనాని గుర్గన్ ఖాన్ దగ్గరకే వెడదాం," అన్నది అమాయకంగా

"ఇహ వెళ్ళేందుకు నా కెక్కడా ఆశ్రయంలేదు ఆ గంగానదే నాకు చోటివ్వాలి," అన్నది దలనీ

దలనీ, కుల్ సమ్ లు రాజమార్గం వెంటపడి నదికేసి నడవసాగారు. కటిక చీకటి ఆకాశంలో నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి కొంత దూరం వెళ్ళిన తరవాత దలనీ వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ, "కుల్ సమ్!'' అని పిలిచి, నీరసంగా ఆమె చేతుల్లోకి ఒరిగి పోయింది

కుల్ సమ్ తన యజమానురాలికి ధైర్యం చెపుతూ, "బేగం, మీ రిలా శోకించి లాభంలేదు కర్తవ్యం ఆలో చించండి" అన్నది.

"ఆలోచించేందు కేముంది? అదిగో, ఆ కనబడే పెద్దమర్రి చెట్టు చూశావా,

దాని కిందకు వెళ్ళి కూచుందాం.' అన్నది దలనీ

''మర్రిచెట్టుకింద ఎంత సేపని వుండగలం? తెల్లవారగానే మనను నలుగురూ చూస్తారు. పట్టుబడిపోతాం." అన్నది కుల్సమ్

వారలా మాట్లాడుకుంటూండగా ఒక ఆజానుబాహుడు పెద్ద పెద్ద అంగలు వేసి నడుస్తూ, అటుగా రావటం వాళ్ళకు కనిపించింది. ఇద్దరూ మర్రిచెట్టుకింది చీకట్లోకి పరిగెత్తి, చెట్టు వెనక నక్కారు. ఆజానుబాహుడు సరిగా ఆ మర్రికిందికే వచ్చి, "ఎవరక్కడ" అని ప్రశ్నించాడు

ఆ ప్రశ్న వేసిన కంఠస్వరంలో కటుత్వం ఏమీలేదు ఎంతో మధురంగా, దయా దాక్షిణ్యాలు వుట్టిపడుతూన్నట్టున్నదా స్వరం దానితో ఇద్దరికీ కొంచెం ధైర్యం కలిగింది

"మేము స్త్రీలము తమ రెవరు?" అని ప్రశ్నించింది, కుల్సమ్.

"నేనా? సరే, ఆ సంగతి తరవాత చెపుతాను ఇంత రాత్రివేళ మీ రిక్కడేం చేస్తున్నారు?" అని అడిగాడా ఆజానుబాహువు

''మేము నిర్భాగ్యులం, కష్టాల్లో చిక్కుకున్నవాళ్ళం'' అన్నది దలనీ

"నే నొక బీద బ్రహ్మచారిని మీరు కష్టాల్లో వుంటే, నా చేతనైన సహాయం చెయ్యగలను'' అన్నాడు ఆజానుబాహువు

"అయ్యా, మీ మాటల్లో మాకు నమ్మకం కలిగింది కాని, మా కష్టగాథ యిక్కడ ఎలా చెప్పగలం? ఈ చీకట్లో ఎవరు ఎక్కడ దాగుండి వింటారో చెప్పలేంగదా!'' అన్నది దలనీ

''అలా అయితే, నా వెంట రండి!" అంటూ బ్రహ్మచారి కదిలాడు. దలనీ బేగం, కుల్సమ్ అతణ్ణి అనుసరించి నగరంలోకి బయలుదేరారు

బ్రహ్మచారి ఆ ఇద్దరు స్త్రీలనూ వెంటబెట్టుకుని నగరంలోకి వెళ్ళి ఒకానొక ఇంటిముందాగి, తలుపు తట్టుతూ, "రాంచరణ్!" అని కేకపెట్టాడు.

ఆ కేక వింటూనే, లోపల కునికిపాట్లు పడుతున్న నౌకరు ఎగిరి గంతేసి వచ్చి తలుపు తెరచి, బ్రహ్మచారినీ, స్త్రీలనూ చూచి పక్కకు తప్పుకున్నాడు.

బ్రహ్మచారి పై అంతస్థుకు పోయే మెట్లకు పక్కగా వున్న ఒక గదితలుపు తెరిచి, దీపం వెలిగించి, ఒక ఆసనం మీద కూచున్నాడు దలనీ, కుల్సమ్‌లు అతడికి ఎదురుగా తివాసీమీద కూచున్నారు

"ఇక యిప్పుడు చెప్పండి, మీ కొచ్చిన ఆపద ఏమిటి?" అని అడిగాడు బ్రహ్మచారి దలనీబేగం తనెవరైందీ అతడికి చెప్పి, తరవాత ఆ రాత్రి జరిగిన సంఘటనలన్నీ అతడికి వివరించి,

"నవాబుగారికి తెలియకుండా జనానా వదిలి వచ్చాను ఇప్పుడు ఆయనకు తెలియకుండా జనానాలో ప్రవేశించే మార్గం లేదు," అన్నది నిస్పృహగా

"జరిగిన దంతా ఉత్తరంద్వారా ఆయనకు తెలియపరచండి నిజంగా మిమ్మల్ని ప్రేమించుతున్నవా డయితే, మీ మాటలను విశ్వశిస్తాడు ఉత్తరం రాయండి. నేను అది నవాబుగారికి చేరేలా చూస్తాను'' అన్నాడు బ్రహ్మచారి

దలనీ ఉత్తరం రాసి, బ్రహ్మచారి చేతి కిచ్చింది బ్రహ్మచారి ఆ ఉత్తరం తీసుకుని బయటికి పోతూ, రామచరణుడికి, ఆ స్త్రీలు రాత్రికి అక్కడే ఉంటారని తెలియపరిచాడు.

బ్రహ్మచారికి ముంగేరు కోటలో చాలా గౌరవం, పలుకుబడీ వున్నది అక్కడ వున్న హిందూ వుద్యోగు లంతా అతనంటే ఎంతో భక్తిభావం కనబరచేవారు వారిలో ఉద్యోగరీత్యా పెద్దస్థానములో వున్నవాడు, మున్షీ రాయగోవిందరాయ్

బ్రహ్మచారి కోటకు వెళ్ళి మున్షీని కలుసుకుని ఉత్తరం యిచ్చాడు మున్షీ అది తీసుకుని, ''నవాబుగారిని ఇప్పుడు నిద్రలేపటం భావ్యంగా వుండదు జవాబుకు ఉదయం రండి,'' అని చెప్పాడు.

## 7

శైవలినిని ప్రేమించి ఆమెచేత మోసగించబడిన ప్రతాపుడు, ఈనాడు అన్నివిధాలా చాలా ఉచ్ఛస్థితిలో వున్నాడు బ్రహ్మచారి ముంగేరులో దలనీబేగమ్, కుల్‌సమ్‌ల నుంచిన భవనం అతడిదే ఆ స్త్రీ లిద్దరూ ఆ గృహంలో ప్రవేశించినప్పుడు అతడు దాని వెనుక భాగంలో వున్న ఒక గదిలో నిద్రిస్తున్నాడు

ప్రతాపుడు, ప్రతాపరాయ్‌గా రాజ్యంలో చాలా ప్రసిద్ధుడు అతడికి పెద్ద జమీ ఒకటున్నది అంతులేని నౌకర్లూ చాకర్లూ వున్నారు అతడి యీ సంపద కంతా కారణం చంద్రశేఖరుడు

చంద్రశేఖరుడు శైవలినిని వివాహమైన తరవాత, గంగానదిలో మునిగిపోకుండా తాను రక్షించిన ప్రతాపుణ్ణి చాలాసార్లు చూశాడు ఆ యువకుడిలోని వినయ విధేయతలూ, పట్టుదలా, ఆత్మగౌరవం అతణ్ణి బాగా ఆకర్షించాయి. ఆ కారణంగా అతడు సుందరి తండ్రి అయిన కృష్ణకమల చక్రవర్తితో మాట్లాడి, అతడి చిన్న కూతురు రూపసిని, ప్రతాపుడి కిచ్చి వివాహం చేయించాడు ఆ తరవాత చంద్రశేఖరుడు, ఆ పరగణాకు పరిపాలకుడైన కరీమ్ ఆలీఖాన్‌తో మాట్లాడి, ప్రతాపుడికి ప్రభుత్వోద్యోగం యిప్పించాడు

పదీ పన్నెండు సంవత్సరాల ఉద్యోగ కాలంలో ప్రతాపుడు సమర్ధుడూ, విశ్వాసపాత్రుడూ అన్న పేరు తెచ్చుకుని, చిన్న జమీందారీ సంపాయించటమే గాక,

ముంగేరులో కొన్ని భవనాలు కూడా కొనుక్కున్నాడు

వైవాహిక బాంధవ్యం ద్వారా ప్రతాపుడు సుందరికి మరిది సుందరి పడవలో శైవలినిని నానా శాపనార్థాలూ పెట్టి ఇంటికి తిరిగి వచ్చిన తరవాత, చంద్రశేఖరుడు స్వగ్రామం రావటం, తరవాత దేశాలు పట్టిపోవటం జరిగింది శైవలిని కారణంగా చంద్రశేఖరుడు కష్టాలపాలవ్వటం సుందరికి చాలా బాధ కలిగించింది చంద్రశేఖరుడు ఎక్కడ వున్నదీ తెలుసుకుని, అతణ్ణి తిరిగి తన స్వగ్రామం చేర్చగల శక్తి ఒక్క ప్రతాపుడికే వున్నదని ఆమె వూహించింది

సుందరి ఒక నాటి ఉదయం పల్లకీలో బయలుదేరి ప్రతాపుడుండే గ్రామం చేరి అతడికీ, తన చెల్లెలు రూపసికీ, తమ గ్రామంలో జరిగిన సంఘటనలన్నీ వివరించింది చంద్రశేఖరుడు సర్వసంగపరిత్యాగియై ఎక్కడికో వెళ్లాడని విని ప్రతాపుడు చాలా విచారించాడు జీవితంలో తను పైకి రావటానికి చంద్రశేఖరుడు చేసిన సహాయమే కారణం

ప్రతాపుడు ఆ పగలల్లా తన గదిలో ఒంటరిగా కూచుని, దీర్ఘంగా ఆలోచించి ఒక దృఢ నిశ్చయానికి వచ్చాడు ఏది ఏమైనా, ఎన్ని కష్టాలు కలిగినా తను చంద్రశేఖర శైవలినీల జాడలు తెలుసుకుని వాళ్ళను చాతనైతే రక్షించాలి

ఈ నిశ్చయానికి వచ్చిన మర్నాడు ప్రతాపుడు, ఒక వంటవాణ్ణి రామచరణుడనే ఒక నౌకర్ను వెంట తీసుకుని ముంగేరుకు బయలుదేరాడు ప్రయాణమైె వెళ్లేముందు రూపసికి మాత్రం సంగతిసందర్భాలు చెప్పాడు చంద్రశేఖరుడూ, శైవలినీ ఎక్కడ వున్నారో తెలుసుకోకుండా తాను ఇంటికి తిరిగిరానన్నాడు

రెండు రోజుల తరవాత ప్రతాపుడు ముంగేరు చేరాడు మూడవనాటి రాత్రి బ్రహ్మచారి దలనీ, కుల్‌సమ్‌లను ప్రతాపుడి గృహానికే తెచ్చి ఆశ్రయం కల్పించాడు. తన గదిలో గాఢనిద్రలో వున్న ప్రతాపుడికి యివేమీ తెలియవు

## 8

గంగానది నిండుగా, నిశ్శబ్దంగా ప్రవహిస్తున్నది. రాత్రి మూడవజాముకాలం ఆకాశంలో మినుకు మినుకు మనే చుక్కలుతప్ప - అంతా కటిక చీకటి ముంగేరు రేవులో సేనాని గుర్గన్‌ఖాన్‌చే అటకాయించ బడిన ఇంగ్లీషువాళ్ళ ఆయుధాల నౌకమీద, నవాబుగారి సైనికులు కాపలా కాస్తున్నారు దానికి కొద్ది దూరంలోనే లారెన్స్‌ఫాస్టర్, శైవలినీలు వున్న చిన్న పడవ నీటిమీద తేలియాడుతున్నది పడవమీద తెలంగా అనే సైనికు డొకడు పహరా తిరుగుతున్నాడు.

. ఉన్నట్టుండి నదికి దాపున మున్న అడవిలో చిన్న వెలుగు కనుపించింది తెలంగా సైనికుడు అటుకేసి చూసి, భుజం మీది తుపాకిని సరిచేసుకుంటూ, 'ఎవ రబ్బా, వేళకాని ఈ వేళ, అక్కడ మంట చేస్తున్నది,' అనుకున్నాడు ఆశ్చ ర్యంగా అంతలోధన్ మంటూ తుపాకీ మ్రోగిన శబ్ద మయింది తెలంగా సైని కుడు అబ్బా అంటూ అరిచి, తుపాకీని పడవమీద జారవిడిచి, దభీ మంటూ నదిలో పడిపోయాడు.

తుపాకీ మోతా, సైనికుడి కేకా విన్న లారెన్స్‌ఫాస్టర్ పడవలోని తన గది నుంచి తుపాకీ తీసుకుని, పడవపైకి వచ్చాడు అదే సమయంలో ప్రతాపుడు నిశ్శబ్దంగా నీళ్ళలో దిగి యీదుకుంటూ ఆ పడవను సమీపించాడు

ఫాస్టర్ దృష్టి ముందుగా అడవికేసి పోయింది అక్కడ కనబడిన చిన్న వెలుగును చూసి, తన సైనికుడ్ని చంపిన వాడు, అక్కడినుంచే తుపాకీ కాల్చాడని అతడు గ్రహించాడు అతడికి పట్టరాని కోపం వచ్చింది ఫాస్టర్ ప్లాసీయుద్ధం తరవాతే భారతదేశానికి వచ్చాడు ఆంగ్లే యుణ్ణి ఏ భారతీయుడైనాసరే చంపగల డన్న అనుమానంగాని, భయంగాని అతడికి లేదు

ఫాస్టర్ తుపాకీ ఎత్తి అడవిలో కని పించిన వెలుగుకేసి గురిపెట్టాడు. ఆ వెంటనే అటునుంచి తుపాకి మోగింది. గుండు ఫాస్టర్ తలకు తగిలింది. అతడి చేతిలోనుంచి తుపాకీ జారిపోయింది. అతడి దేహం గంగానదిలో పడి మును గుతూ తేలుతూ ప్రవాహం వెంట కొట్టుకుపోయింది

ప్రతాపుడు ఒక్క ఎగురున పడవ మీదికి పోయి, ఒడ్డున వున్న మేకులకు కట్టివున్న దాని తాళ్ళను కత్తితో నరికి వేశాడు ఆ తరవాత కిందపడివున్న రెండు తుపాకులనూ చేతికి తీసుకుని, అప్పుడే నిద్రమత్తు వదుల్చుకొని పడవ మీదికి వస్తున్న కళాసులతో, "మీలో ఎవరైనాసరే నన్ను ఎదిరించ చూశారో చంపేస్తాను। ˆ లా కాక నేను చెప్పినట్టు చేస్తే, మీ కెలాంటి ప్రాణభయమూలేదు. నేను చుక్కాని దగ్గరకు పోతున్నాను. మీరు తెడ్లు వేసి పడవ నడపండి !" అన్నాడు

ప్రతాపుడి కంఠస్వరం అతడి ఆజాను బాహు విగ్రహం, చేతుల్లో వున్న తుపా కులూ కళాసులకు భీతి కలిగించినై. వాళ్లు కిక్కురుమనకుండా తెడ్లు తీసుకుని, పడవను నడపసాగారు.

ఈ జరిగిన సంఘటనంతా క్షణాలమీద జరిగిపోయింది ఆయుధా లున్న నావను కాపలా కాస్తున్న సైనికులు, ఆ చీకట్లో ఏం జరిగిందో గమనించి, ప్రతాపు డున్న పడవను వెంబడించే ప్రయత్నం చేశారు. కాని, ప్రతాపుడు ఒకటి రెండుసార్లు

తుపాకీ పేల్చగానే, ఆ ప్రయత్నం మాని వెనుదిరిగిపోయారు

అరగంట తరవాత పడవ ఒక చిన్న రేవు చేరింది. పడవ ఒడ్డును తాకేసరికి అక్కడ లారీలూ, కాగడాలూ పట్టుకున్న కొందరు భటులు కనిపించారు వాళ్ళలో నుంచి ప్రతాపుడి నౌకరు రామచరణుడు ముందుకు వచ్చి పడవ ఎక్కాడు ప్రతాపుడు అతడితో రహస్యంగా ఏమో చెప్పి పడవ దిగిపోయాడు

రామచరణుడు, శైవలిని వున్న గది చేరేసరికి, ఆమె తన దాసీ అయిన పార్వతిని, పడవమీద జరిగిన కాల్పులను గురించి ప్రశ్నిస్తున్నది.

"ఎవరో బందిపోట్లు పడవను వశ పరచుకున్న ట్టుంది. దొరగారు చచ్చి పోయారు. వా ళ్ళిక మనను దోచు కుంటారు,'' అన్నది పార్వతి.

ఆ మాటలకు శైవలిని వికటంగా నవ్వుతూ, ''తెల్లదొంగ చేతుల్లోనుంచి, నల్లదొంగ చేతుల్లోకి వెళతానన్నమాట! ఇందులో భయపడవలసిం దేముందిలే," అన్నది

అంతలో రామచరణుడు అక్కడికి వచ్చాడు అతణ్ణి చూస్తూనే శైవలిని కొంచెంగా భయపడి ''మీ రెవరు?'' అని ప్రశ్నించింది

"మీ రేమీ భయపడకండి, నేను మీ సేవకుణ్ణి. ఆ దుర్మార్గుడు – దొర చచ్చి పోయాడు ఒడ్డున పల్లకీ సిద్ధంగా వుంది లేచిరండి!" అన్నాడు రామచరణుడు వినయంగా

శైవలిని మారుమాటాడకుండా గదిలో నుంచి బయిటికి వచ్చి పడవ దిగింది. ఆమెను వెన్నంటి వస్తున్న దాసీ పార్వతిని, రామచరణుడు పడవ దిగబోయే సమయంలో అటకాయించి, నువ్వెక్కడికి? పడవలోకి పో!'' అన్నాడు కోపంగా పార్వతి కిక్కురుమనకుండా పడవలోకి వెళ్ళిపోయింది.

శైవలిని ఎక్కిన పల్లకీని బోయీలు ముంగేరులోని ప్రతాపుడి ఇంటికి చేర్చారు కింద గదిలో నిద్రపోతున్న దలనీబేగమ్, కుల్‌సమ్‌లకు నిద్రాభంగం కలగకుండా రామచరణుడు శైవలినిని మేడమీది గదిలోకి తీసుకుపోయి," ఇక మీరు విశ్రాంతి తీసుకోండి," అంటూ గది తలుపులు మూసి వెళ్ళిపోయాడు. "ఈ ఇల్లు ఎవరిది?" అంటూ శైవలిని వేసిన ప్రశ్న అతడు వినిపించుకోలేదు

పావుగంట తరవాత ప్రతాపుడు తుపాకీ భుజాన పెట్టుకుని ఇంటికి వచ్చాడు రామచరణుడు తన యజమానికి తలుపు తీసి, శైవలినిని అక్కడికి చేర్చినట్టు చెప్పాడు ఆసంగతి వింటూనే ప్రతాపుడు కోపంతో, "ఆమెను ఇక్కడి కెందుకు తెచ్చావ్? జగత్ సేఠ్ ఇంటిగ్గా తీసుకుపొమ్మన్నది!" అంటూ కళిరాడు

"ఇంత రాత్రివేళ ఆయన ఇంటికి పోయి, తలుపులు కొట్టి లేపితే, నలుగురికీ రహస్యం తెలిసిపోతుందని, ఇక్కడికే పల్లకీ మోయించుకు వచ్చాను." అన్నాడు రామచరణుడు కంపించిపోతూ.

ఇక యిప్పుడు జరిగినదానికి విచారించి లాభం లేదని నిశ్చయించుకున్న ప్రతాపుడు మెట్లెక్కి మేడమీది గదికి వెళ్ళి, దగ్గరకు వేసివున్న గదితలుపులను మెల్లిగా నెట్టాడు. ఆ సమయంలో అతడి చేతిలోవున్న తుపాకీ మడం దర్వాజాకు కొట్టుకుని పెద్దశబ్దం చేసింది.

ఆ శబ్దం వింటూనే శైవలిని మంచం మీద లేచికూచుని, "ఎవరది? ప్రతాపా?" అని ప్రశ్నించింది, ఆశ్చర్యం, భయం, కుతూహలం ముప్పిరి గొన్న గొంతుతో.

"అవును, నేను ప్రతాపునే!" అన్నాడు ప్రతాపుడు

"నన్నిక్కడికి ఎందుకు తీసుకు వచ్చారు? యిలా తీసుకు రావటంలో నీ ఉద్దేశ్య మేమిటి?'' అన్నది శైవలిని కటువుగా,

ఆమె కటుస్వరం వింటూనే ప్రతాపుడి ముఖం కోపంతో ఎర్రబడింది. అతడు కాలితో నేలను గట్టిగా తాటించి, "నీవంటి పాపాత్మురాలి ముఖం చూడ గోరి నిన్నిక్కడి కేం తీసుకురాలేదు నిన్ను మ్లేచ్ఛుడి చెరనుంచి విడిపించా ననుకున్నాను. ఇప్పుడు పొరబడ్డా నని గ్రహిస్తున్నాను," అన్నాడు.

ప్రతాపుడి దూషణ వాక్యాలకు శైవలిని వణికిపోతూ, "నే నంత పాపాత్మురాలినా? మ్లేచ్ఛుడి నిర్బంధంలో వున్నంత మాత్రానే అపవిత్రురాలి నైపోయానా? అలా భావించివుంటే, నువ్వక్కడే నన్నెందుకు చంపివేయలేదు?" అని ప్రశ్నించింది, పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

"ఆ పని చేసేవాడినే, స్త్రీ హత్యా దోషం అంటుతుం దని వూరుకున్నాను. కాని, నువ్వు చావటం మంచిది!" అన్నాడు ప్రతాపుడు యీసడిస్తున్నట్టు.

శైవలినికి యిక దుఃఖం ఆగలేదు. ఆమె ఏడుస్తూ, "నేను చావటం మంచిదే లోకం నన్ను కసికొందికి ఏమైనా నిందించవచ్చు. నువ్వు మాత్రం నిందించకు. నాకీ దుర్దశ ఎవరివల్ల కలిగిందో తెలుసా? నీ వల్లనే. నా యౌవ్వనారంభదశలో నా హృదయంలో ప్రేమజ్యోతిని వెలిగించావు కాని, నా బలహీనతవల్ల నిన్ను పొందలేక పోయాను. అయినా, నీ రూపాన్ని హృదయంలో నుంచి తొలగించుటం నాకు సాధ్యం కాలేదు నీతో సంబంధాలు తెగిపోయిం తరవాత, నిన్నెప్పటి కైనా పొందగల ననే ఆశతోనే, నేను గృహత్యాగం చేశాను అంతే గాని, ఆ ఫాస్టరు

సీచుడితో నా కున్న సంబంధం ఏమిటి?" అన్నది.

—శైవలిని మాటలు ప్రతాపుణ్ణి శూలాల్లా తాకినై అతడిక ఆమె ఎదట నిలబడలేక పోయాడు అతడు గిరుక్కున వెనుదిరిగి తన గదిలోకి వెళ్ళిపోయాడు అంతలో ఇంటిముందు ఏదో రణగొణధ్వని ప్రారంభమైంది. ఎవరో తలుపు కొడుతున్నారు

రామచరణుడు తలుపు దగ్గిరకు వచ్చి, గడి తీయబోయినవాడల్లా ఆగి బయట జరుగుతున్న సంభాషణ ఆలకించాడు ఇద్దరు, ఇంగ్లీషులో మాట్లాడుకుంటున్నారు రామచరణుడు వెంటనే ప్రమాదం శంకించి, అక్కడే కదలా మెదలక నిలబడ్డాడు

ఆ ఇంగ్లీషు మాట్లాడుకుంటున్న వాళ్ళు, గ్లాస్టన్, జాన్‌సన్ అనే యిద్దరు ఆంగ్లేయ సైనికులు వారి వెంట పది మంది దేశీయ సైనికులున్నారు. వారంతా, ముంగేరులో కంపెనీ ప్రతినిధిగా వున్న అమిటమ్‌దొర పంపగా, ప్రతాపుణ్ణి బంధించి తీసుకుపోయేందుకు వచ్చినవాళ్లు రేవులో వున్న ఫాస్టర్ నౌకమీద జరిగిన దాడీ, అతను గాయపడి గంగానదిలో పడిపోవటం, అతడు తెచ్చిన స్త్రీ అపహరింపబడటం — అంతా అమిటమ్, దాడి జరిగినప్పుడు పడవలో వున్న బకాఉల్లా అనే సైనికుడి ద్వారా తెలుసుకున్నాడు

బకాఉల్లా, శైవలిని ఎక్కిన పల్లకి వెనకనే పోయి, ఆమె ప్రతాపుడి ఇంట ప్రవేశించటం చూశాడు ఆ కారణంగా, ఎక్కువ శ్రమ లేకుండానే గ్లాస్టన్, జాన్‌సన్‌లు ఆ ఇంటి దగ్గిరకు వచ్చి, వీధి తలుపులను లాఠీలతో మోదుతున్నారు

ఇప్పుడు ఏమిటి కర్తవ్యమా అని రామచరణుడు ఆలోచిస్తున్నంతలో తలుపు ఫెళఫెళ మంటూ విరిగి పక్కకు పడిపోయింది. రామచరణుడు తన యజమాని వున్న గదికి వెళ్లేందుకు, మెట్లెక్కి పరిగెత్తబోయేంతలో గ్లాస్టన్ పిస్టల్‌తో గురిచూసి అతడి కాలికేసి కాల్చాడు కాలిమడమకు గుండు తగలటంతో రామచరణుడు మెట్లమీద చతికిలబడ్డాడు అంతలో ప్రతాపుడు, "ఏమిటీ గోల?" అంటూ అక్కడికి వచ్చాడు.

ఆంగ్లేయుల వెంట వున్న ఒక సైనికుడు కాగడా వెలిగించాడు ఆ కాంతిలో బకాఉల్లా ప్రతాపుణ్ణి చూసి, "అతడే బందిపోటు నాయకుడు!" అంటూ ఆంగ్ల సైనికులకు చెప్పాడు ప్రతాపుడు గదిలో వున్న తన తుపాకీ కోసం వెనుదిరిగేంతలో జాన్‌సన్ పులిలా ఒక్క ఎగురున మెట్లమీదికి పోయి, ప్రతాపుడి చెయ్యి పట్టుకున్నాడు ఈ సమయంలో ప్రతిఘటనవల్ల ప్రయోజనం లేదని ప్రతాపుడు గ్రహించాడు ఒక దేశీ సైనికుడు అతడి చేతులకు సంకెళ్ళు తగిలించాడు

[illegible] ఎవరూ దొరికారు. ఇక పదండి!'' అంటూ గ్లాస్టన్ వీధిలోకి బయలుదేరాడు. గాయపడిన రామచరణుణ్ణి ముగ్గురు సైనికులు చాపచుట్టలా భుజాన వేసుకున్నారు. అందరూ బయిటికి పోబోతున్నంతలో కొవ్వత్తి వెలుగు దలనీబేగమ్, కుల్‌సమ్‌ల మీద పడింది వాళ్ళు తమ గది తలుపు ఓరగా తెరిచి, ఈ జరుగుతున్న గలభా చూస్తున్నారు

"అదుగో, పాస్టరుగారి భార్య!'' అన్నాడు బకాఉల్లా దలనీని చూపుతూ. జాన్‌సన్ వెనుదిరిగి, ఆ గదిదగ్గరకు వచ్చి "మీ రిద్దరూ కిక్కురుమనకుండా మా వెంట రండి'' అని ఆజ్ఞాపించాడు. దలనీ, కుల్‌సమ్‌లు మారుమాటాడకుండా వాళ్ళవెంట బయలుదేరారు.

ఇప్పుడు ఆ పెద్ద గృహంలో శైవలిని ఒక్కతే ఒంటరిగా వున్నది. ఆమె కూడా జరిగినదంతా గమనించింది. తన కారణంగా ప్రతాపుడు చిక్కుల్లో పడిపోయాడని తెలిసి, ఆమెకు దుఃఖం ఆగలేదు తనకు చావాలని వున్నది, కాని, ఆత్మహత్య చేసుకునే గుండె బలం లేదు

తను పాపాత్మురాలు ప్రేమించిన పతాపుడికీ, చేసుకున్న భర్తకూ కూడా తీరని అపచారం కలిగించింది. ఒక మ్లేచ్ఛుడి వెంటబడి పోవటం ద్వారా తీరని కళంకం తెచ్చుతున్నది.

శైవలిని యిలాంటి ఆలోచనలతో, వ్యాకులమైన మనస్సుతో కన్నుమూసింది. అంతా కలతనిద్ర పీడకలలు తెల్లవారి బాగా పొద్దెక్కిన తరవాత, తెరచివున్న కిటికీగుండా సూర్యకిరణాలు ముఖంమీద పడటంతో ఆమె చెప్పున కళ్ళు తెరిచింది. వెంటనే భయ విస్మయాలతో కొయ్యబారిపోయింది. ఆమెకు ఎదురుగా ద్వారం దగ్గిర ఆమెకేసే చూస్తూ చంద్రశేఖరుడు నిలబడివున్నాడు

## 9

దలనీబేగమ్ రాసిన వుత్తరం నవాబు మీర్‌కాశింకు అందింది ముంశీరాయ గోవిందరామ్ నుంచి ఆ వుత్తరం అందుకుంటూనే, నవాబు దస్తూరీ గుర్తించి, యీ వుత్తరం ఎవరి ద్వారా వచ్చిందని ఆతణ్ణి అడిగాడు రాయ్‌గోవిందరామ్ ఆయనకు బ్రహ్మచారిని గురించి చెప్పాడు.

మీర్‌కాశిం వుత్తరం చదివి ఒక నిట్టూర్పు విడిచి, దలనీబేగమ్‌ను కోటకు తీసుకువచ్చేందుకు పల్లకిని పంపమని గోవిందరాయ్‌కి ఆజ్ఞయిచ్చాడు బోయీలు ప్రతాపుడి ఇల్లు చేరేసరికి, అక్కడ శైవలిని తప్ప ఎవరూ లేరు. వాళ్లు శైవలిన్నే దలనీబేగమ్ అనుకుని, పల్లకీ ఎక్కవలసిందిగా ఆమెను తొందరపెట్టారు

"ఎక్కడికి? ఎందుకు?'' అని శైవలిని బోయీలను ప్రశ్నించింది వాళ్లు నవాబుగారి వుత్తరువు సంగతి చెప్పారు

ఆ మాట వింటూనే శైవలిని ఏదో దుష్ట పిశాచం ఆవహించిన దానిలా వూగిపోయింది. ఆమె వెనకా ముందూ ఆలోచించకుండా చప్పున పల్లకీ ఎక్కి కూచున్నది

నవాబు మీర్ కాశిం, శైవలినిని చూసి ఆశ్చర్యపడ్డాడు. "నువ్వెవరు?" అని అతడు ప్రశ్నిస్తే, "నేనొక బ్రాహ్మణ యువతిని" అని ఆమె తొణక్కుండా జవాబిచ్చింది నవాబు ఆమెను నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడు. తన అంతఃపురంలో అలాంటి సౌందర్యవతి ఎవరూ లేరని అతడు గ్రహించాడు

"నేను పల్లకీ పంపింది. దలనీబేగమ్ కోసం,'' అన్నాడు నవాబు

"దలనీబేగమ్ ఆ ఇంట్లో లేదు రాత్రి ఆంగ్లేయు లిద్దరు సైనికులతో వచ్చి, ఆమెనూ, గృహ యజమానినీ– అందరినీ పట్టుకుపోయారు." అన్నది శైవలిని.

నవాబు నిర్విణ్ణుడయ్యాడు దలనీ బేగమ్ ఆంగ్లేయుల చేతికి చిక్కిందన్న మాట! ఇప్పుడేమిటి కర్తవ్యం? అతడు కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత శైవలిని ముఖంలోకి గుచ్చి గుచ్చి చూస్తూ "ఆ ప్రతాప్‌రాయ్, నీ కేమవుతాడు?" అని అడిగాడు.

"ఆయన, నా భర్త!" అన్నది శైవలిని ఏం సంకోచం లేకుండా

"నీ పేరు?"

"రూపసి"

మీర్ కాసిం మరేదో అడగబోయేంతలో, సేనాని గుర్గన్ ఖాన్ దర్శనార్థం వచ్చినట్టు ఒక సేవకుడు వార్త తెచ్చాడు. కాసిం శైవలినిని అక్కడే వుండమని చెప్పి, పక్క గదిలోకి వెళ్ళి గుర్గన్ ఖాన్‌ను కలుసుకున్నాడు.

గుర్గన్ ఖాన్ నవాబుకు సలాం చేసి, కంపెనీ దూతగా వుంటున్న అమిటమ్ దొర నగరం విడిచిపోయినట్టు అతడికి తెలియచేశాడు

"నా అనుమతిలేకుండా, అతడు వెళ్ళిపోవటం వింతగా వున్నది రాత్రి కొంద రాంగ్లేయ సైనికులు ప్రతాప్‌రాయ్ ఇంటిమీద దాడిచేసి, అతణ్ణీ, దలనీబేగమ్‌నూ బంధించి తీసుకుపోయారట ఇదంతా ఏమిటి?" అన్నాడు నవాబు కోపంగా.

గుర్గన్ ఖాన్ ఎంతో వినయం కనబరుస్తూ, "మనకు ఆంగ్లేయులతో యుద్ధం తప్పనిదశ వచ్చింది. జహాఁపనాహ్! రాత్రి, ఆంగ్లేయుల ఆయుధాల నౌకమీద వున్న ఫాస్టర్ అనే అతన్ని ఎవరో చంపారట ఆ పని చేసింది, ప్రతాప్‌రాయ్ అని వాళ్ళు అతడి ఇంటిమీద దాడిచేశారు. వాళ్ళు బంధించినవాళ్ళను వెంట పెట్టుకుని, అమిటమ్ దొర నావల్లో పాట్నాకు వెళ్ళిపోతున్నాడు" అన్నాడు

గుర్గన్ ఖాన్ యిలా చెప్పగానే నవాబు, ముంశీని పిలిచి, అమిటమ్ దొర వున్న నావ ముర్షీదాబాదు చేరగానే, పట్టుకోవల

సించిగానూ, అందులో వున్న బంధితులతోపాటు, ఆమిటమ్‌నికూడా ముంగేరుకు పంపవలసిందిగానూ — అక్కడ వున్న రాజోద్యోగి మహమ్మద్ తకీకి ఆజ్ఞలు జారీచేయవలసిందిగా చెప్పాడు

''గుర్గన్ ! ఇక నువ్వు వెళ్ళవచ్చు నువ్వన్నట్టు మనకు ఆంగ్లేయులతో యుద్ధం తప్పదు. సేనానిగా నువ్వు చెయ్యవలసిన ఏర్పాట్లన్నీ చెయ్యి" అన్నాడు నవాబు గుర్గన్ ఖాన్ అతడికి సలాంచేసి వెళ్ళిపోయాడు

మీర్ కాశిం శైవలిని వున్న గదికి తిరిగివచ్చి, "నీ భర్తను బంధించి తీసుకుపోతున్న ఆంగ్లేయుల్ని పట్టుకోవలసిందిగా ఆజ్ఞలు పంపాను నువ్వు కావాలంటే, నా అంతఃపురంలోనే వుండవచ్చు, లేదా నీ యిష్టమయిన చోటుకు పోవచ్చు." అన్నాడు.

శైవలిని చేతులు జోడించి నమస్కరిస్తూ, ''ప్రభూ ! భర్తను ఎడబాసిన నేను ఎక్కడికి పోగలను? నా భర్త మహావీరుడు సమయానికి చేతులో అయుధం లేనందువల్లనే, ఆయనను ఆ ఆంగ్లేయులు పట్టుకోగలిగారు. మీ అనుజ్ఞ అయితే, నేనాయన బంధింపబడి వున్న నావ చేరి, ఆయనని విముక్తుడయ్యేలా చేయగలను," అన్నది.

శైవలిని మాటలకు నవాబు చాలా ఆశ్చర్యపడ్డాడు. అతడు శైవలిని కేసి తేరిపార చూస్తూ, "నువ్వనేదేమిటి? నాకర్థం కావటంలేదు," అన్నాడు.

''ప్రభూ ! నా విన్నపం యిది మీరు నేను కోరిన ఆయుధాలూ, ఒక దాసీనీ, ఒక కాపలావాణ్ణీ నా వెంట పంపండి. రేవులోవున్న పడవల్లో వేగంగా పోయే పడవ నొకదాన్ని నా కిప్పించండి. నా భర్తను రక్షించుకునే ప్రయత్నంలో నేను చావటానికైనా సిద్ధంగావున్నాను" అన్నది శైవలిని.

నవాబు ఒక క్షణకాలం ఆలోచించి, అయిష్టంగా తలాడిస్తూ, ''స్త్రీవి, యింత సాహసం పనికిరాదు. - అయినా నీవు ఒకటికి రెండుసార్లు కోరావు గనక, నీ యిచ్ఛ ప్రకారమే జరగనీ," అంటూ ఒక నౌకరును పిలిచి, "ఇదుగో, మునిబుద్దీన్ ! నువ్వు ఒక హిందూ దాసీదాన్ని ఈ బ్రాహ్మణ స్త్రీకి తోడుగా యిచ్చి, వాళ్ళకు రక్షగా వెంట వెళ్ళు. తరవాత ఈమె కోరే ఆయుధాలూ, పడవా యిప్పించు. ఈమె ఆజ్ఞ ఎలాంటిదైనా మారు మాటాడకుండా పాటించు'' అని చెప్పాడు.

శైవలిని, నవాబుకు నమస్కరించి మునిబుద్దీన్ వెంట రాగా గది నుంచి బయటికి వెళ్ళిపోయింది మునిబుద్దీన్ ఒకదాసీనీ, ఒకనౌకరునూ ఏర్పాటుచేసి, శైవలిని ఆజ్ఞప్రకారం తుపాకీ, పిస్టల్, కత్తి, బాకు తీసుకువచ్చాడు. ఆయుధా

లన్నీ శైవలినికి అందించేటప్పుడు, 'ఇవన్నీ ఎందుకు?' అని అడగా లనిపించింది మునిబుద్దీన్‌కు కాని, అడిగే ధైర్యం లేకపోయింది ఈమె మరొక చాంద్‌సుల్తానా అనుకున్నా డతడు మనసులో చీకటిపడుతూండగా నావ ముర్షీదాబాదుకేసి బయలుదేరింది.

## 10

అర్ధరాత్రి సమయం నిండు వెన్నెల కాంతిలో గంగానది తళ తళ మెరిసిపోతున్నది నది మలుపుకు కొంచెం ఎగువగా నాలుగైదు పడవలు లంగరు వేసి వున్నవి వాటిల్లోని ఒక పెద్ద పడవ మీద అమిటమ్ దొరా, గ్లాస్టన్, జాన్సన్‌లు చదరంగం ఆడుతున్నారు, హఠాత్తుగా వారికి తీరంలోని ఇసుక మైదానం వైపు నుంచి స్త్రీ రోదిస్తున్న ధ్వని వినబడింది

అమిటమ్ దొర తల పక్కకు తిప్పి తీరంకేసి చూసి, మారు మాటాడకుండా పడవ దిగి, రోదన స్వరం వచ్చిన వైపుకు వెళ్ళాడు ఒక చిన్న దిబ్బ మీద అతనికి జుట్టు విరియబోసుకుని వున్న స్త్రీ కనిపించింది

అమిటమ్ దొర ఆమెను సమీపించి, తనకు వచ్చీరాని హిందీలో ఆమెను ఎందు కేడుస్తున్నా వని ప్రశ్నించాడు ఆ స్త్రీ ఆ ప్రశ్న వింటూనే తల పీక్కుని మరింతగా రాగాలు పెట్టింది అమిటమ్ ఆమెకు సౌంజ్ఞ చేసి పడవకేసి బయలుదేరాడు. స్త్రీ అతడిని వెన్నంటి పడవ మీదికి వచ్చింది

"గ్లాస్టన్! ఈమెకు హిందీ తెలిసినట్టులేదు. బెంగాలీ స్త్రీ లా కనిపిస్తున్నది మన వంటవాడు బెంగాలీయే కదా అతణ్ణి పిలిచి, యీవిడ సంగతేమిటో కనుక్కో." అన్నాడు అమిటమ్ దొర

గ్లాస్టన్ కేక వేయగానే పక్కన వున్న చిన్న నావలోంచి బెంగాలీ వంటవాడు, పీర్‌బక్స్ అక్కడికి వచ్చి, ఆ స్త్రీని, "ఎవరు నువ్వు? ఎందు కేడుస్తున్నావు? ఏం కావాలి?" అంటూ ప్రశ్నల వర్షంలో ముంచెత్తాడు

ఆ స్త్రీ తనకు ఆకలిగా వున్న దని చెప్పి, పెద్దగా ఓ పిచ్చినవ్వు నవ్వి, జుట్టు పీక్కుంటూ వంటవాడివెంట చిన్న నావలోకి వెళ్ళిపోయింది. పీర్‌బక్స్ ఆమెకు ఒక గిన్నెలో అన్నం తెచ్చాడు అది చూస్తూనే ఆ స్త్రీ రౌద్రరూపం ధరించి, "ఎవడ్రా నువ్వు? నేను బ్రాహ్మణ స్త్రీని, నువ్వు తాకిన అన్నం తింటా ననుకున్నావా?" అంటూ కేకలు పెట్టింది

పీర్‌బక్స్ అదిరిపోయి, పడవ మీదికి వచ్చి దొరలతో, "అయ్యా, ఆ స్త్రీ బ్రాహ్మణి అట నే నంటిన అన్నం తిన నంటున్నది" అని చెప్పాడు

"అయితే యిక్కడ బ్రాహ్మణు డెవడున్నాడు?" అని అడిగాడు అమిటమ్ దొర.

"ప్రతాపరాయ్, బ్రాహ్మణుడే" అన్నాడు వంటవాడు.

"అలా అయితే, అవిణ్ణి అతడి దగ్గరకు తీసుకుపోయి అన్నం పెట్టించు" అని ఆజ్ఞాపించాడు ఆమిటమ్‌దొర

పీర్‌బక్స్ ఆ స్త్రీని ప్రతాపుడు బందీగా వున్న నావలోకి తీసుకుపోయి, అతడికి సంగతి చెప్పాడు. "నా చేతులకీ బేడీలుండగా అన్నం ఎలా పెట్టటం?" అన్నాడతడు

ఆమిటమ్‌దొర అనుమతితో పీర్‌బక్స్, ప్రతాపుడి బేడీలు తీసి, తన నావ మీదకి వెళ్ళిపోయాడు

వంటవాడు వెళ్ళిపోగానే ఆ స్త్రీ నావలోని దీపపు కాంతిముందుకు వచ్చి, ప్రతాపుడితో. "నే నెవ రనుకున్నావ్. ప్రతాప్?" అని ప్రశ్నించింది

ప్రతాపుడు ఆ స్వరం వింటూనే తుళ్ళిపడి అటుకేసి చూశాడు. 'శైవలినీ!' అతడో క్షణకాలం నిశ్చేష్టు డయ్యాడు తరవాత తేరుకుని, "నువ్విక్కడి కెందుకొచ్చావ్? త్వరగా పారిపో అటు చూడు, ఆ చిన్న నావమీద మంచానికి అంటుకుపోయి శవంలా వున్నవా డెవ డనుకున్నావ్? లారెన్స్‌ఫాస్టర్! వాడి తల మీద గాయం నయమై, యిప్పుడిప్పుడే కోలుకుంటున్నాడు'' అన్నాడు.

శైవలిని ఫాస్టర్‌కేసి ఓ సారి చూసి, ప్రతాపుడితో, "ప్రతాప్, మనిద్దరం పారిపోదాం నదిఒడ్డుపులో నేను తెచ్చిన పడవ వున్నది నేను పిచ్చిదానిలా ఓ కేక పెట్టి నదిలో దూకుతాను నువ్వు నన్ను రక్షించబోయేవాడిలా నా వెనకే దూకు ఈదుకు పోదాం" అన్నది

ప్రతాపుడు జవా బిచ్చేందుకు తటపటాయించేంతలో, శైవలిని పెద్దగా గొంతెత్తి వికటంగా నవ్వుతూ." నాకు ముస్లింల అన్నం పెట్టారు నా జాతి, కులం పోయినై ఓ గంగామాతా, నాకు ఆశ్రయం యివ్వు.'' అంటూ నదిలో దూకింది

శైవలిని మాటలు వింటూనే లారెన్స్ ఫాస్టర్ తల ఎత్తి అమెకేసి చూసి, "పట్టుకోండి, పట్టుకోండి, నా వైఫ్' ఎంత బహుమానమైనా యిస్తాను'' అంటూ అరిచాడు ప్రతాపుడు కూడా, "రక్షించండి!" అంటూ కేకలు వేస్తూ, శైవలిని వెనకగా నదిలో దూకాడు

నావమీద కాపలా వున్న సైనికుల్లో ఒకడు తుపాకీ గురి పెట్టి, 'ఖైదీ పారిపోతున్నాడు!" అంటూ కాల్చబోయాడు. కాని ప్రతాపుడు గొంతెత్తి, "ఛీ దుర్మార్గుడా, నేను పారిపోతున్నానా? నీట మునిగే స్త్రీని రక్షించటానికూడా సాహసంలేని పిరికిపందలు, మీరు!" అంటూ ఛీత్కారం చేశాడు. సైనికుడు ఎత్తిన తుపాకీ దించాడు

ప్రతాపుడూ, శైవలినీ నీటివాలునపడి వేగంగా యీదుకు పోసాగారు కొంత దూరం అలా వెళ్ళిన తరవాత ప్రతాపుడు

హఠాత్తుగా శైవలినిని చెయి పట్టుకుని, "శై!" అన్నాడు.

ఆ సంబోధన వింటూనే శైవలిని శరీరం గగుర్పాటు చెందింది. ఆమె అలాంటి సంబోధన విని చాలా ఏళ్ళు అయింది.

"ఏమిటి ప్రతాప్," అన్నదామె పులకితస్వరంలో.

"ఏమీలేదు. ఒకప్పుడు మనం యిలాగే నదిలో యీదాం," అన్నాడు ప్రతాపుడు.

"అవును." అన్నది శైవలిని నిస్పృహగా.

"ఒక ప్రమాణం చేస్తావా?" అని అడిగాడు ప్రతాపుడు.

"ప్రమాణమా!"



"అవును, యీ గంగసాక్షిగా చెయ్యాలి ఈనాటినుంచీ నా గురించిన ఆలోచన లేవీ నీ మనస్సులో మెదల కూడదు," అన్నాడు ప్రతాపుడు

శైవలిని నివ్వెరపోయి, "అలాగే ప్రమాణం చేస్తాను. కానీ, నువ్వొకసారి ఆలోచించిచూడు. నా హృదయాన్నీ, మనస్సునూ నువ్వెప్పుడో అపహ రించావు అలాంటప్పుడు కనీసం నిన్ను గురించిన ఆలోచనల్నికూడా మనస్సులోకి రాకుండా ఎలా ఆటంకపరచగలను?" అన్నది దీనంగా.

ప్రతాపుడు కోపంగా శైవలిని చేతిని విదిలించివేసి, "అయితే నన్ననుసరించి రాకు నేనిక్కడే మునిగి మరణిస్తాను" అంటూ దూరంగా ఈదుకు పోసాగాడు

శైవలిని దుఃఖంచేత రుద్ధమైన కంఠ ముతో, "ప్రతాప్! అంత సాహసం చెయ్యకు, ప్రమాణం చేస్తున్నాను ఈ నాటితో యీ శైవలిని చచ్చిపోయింది, సరా!" అన్నది.

ప్రతాపుడు వెనుదిరిగి ఆమె కేసి చూశాడు అతడి కళ్ళల్లో నీళ్లు తిరిగినై ఆత డేదో మాట్లాడబోయి గొంతు పెగ లక వూరుకున్నాడు



"ప్రతాప్! నీ కోర్కె నెరవేరింది కదా? ఇక ఒడ్డుకు చేరదాం. రా నే వచ్చిన పడవ, ఆ మలుపులోనే వుంది." అన్నది శైవలిని

ఇద్దరూ ఒడ్డుచేరి, పడవ వున్నచోటుకు తీరంవెంట నడిచిపోయారు బ్రహ్మచారి గురువైన రామానందస్వామి, వాళ్ళిద్దరినీ గమనిస్తూ, నది ఒడ్డున వున్న ఒకచెట్టు కింద నిలబడివున్నాడు ప్రతాపుడూ, శైవలినీ పడవ ఎక్కటం, పడవ బయలు దేరటం–దాన్ని పట్టుకునేందుకు ఆంగ్లేయులు వేరొక పడవలో వచ్చి చేసిన వ్యర్థప్రయత్నం అంతా ఆయన చూస్తూనే వున్నాడు.

* * *

ఉన్నట్టుండి ఆకాశాన్ని కారుమేఘాలు కప్పివేశాయి. ప్రళయ భయకరంగా ఉరుములూ, కళ్ళు మిరుమిట్లు కొల్పే మెరుపులతో ఝుంఝూ మారుతం సాగింది ఆకాశాన్నుంచి భూమికి ఒకే చీకటి ముసుగు కప్పుకుపోయింది, ప్రతాపుడు పడవలో ఏమరుపాటున వుండగా, అక్కణ్ణించి పారిపోయి, నదీ తీరంలోని అడవిని చేరిన శైవలిని, యీ భయంకర ప్రకృతిని చూసి భీతిల్లిపోయింది. ఆమె ప్రతాపుణ్ణుంచి సాధ్యమైనంత దూరం పారిపోవాలని ఆ చీకట్లో కీకారణ్యంలో జొరబడింది

ఒకసారి పెద్దగా ఉరిమి పెళ పెళా రావాలతో దూరంగా పిడుగు పడింది. ఆ వెంటనే కుండపోతగా వర్షం ప్రారంభమయింది. చీకటిలో దారి తెలియక పడుతూ, లేస్తూ, అడవి చేరిన శైవలిని శరీర మంతా చిన్న చిన్న గాయాలై రక్తం కారసాగింది. 'ఈసారి పిడుగు యీ చెట్టుమీదనే పడుతుంది దానితో ఏ కొమ్మో విరిగి నెత్తిన పడి నేను మరణిస్తాను.' అనుకున్నది శైవలిని. కాని, అంతలోనే, 'ఆ పిడుగు నా నెత్తినే ఎందుకు పడగూడదు?' అనుకుంటూ నిస్పృహగా చెట్టు బోదెకు చేరగిల పడింది

గాలీ వానా ఉన్నకొందికీ అధికం కాసాగినై గాలి తాకిడికి చెట్ల కొమ్మలు విరిగి పడుతున్నవి. ఎక్కడో కొండ మీద బయలుదేరిన నీటి వాగొకటి, రాళ్ళు, రప్పలను తొలగదోసుకుంటూ వచ్చి బలంగా శైవలిని వున్న చెట్టును తాకింది, శైవలిని చలికి వణికిపోతూ, చెట్టును గట్టిగా పట్టుకున్నది. భీతి చెందిన అడవి జంతువేదో అరుస్తూ, ఆమె పక్కగా పరుగెత్తింది దూరాన కొండ మీదినుంచి పట్టు తప్పిన బండరా యొకటి పెద్ద శబ్దం చేస్తూ కిందికి దొర్లింది

శైవలిని దుస్తులు వాన జల్లుకు తడిసి ముద్దయినాయి. అదే సమయంలో కొండ మీదినుంచి పల్లానికి దూకుతున్న నీటివాగు, ఆమెను తనతో పాటు ఎక్కడికో ఈడ్చుకుపో ప్రయత్నిస్తున్నది.

'నాకు చావు తప్పదు '' అనుకున్నది శైవలిని. ఆమె శరీరం చలితో బిగుసుకు పోతున్నది.

శైవలినికి స్పృహ తప్పబోతున్న సమయంలో, ఆమె భుజాలను రెండు బలమైన చేతులు తాకినై. శైవలిని త్రుళ్ళిపడింది ఆ చేతులు తనను పైకెత్తుతున్నట్టు గ్రహించి ఆమె కెవ్వున కేక వేశంచి.

## 11

శైవలినికి క్రమంగా స్పృహ వచ్చింది. ఆమె బరువుగా కనురెప్పలెత్తి చూసి, తాను ఒక అంధకారమయమయిన గుహలో వున్నట్టు తెలుసుకున్నది. బయట గాలివాన ఆగిపోయింది గుహలో ఎక్కడో మరో ప్రాణి – మనిషో, జంతువో, తనవలెనే శ్వాస పీలుస్తున్నట్టు శైవలినికి తోచింది. ఆ ప్రాణి తన కెంత దూరంలో వున్నట్టు?

శైవలినికి యీ ఆలోచన రాగానే శరీర మంతా గగుర్పాటు చెందింది. రెండురోజులుగా కటిక ఉపవాసం చేయటంవల్లా, గాలివానలో చిక్కి శరీర మంతా తడిసి ముద్ద కావటంవల్లా, ఆమెకు జ్వరం వచ్చింది ఆ జ్వరానికి తోడు ఆమెలో ఎక్కడాలేని పశ్చాత్తాపం, మానసిక ఆవేదనా ప్రారంభ మయినాయి

'నేను చచ్చిపోతున్నాను, పతితను, నరకం తప్పదు' అనుకుంటూ ఆమె కళ్ళు మూసుకున్నది. ఆ వెంటనే ఆమెకు నరకలోకము కనిపించింది. భయంకరంగా వున్న యిద్దరు యమ కింకరులు ఆమెను వడిసి పట్టుకున్నారు వారిలో ఒకడు చేతులోవున్న తేళ్ళ కొరడాను ఆమె పైకి ఎత్తాడు అంతలో సుందరి అక్కడ ప్రత్యక్షమైంది. "కొట్టండి! ఆ పతితను, నిప్పుల్లోవేసి మాడ్చండి! లారెన్స్ ఫాస్టర్ దగ్గర నుంచి తీసుకు వచ్చేందుకు, నేను పడవ మీదికి వెళ్లాను. కాని, ఆ పాపి, నా మాట విని, నా వెంట వచ్చింది కాదు" అన్నది పళ్ళు కొరుకుతూ.

యమభటుడు తేళ్ళ కొరడాతో శైవలినిని గట్టిగా ఒకదెబ్బ కొట్టాడు. ఆ దెబ్బతో శైవలినికి శరీరమంతా మంటల్లో కాలుతున్నట్టయింది ఆమె బిగ్గరగా గొంతెత్తి, ''రక్షించండి రక్షించండి'' అని అరిచింది.

ఆమె ఆర్తనాదానికి జవాబుగా, గుహలోని ఒక చీకటి కోణంనుంచి "నీకు రక్షణ వుంది పన్నెండేళ్ళ వ్రతం ఆచరించ గలవా?'' అన్న ప్రశ్న వినిపించింది

"ఆచరిస్తాను'' అన్నది శైవలిని పెద్దగా ఏడుస్తూ

''నువ్వు నీ భర్త గ్రామం వెళ్ళి ఊరి బయట ఒకచిన్న కుటీరం నిర్మించుకుని, సన్యాసినిలా ముష్టి ఎత్తుకుని జీవించాలి. ముష్టికోసం వెళ్ళిన ప్రతి ఇంటి

దగ్గిరా నీ పాప చరిత్ర వినిపించాలి'' అన్న దా కంఠం.

"పన్నెండేళ్ళు యిలాంటి కఠిన నియమాలతో జీవిస్తే, ఆ తరవాత నా భర్తను తిరిగి పొందగలనా? ఒక వేళ యీ లోపలే నేను మరణిస్తే!" అన్నది శైవలిని

"మరణానికి ముందు నీ భర్తను చూడగలవు" అన్న దా కంఠం

"మీ రేదో దేవతల్లా వున్నారు మీరు చెప్పిన వ్రతం ఆచరిస్తాను నేను వేద గ్రామం వెళ్ళిపోతాను. కాని, వెళ్ళే ముందు ఒక్కసారి నా భర్తను చూడాలని వున్నది. దయవుంచి ఆ సహాయం చెయ్యలేరా? మహాపురుషా!" అని దీనాతిదీనంగా ప్రార్థించింది శైవలిని.

కొద్దిసేపు నిశ్శబ్దం తరవాత, ఆ కంఠం ఇలా జవాబిచ్చింది "నీ కోర్కె ఒక వారం రోజుల్లో నెరవేరుతుంది. ఈ వారం రోజులూ నువ్వు, ఈ అరణ్యంలో దొరికే కందమూలాలు ఒక పూట మాత్రం తిని వుండాలి ఎప్పుడూ నీ మనస్సులో భర్త రూపాన్ని ధ్యానిస్తూ వుండాలి."

"మీకు వెయ్యి నమస్కారాలు," అన్నది శైవలిని రుద్ధమైన కంఠ స్వరంతో

ఇంత వరకూ శైవలిని ప్రశ్నలకు జవాబిచ్చిన కంఠస్వరం మరి పలక లేదు. శైవలిని మగతనిద్రలోకి జారుకున్నది. ఆ సమయంలో చీకటి గుహలో నుంచి కొండ మీదికి వున్న ఒక రహస్య మార్గం కేసి, ఒక ఆజాను బాహుడు బయలుదేరి పోయాడు. అతడే, శైవలినిని గాలివాననుంచి రక్షించి గుహ చేర్చింది.

ఆరు రోజులు గడిచిపోయినై ఏడవనాటి తెల్లవారుజామున గుహలో కలతనిద్రలో వున్న శైవలినికి, తాను చనిపోయి నరకానికి వెళ్ళినట్టు కల వచ్చింది "ఇక నా భర్తను దర్శించలేను ఈ ఆరు రోజులూ నేను పాటించిన నియమ నిష్ఠ లన్నీ వృధా!" అనుకున్న దామె. అంతలో ఒక భయంకరాకారుడు ఆమెను సమీపించి, జుట్టు పట్టుకుని పైకెత్తి, సలసల కాగుతున్న ఒక నూనె భాండంలోకి ఆమెను విసిరివేశాడు.

శైవలిని శరీరం ఆపాద మస్తకం భగ్గుమన్నది. ఆమె పెద్దగా గొంతెత్తి "రక్షించండి, రక్షించండి!" అంటూ అరచి కళ్ళుతెరిచింది ఎదురుగా వున్నది బ్రహ్మచారి వేషంలో చంద్రశేఖరుడు! ఆమె అతడి పాదాలమీద వాలిపోయింది

"శైవలినీ!" అన్నాడు చంద్రశేఖరుడు గంభీరంగా "నువ్వు నన్ను చూడగోరిం దెందుకు?"

"నే నిక స్వల్పకాలమే జీవిస్తా నని తోస్తున్నది చనిపోయేముందు మిమ్మల్నొకసారి చూడా లని కోర్కె కలిగింది



అయినా, పతితనైన నా మాటల్ని మీరెలా నమ్మగలరు " అన్నది శైవలిని.

"నువ్వు పతితవుకాదు, నిన్ను లారెన్స్ఫాస్టర్ బలవంతంగా తీసుకు వెళ్ళాడని నాకు తెలుసు," అన్నాడు చంద్రశేఖరుడు.

శైవలిని వికటంగా నవ్వి, "అది అబద్ధం ఇష్టమయ్యే నేను లారెన్స్ఫాస్టర్ వెంట వెళ్ళాను దోపిడీ జరపటానికి ముందు, ఫాస్టర్ నా దగ్గిరకు తన మనిషిని పంపాడు," అన్నది

ఆ మాట వింటూనే చంద్రశేఖరుడు తల వంచుకుని "శైవలినీ! ప్రాయశ్చిత్తంగా, నువ్వు పన్నెండు సంవత్సరాలకాలం కఠినవ్రతం చెయ్యి ఆ తరవాత జీవితం వుంటే యిద్దరం కలుసుకుందాం," అంటూ గుహ బయటికి పోబోయాడు.

శైవలిని, అతడి కాళ్ళు పట్టుకుని వారిస్తూ, "మరి కాసేపు వుండండి ఆత్మహత్య పాపమా?" అని అడిగింది

"ఏం, నీకు చనిపోవాలనివున్నదా?"

"చనిపోయినా, బతికివున్నా నాకు నరకబాధలు తప్పేట్టులేవు రాత్రింబవళ్ళు నరకాన్ని గురించిన స్వప్నాలే కంటున్నాను," అన్నది శైవలిని వణికిపోతూ

"ప్రాయశ్చిత్తం చేసుకుంటే, అన్ని బాధలనుంచీ విముక్తి కలుగుతుంది," అన్నాడు చంద్రశేఖరుడు.

శైవలిని భీతిల్లిన దానిలా గుహ లోపలిభాగంకేసి చూస్తూ, తల పీక్కుని పిచ్చిదానిలా నవ్వుతూ, "నరకం! నరకం!" అంటూ కేకలు ప్రారంభించింది.

చంద్రశేఖరుడు ఆమె భుజం పట్టుకుని కుదుపుతూ, "శైవలినీ, శైవలినీ!" అంటూ ఆదుర్దాగా పిలిచాడు

"ఎవరు నువ్వు? లారెన్స్‌ఫాస్టరువా? వో ఇక్కణ్ణించి నన్ను నరకంలో తోయటానికి వచ్చిన పిశాచానివి నువ్వు." అంటూ శైవలిని, చంద్రశేఖరుడి గొంతు పట్టుకోబోయింది.

చంద్రశేఖరుడు, శైవలినిని ప్రేమగా కౌగలించుకొని, "గురుదేవా! ఏమి టీ దుస్థితి? ఈమెను గాలివాన నుంచి రక్షించి, గుహ చేర్చినది పిచ్చిదానిని చెయ్యటానికా!" అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు

శైవలిని కుమిలి కుమిలి ఏడుస్తూ, ~~చంద్రశేఖరుడి పట్టునుంచి జారి క్రింద~~ పడిపోయింది. చంద్రశేఖరుడు ఆమెను లేవనెత్తి, "శైవలినీ! నా వెంట వేద గ్రామం వస్తావా?" అని అడిగాడు.

"వేదగ్రామమా? నువ్వెవరు?" అన్నది శైవలిని కోపంగా.

"నేను చంద్రశేఖరుణ్ణి!"

శైవలిని అతడి ముఖంలోకి గుచ్చి గుచ్చి చూస్తూ, "నువ్వు నన్ను చంపవు గదా?" అని ప్రశ్నించింది.

చంద్రశేఖరుడు దీర్ఘంగా నిట్టూర్చి, గుహ నుంచి బయలుదేరాడు. శైవలిని అతడి వెనకగా పిచ్చిదానివలె ఏదో పాడుతూ బయలుదేరింది.

## 12

ప్రతాపుడు ఉదయం నిద్ర లేస్తూనే, పడవలో శైవలిని లేకపోవటం గమనించి చాలా వ్యాకులపడ్డాడు ఆమె కోసం అతడు గంగాతీరం అంతా వెతికాడు కనిపించినవారి నెల్లా అడిగి చూశాడు. కాని, ఆమె జాడ తెలియరాలేదు చివరకతడు శైవలిని గంగా నదిలో పడి మరణించిందని నిశ్చయించుకున్నాడు

కొంచెం పొద్దెక్కేసరికి అతడి నౌకరు రామచరణుడు కుంటు కుంటూ పడవదగ్గరకు వచ్చాడు ప్రతాపుడు పారిపోయినతరవాత అమిటప్ దొర, రామచరుణ్ణి విడుదల చేస్తూ, "మీ యజమాని ప్రతాప్ చాలా దుర్మా~~ర్గుడు. బందిపోటు వద్దే, యిప్పటికి~~ పారిపోతాడు కాని, అతణ్ణి ఏనాటికైనా చేజిక్కించుకుని శిక్షించగలను నౌకరువు. నీ దేముంది? నీ యిష్టం వచ్చిన చోటుకు పో," అని చెప్పాడు

రామచరణుడు ఆ విధంగా ఖైదునుంచి విడుదలై, తన యజమానిని వెతు

క్కుంటూవచ్చి, అతణ్ణి కలుసుకున్నాడు. కాని, ఆ సమయంలో ప్రతాపుడు తీవ్ర మైన మానసిక ఆవేదనలో వున్నాడు. ఒకరకంగా శైవలిని చావుకు బాధ్యత తనదే నన్న భావం అతణ్ణి బాధిస్తున్నది మరొకవంక ఆమె మరణానికి బాధ్యుడు చంద్రశేఖరు డన్న అభిప్రాయం కూడా కలుగుతున్నది పుస్తకాల్లో మునిగితేలే ఆ పండితుడు ఆమె నెందుకు వివాహం ఆడాడు ? సరే, ఈ లారెన్స్‌ఫాస్టర్ మాటేమిటి ? వా డామెను ఇల్లు కదిలిం చటంవల్లనేగదా—ఈ దుర్ఘటనలన్నీ కలిగి, చివరకు శైవలిని చావుతో సర్వసమాప్త మైంది !

"ఈ అంగ్లజాతి బెంగాలులో అడుగు పెట్టడంవల్లనే యీ ఘోరం జరిగింది." అనుకున్నాడు ప్రతాపుడు ఆవిధంగా అత డికి మొత్తం అంగ్లజాతిమీదే ద్వేషం రగుల్కొన్నది. ముందుగా లారెన్స్ ఫాస్టర్‌ను పట్టుకొని చంపి అగ్నిసంస్కారం కావించా లనుకున్నాడు, ప్రతాపుడు

దేశం అరాజక పరిస్థితుల్లో వున్న ఆ కాలంలో బెంగాలులో అనేక బందిపోటు ముఠా లుండేవి ప్రతాపుడు వాళ్ళల్లో కొందరి నెరుగును అయినా, ముందుగా ముంగేరు పట్టణం వెళ్ళి, అక్కడి పరి స్థితు లెలా వున్నాయో చూడకుండా, బందిపోట్లతో సంబంధాలు పెట్టుకోవటం ప్రమాదకారణం కావచ్చుని అతడు నిశ్చ యించుకున్నాడు.

ప్రతాపుడు ముంగేరుకు వెళ్ళి, కోటలో ప్రవేశించాడు. అక్కడ వున్న వజీరుల ద్వారా నవాబుగారు ఆంగ్లేయులతోయుద్ధా నికి సర్వసన్నాహాలూ చేస్తున్నట్టు తెలుసు కున్నాడు అతడికి ఎక్కడలేని ఆనందం కలిగింది అతడు వజీర్లతో తన మాటకు సుగ్రీవాజ్ఞగా పాలించే బందిపోటుముఠాల పేర్లు చెప్పి, "నాలుగైదు ముఠాలను నా నాయకత్వం కింద సమీకరించగలను వాళ్ళ సాయంతో ఆంగ్లేయుల ఖజానా, వాళ్ళకు కప్పం కట్టే గ్రామాలూ దోచే స్తాను. వాళ్ళ సైన్యాలకు ఆహార పదా ర్థాల సరఫరా అందకుండా అటకాయి స్తాను." అని చెప్పాడు.

వజీర్లు, ప్రతాపుణ్ణి నవాబు మీర్ కాశిం దగ్గిరకు తీసుకుపోయారు. నవాబూ, అతడూ ఏకాంతంగా సంభా షించారు. ఆ సంభాషణా, అక్కడ తీసుకున్న నిర్ణయాలూ రహస్యంగానే వుండిపోయినై. కాని, కొద్ది రోజుల తరవాత ప్రతాపుడు బరిశెలూ, బాణా కర్రలూ ఆయుధాలుగా గల కొన్ని బంది పోటు దళాలకు నాయకు డయ్యా డని తెలిసి, సేనాని గుర్గన్‌ఖాన్ విచారంలో మునిగిపోయాడు

## 13

నవాబు మీర్ కాశింపంపిన ఆజ్ఞా పత్రం చూసుకుని, ముర్షిదాబాదులోని రాజోద్యోగి మహమ్మద్‌తకీ, ఆంగ్లే యుల నావల్ని పట్టుకునేందుకు సర్వ

సన్నద్ధంగా వున్నాడు ఈ సంగతి ముందుగా కంపెనీ ప్రతినిధి అమిటమ్ దొరకు తెలియదు అతడు తన నావలతో ముర్షీదాబాదు రేవు చేరాడు అతడి వెంట గ్లాస్టన్, జాన్సన్‌లు వున్నారు లారెన్స్ ఫాస్టర్ ప్రత్యేకంగా ఒక చిన్న నావలో వుంచబడ్డాడు అతడికి తలమీద తగిలిన గాయం చాలా వరకు మానిపోయింది అతడు గుండుదెబ్బ తిని గంగానదిలో పడి మునుగుతూ తేలుతూ వుండగా, ఆ సమయంలో అటుగా వచ్చిన ఆంగ్లేయ నావికులు అతడ్ని రక్షించి, గాయానికి చికిత్స చేయించారు. ఇప్పు డతడు అమిటమ్ దొరతో కలిసి ముర్షీదాబాదు రేవు చేరాడు

ఆంగ్లేయుల నావలు రేవు చేరగానే, అందులో వున్నవాళ్ళను పట్టి బంధించి వాళ్ళకు ఖైదీగా వున్న దలనీబేగం, కుల్‌సమ్‌లను నవాబు దగ్గరకు పంపుదా మనుకున్న మహమ్మద్‌తకీ, ఆంగ్లేయ నావికుల్ని, వాళ్ళ తుపాకీ బలాన్నీ చూసి భయపడి పోయాడు. ఏదో మాయ మాటల్తో, ఆంగ్లేయులు నావలు వదిలి, ఒడ్డు కొచ్చేట్టు చేసి, వాళ్ళను హత మార్చటం క్షేమ మని అతడు నిశ్చయించుకున్నాడు

ఇలాంటి పథకం వేసుకుని మహమ్మద్‌తకీ, అమిటమ్ దొరను విందుకు రావలసిందిగా ఆహ్వానం పంపాడు గ్లాస్టన్, జాన్‌సన్‌ల సలహా పాటించి, అతడు ఆ ఆహ్వానాన్ని తిరస్కరించాడు తకీ పంపిన ఆహ్వానంవెనక మోసం వున్న దని ఆంగ్లేయులు గ్రహించారు.

ఇప్పు డిక మహమ్మద్‌తకీకి యుద్ధం చేయటం తప్ప మరో మార్గాంతరం లేకుండాపోయింది. అతడు తన సైనికులను నదీతీరంలో వున్న ఇళ్ళలోనుంచి, నావలమీదికి కాల్పులు చేయవలసిందిగా ఆజ్ఞ యిచ్చాడు ముస్లింసైనికుల సమీకరణ చూసిన అమిటమ్‌దొర, దలనీ బేగం, కుల్‌సమ్‌లను లారెన్స్‌ఫాస్టర్ వున్న నావలోకి చేర్పించి, దానికి కాపలాగా నలుగురు సైనికులను నియమించాడు

ఇంతలో ముస్లిం సైనికులు, ఆంగ్లేయులమీద కాల్పులు ప్రారంభించారు దానికి జవాబుగా అమిటమ్, గ్లాస్టన్, జాన్‌సన్‌లూ, వారి వెంట వున్న సైనికులూ కాల్పులు చేశారు ఒక పావుగంట యిలా జరిగినా మందుగుండు ఖర్చుతప్ప, మ రే ఫలితం లేకపోయేసరికి, మహమ్మద్‌తకీ తన సైనికులను ఇళ్ళల్లోనుంచి బయిటికి వచ్చి, పడవలను వశపరచుకోవలసిందిగా ఆజ్ఞ యిచ్చాడు

ముస్లిం సైనికులు భయంకరంగా అరుస్తూ ఈటెలూ, కత్తులూ పట్టుకుని ఆంగ్లేయుల నావలమీదికి వెళ్ళారు ఆంగ్లేయులు ఏమాత్రం చలించక. నడుములోతు నీటిలో దిగి నావలదగ్గరకు వచ్చే



యుద్ధ

శత్రుసైనికులను గురిచూసి కాలుస్తూ, చాలామందిని చంపారు అయినా శత్రువులు అసంఖ్యాకంగా వచ్చి నావలమీద పడ్డారు అప్పుడు జరిగిన బాహాబాహి యుద్ధంలో ఆమిటమ్, గ్లాస్టన్, జాన్సన్‌లు మరణించారు

ముస్లింసైనికులు నావలమీదికి రావటం చూస్తూనే, లారెన్స్ ఫాస్టర్ తన నావను రేవులోనుంచి నదిమధ్యకు తీసుకుపోయాడు అతడి ఆలోచన కాశింబజారు రెసిడెన్సీకి పారిపోవాలని కాని, నావ ఆ ప్రాంతాన్ని చేరేసరికి రెసిడెన్సీ పరశురామప్రీతి అవుతూండటం అతడి కంటబడింది దాన్ని నవాబు సైనికులు దోచుకుని, నిప్పంటించారు

ఫాస్టర్ యిక తాను పాట్నాకు పారిపోవటమే క్షేమ మనుకున్నాడు కళాసులకు ఆ విధంగానే ఉత్తరు విచ్చాడు నావ కాశింబజారు, ఫరాస్‌డాంగా, సైదాబాదు, రాంగాపాటీలను దాటిపోతున్నది నావ కిందిగదిలో వున్న దలనీ బేగంకు తాను మరింత చిక్కుల్లో పడిపోతున్నా నన్న భయం పట్టుకున్నది. దాసీ కుల్‌సమ్ మాత్రం నిబ్బరంగా గదిలోనించి బయటికివున్న కంతనుంచి, అంతా గమనిస్తున్నది

నవాబుగారి సైనికులకు దొరక్కుండా యీ ఫాస్టర్ తప్పుకోగలిగాడు. వీడు మనల్ని కలకత్తాకు తీసుకుపోతున్నాడు." అన్నది దలనీ నిస్పృహా, భయం పెనవేసుకున్న గొంతుతో.

ఆ మాటలకు కుల్‌సమ్ ఏమాత్రం చలించక; "అదే నయం నవాబుగారి చేతబడితే మనిద్దరికీ మరణం తప్పదు." అన్నది

దలనీ ఆశ్చర్యపోతూ, "మనిద్దరికీ చావు తప్పదా? ఎందుకనీ? సరే, ఒక వేళ అలా జరిగినా నాకు భయంలేదు, నా భర్తచేతిలో చావటానికి నేను సిద్ధమే." అన్నది కుల్‌సమ్ ఏదో అనబోయేంతలో, పైనుంచి లారెన్స్ ఫాస్టర్ పెద్దగా కేకవేసి "మీ యిద్దరికోసం నవాబు నావ, నన్ను వెంబడిస్తున్నది. మీ యిద్దర్నీ తీరాన దిగబెడతాను, యిష్టమేనా?" అని అడిగాడు

దలనీబేగం కుల్‌సమ్‌తో, "ఈ ఆంగ్లేయుడు మంచివాడులా కనిపిస్తున్నాడు ఒడ్డుకు చేరదాం తరవాత నవాబుగారి నావ ఎక్కి కోటకు చేరవచ్చు" అన్నది

కుల్‌సమ్ ససేమిరా ఒప్పుకోలేదు "నవాబుగారు నిన్ను బతకనిచ్చినా, నన్ను బతుకనివ్వరు కోటలోనుంచి బయటికి వెళ్ళేందుకు, నీకు నేను సహాయపడ్డానని ఆయన తప్పక గ్రహిస్తారు నన్ను వదులు. నేను ఈ ఆంగ్లేయులతో కలిసి కలకత్తా వెడతాను. అక్కడ నాకు బంధువులున్నారు" అన్నది కుల్‌సమ్.

చేసేదిలేక-దలనీబేగం ఒక్కతే దిగిపోయేందుకు ఒప్పుకున్నది. లారెన్స్ ఫాస్టర్ ఆమె నావనుంచి తీరం చేరగానే కుల్‌సమ్‌నుకూడా దిగమని బలవంత పెట్టాడు కుల్‌సమ్ మొండి కెత్తింది ఇంతలో తనను తరుముకొస్తున్న దని ఫాస్టర్ భావించిన నావ సమీపిస్తుండటం చూసి, అతడు కుల్‌సమ్‌తో కూడా నావలో పారిపోయాడు.

దలనీబేగమ్, ఫాస్టర్ నావ ననుసరించి వస్తున్న నావ సమీపంలోకి రాగానే, చే ఎత్తి కేకలు పెట్టింది. కాని, ఆ నావలోని వాళ్ళెవరూ ఆమె మాటలు వినిపించుకో లేదు చూస్తూండగానే నావ కనుమరుగై పోయింది

దలనీ హతాశురాలై వున్న చోటునే కూలబడింది. ఎంతసేపు నిరీక్షించినా ఆ ప్రాంతాలకు మరొక నావ రాలేదు అంతలో సూర్యాస్తమానమై చీకట్లు కమ్ముకున్నవి గంగానది చేసే గలగల ధ్వని, నక్కల అరుపులూ తప్ప, ఎక్కడా మనిషి మెదిలిన జాడ లేదు

దలనీబేగమ్ చాలాసేపు తన నిస్సహాయస్థితికి దుఃఖించి సొమ్మసిల్లి కళ్ళు మూసింది. బాగా రెండు జాముల రాత్రి గడిచిన తరవాత, ఒక అజానుబాహుడు ఆమె పడివున్న చోటుకు వచ్చి, ఆమెను మెల్లగా చేతులలోకి ఎత్తుకుని, అరణ్యంలోని కొండకేసి వెళ్ళిపోయాడు

# 14

ఆమిటమ్ దొరనూ, యితర ఆంగ్లేయులనూ, వారి వెంట వున్న సైనికులనూ చంపి, వాళ్ళ నావలను వశం చేసుకున్న మహమ్మద్‌తకీ, ఎక్కడా దలనీబేగమ్ కనబడకపోయేసరికి భయభ్రాంతుడై పోయాడు నవాబు మీర్‌కాశిం ఆజ్ఞ ఏమంటే, దలనీబేగమ్‌ను ఆంగ్లేయుల ఖైదు నుంచి విడిపించి సురక్షితంగా ముంగేరుకోటకు పంపమని. కాని, జరిగింది, ఆయన ఆజ్ఞలకు పూర్తిగా వ్యతిరేకమైన పని ఆంగ్లేయులంతా చచ్చారు, కాని వాళ్ళ ఖైదీ ఎక్కడ ?

మహమ్మద్‌తకీ కొంతసేపటికి తేరుకుని, యీ ఆపద నుంచి బయటపడే మార్గం కోసం ఆలోచించసాగాడు వాడు అసలే జిత్తులమారి ఆనాడు చాలా మంది నమ్ముతున్నట్లు అతడికీ, ఆంగ్లేయుల చేతిలో మీర్‌కాశింకు ఓటమి తప్పదన్న నమ్మకం వున్నది ఆంగ్లేయులు మీర్‌కాశిం గద్దెను తిరిగి ఖైదులో వున్న మీర్‌జాఫర్‌కు కట్టబెట్ట చూస్తున్నట్టుకూడా బయిటికి పొక్కిపోయింది అంతేకాక, రాజోద్యోగిగా అతడికి సేనాని గుర్గన్‌ఖాన్ ఎత్తుగడలు తెలుసు ఆంగ్లేయుల్ని జయిస్తే, ఆ తరవాత తానే నవాబు కావాలని అతడు ఎత్తుకు పైఎత్తు వేస్తున్నాడు అందుగ్గాను ముంగేరులోని వర్తకప్రముఖులైన,

స్వరూప చంద్రుడు, మహతాబ్ చంద్రుడు అనే అన్నదమ్ముల దగ్గర నుంచి కొంత ధనం కూడా రహస్యంగా అతడు పుచ్చుకున్నాడు

మహమ్మద్ తకీ యీ ధోరణిలో ఆలోచించటం ప్రారంభించిన తరవాత, అతడికి ఎటు చూసినా నవాబుకాశిం అంగ్లేయుల చేతుల్లో చచ్చినవాడికింద జమగానే కనిపించాడు సరే, ఒక రస్సా వేసి చూద్దాం పారిందో, మహబాగు, పేలిందో, నవాబుకు శత్రువులైన ఆంగ్లేయుల శరణు వుండనే వున్నది అని తేల్చుకున్నాడు తకీ.

ఈ నిశ్చయానికి వచ్చి తకీ, ఒక వార్తాహరుడి ద్వారా నవాబు మీర్ కాశింకు ఇలా ఉత్తరం రాసి పంపాడు:

"ఆమిటమ్ నావలో వున్న బేగంను సురక్షితంగా, గౌరవ లాంఛనాలతో ముర్షీదాబాదులోని ఒక భవనంలో ప్రవేశపెట్టాను. కాని, బేగంను గురించిన కొన్ని నమ్మదగిన విషయాలు తమకు ముందుగా తెలియపరచి, మీ అనుమతి పొందకుండా ఆమెను ముంగేరు పంపటము మంచిది కాదని, యీ వుత్తరం రాస్తున్నాను. ఆంగ్లేయుల వెంట వుండి, జరిగిన పోరులో బతికి బయటపడిన వాళ్ళందరి ద్వారా నేను నమ్మకంగా తెలుసుకున్న సంగతేమిటంటే, ఆమె యింత కాలంగా వాళ్ళకు ఖైదీగా లేదనీ, ఆమిటమ్ దొరకు ఉంపుడు కత్తెగా వున్నదనీ. బేగం కూడా ఆ విషయాన్ని అంగీకరించటమే గాక, చేసిన పనికి గర్వపడుతున్నట్టు మాట్లాడింది ఆమె క్రిష్టియన్ మతం కూడా పుచ్చుకున్నట్టు తెలిసింది. ఆమెకు ముంగేరు రావటము ఏమీ యిష్టం లేదు 'నన్ను వదిలివేయండి. ఆమిటమ్ దొరతో కలకత్తా వెళ్ళిపోతాను ముంగేరు పంపచూశారో, ఆత్మహత్య చేసుకుంటాను' అంటున్నదామె ఆమిటమ్ దొర మన ముస్లిం ఖడ్గాలకు ఎర అయ్యాడన్న సంగతి కూడా ఆమె గుర్తించటం లేదు అతడి మీది ప్రేమకొందికి ఆమెకు కొంచెం మతి చలించిందని కూడా నా అనుమానము ఇదీ పరిస్థితి ఆమెను ముంగేరు పంపాలో, ఇక్కడే వుంచాలో, లేక వదిలివేయాలో అంతా మీ ఆజ్ఞల ప్రకారం నడుచుకుంటాను "

* * *

దలనీబేగమ్ చాలా దురదృష్టజీవి. దుర్మార్గుడూ, జిత్తులమారీ అయిన మహమ్మద్ తకీ ఆమె భవిష్యత్తును అంధకారమయం చేసేందుకు నవాబుకు అబద్ధాలతో, అసత్యాలతో కూడిన వుత్తరం పంపే సమయంలోనే, ఆమె ఒక పీడకల కని అదిరిపడి లేచికూచున్నది. ఆమెకు ఒక పక్కగా, గుహముందున్న కొండ మీద, బ్రహ్మచారి వేషంలో వున్న చంద్రశేఖరుడు కనిపించాడు.

ఆమె అతణ్ణి చూస్తూనే భయపడిపోయి, అంతలోనే ధైర్యం తెచ్చుకున్నది.

చంద్రశేఖరుడు నవ్వుతూ, "భయపడకు బేగం. నేను మా గురువైన రామానందస్వామి ఆజ్ఞ ప్రకారం నిన్నీ సురక్షిత ప్రదేశానికి చేర్చాను. ఇప్పుడు నీ కెక్కడికి వెళ్ళా లని వున్నది?" అని అడిగాడు.

ఆ ప్రశ్నతో దలనీకి ఎక్కడలేని ధైర్యము కలిగింది. "నన్ను, తమకు వీలైతే — నవాబు వద్దకు చేర్చండి" అన్నది దలనీ.

"ఇప్పుడు నువ్వు నవాబు దగ్గిరకు వెళ్ళటం క్షేమంకాదు" అన్నాడు చంద్రశేఖరుడు ముక్తసరిగా.

"ఎందుకనీ?" అన్నది దలనీ ఆశ్చర్యపడుతూ.

"నేను అశుభం శంకిస్తున్నాను. నవాబుకూ, అంగ్లేయులకూ యుద్ధం ప్రారంభమయినట్టే. ఆయన నగరంలోని జనాన్ని, సహిదాస్ కోటకు పంపేస్తున్నారు" అన్నాడు చంద్రశేఖరుడు.

"ఏది ఎలా జరిగినా నేను నావాబు దగ్గిరకే వెళ్ళా లనుకుంటున్నాను. ఆయన సన్నిధిలో నాకు మరణమే ప్రాప్తిస్తే, అంతకన్న నాకు ఆనందం కలిగించే దేముంటుంది!" అన్నది దలనీ.

చంద్రశేఖరుడు మరే అభ్యంతరం చెప్పకుండా లేచి నిలబడి, "అయితే బయలుదేరు. నేను నిన్ను ముర్షీదాబాదులోని రాజోద్యోగి మహమ్మద్ తకీ దగ్గిరకు పంపుతాను. అతడు నిన్ను బహుశా, నవాబు దగ్గిరకు పంపవచ్చు. కాని, నాకు తోస్తున్న దేమిటంటే, నీకు ముంగేరు చూసే అదృష్టం లేదని" అంటూ బయలుదేరాడు.

చంద్రశేఖరుడు, దలనీ బేగంను ముర్షీదాబాదు తీసుకుపోయి, మహమ్మద్ తకీ కింది ఉద్యోగుల్లో ఒకణ్ణి కలుసుకుని, దలనీని తకీ దగ్గరకు తీసుకుపోవలసిందిగా చెప్పి, తనదారిన తాను వెళ్ళిపోయాడు.

దలనీబేగం, తన మందిరంలోకి ప్రవేశించగానే మహమ్మద్ తకీ ఆమెకు ఎదురువచ్చి తీసుకుపోయి, కూర్చోవలసిందిగా ఒక ఉన్నతాసనం చూపించి, "బేగం! నవాబుగారి ఫర్మానా యింతకు ముందే అందింది. మిమ్మల్ని ముంగేరుకు పంపవద్దనీ, యిక్కడే విషం యిచ్చి చంపమనీ ఆయన ఆజ్ఞ యిచ్చారు," అన్నాడు విచారంగా ముఖం పెట్టి.

ఈ వార్త వింటూనే దలనీ నిశ్చేష్టురాలైంది. ఇది పిడుగువంటి వార్త. యిలా ఎందుకు జరిగింది? దలనీకి హఠాత్తుగా ఒక ఆలోచన కలిగింది. ఇదంతా తకీ ఆడుతున్న కపటనాటకం ఎందుకు కాకూడదు?

"నవాబుగారు నాకు విషం యిచ్చి చంపమన్నారా! ఏదీ ఆ ఫర్మానా?" అన్నది దలనీ.

తకీ ముసిముసి నవ్వులు నవ్వుతూ దుస్తుల్లోనుంచి ఫర్మానా తీసి దలనీబేగంకు యిచ్చాడు. ఆమె ఆ ఫర్మానాను వణుకు తున్న చేతులతో అందుకుని చదివింది: 'దలనీని ముంగేరుకు పంపవలసిన అవసరం లేదు. విషం యిచ్చి ఆమెను అక్కడే చంపివేయండి '

అది నవాబుగారు స్వదస్తూరితో రాసి పంపిన ఫర్మానా. అందులో మోసంలేదు. దలనీ నేత్రాలు అశ్రుపూరితా లయ్యాయి. తనభర్త, తను దేవుడిలా పూజించేవ్యక్తి, తనను చచ్చిపొమ్మని ఆజ్ఞాపిస్తున్నాడు. దీనికి వెనకవున్న కారణా లేవయితేనేం? తన భర్త ఆజ్ఞను శిరసావహించటం, పత్నిగా తన ధర్మం.

"విషం ఎక్కడ ?" అని అడిగింది దలనీ.

"నిజంగా విషం తాగుతావా, బేగం?" అన్నాడు తకీ ఆశ్చర్యపోతూ.

"అవును. అది నాభర్త ఆజ్ఞ. నవాబుగారి ఆజ్ఞ," అన్నది దలనీ.

"మీ రంత పని చెయ్యకండి. నవాబు మీర్ కాశింగారి పరిస్థితేం బావోలేదు. ఆంగ్లేయులతో యుద్ధం ప్రారంభమయింది. కటిహారులో జరిగిన పోరులో మీర్ కాశిం వాళ్ళ చేతుల్లో చావుదెబ్బ తిని తిరోగమిస్తున్నాడు. మీరు తొందర పడకండి. మీర్ కాశిం, వట్టికాశిం కావచ్చు; యీ మహమ్మద్ తకీ, మీర్ మహమ్మద్ తకీ కావచ్చు !" అన్నాడు తకీ.

ఆ మాటల్లోని వ్యంగ్యాన్ని గ్రహించిన దలనీబేగం ఆసనం మీదినుంచి బెబ్బులిలా లేచి, "నీచుడా ! నీవనే దేమిటి ? నే నెవరనుకున్నావ్ ? పో, యిక్కడ్నించి," అన్నది రౌద్రంగా.

మహమ్మద్ తకీ ఆ మాటలతో పిల్లిలా అయిపోయి, "బేగం ! మీరు తొందరపడకండి," అంటూ గదినుంచి జారుకున్నాడు.

దలనీ తనకోసం తకీ ఏర్పాటుచేసిన కరీమన్ అనే దాసీదాన్ని పిలిచి, తన మెడలోని నగలన్నీ దాని కిస్తూ, "కరీమన్ ! యిప్పుడు నువ్వే నాకు శరణ్యం. ఈ నగల్లో సగం నువ్వుంచుకుని, తక్కిన సగం ఏ హకీంకైనా యిచ్చి, నాకు తిరిగి మెలకువరాకుండా నిద్ర వచ్చే మందు తెచ్చిపెట్టు," అని కళ్ళనీళ్ళతో వేడుకున్నది.

దాసీ కరీమన్ ఎంతో అనుభవజ్ఞురాలు. దానికి దలనీబేగం బతికివుంటే ఎన్ని దురవస్థల పాలవుతుందో అర్థమైపోయింది. ఆకారణంగా కరీమన్ తనెరిగివున్న మీర్జాహబీబ్ అనే హకీందగ్గరకు పోయి, అతడికి ముట్టచెప్పవలసిన ధనం ముట్టచెప్పి, అత డిచ్చిన విషం తెచ్చి దలనీబేగంకు యిచ్చింది.

దలనీబేగం నిర్వికారంగా ఆ విషాన్ని ఒక చిన్న పాత్రలో పోసి, తన భర్త మీర్ కాశింను తలచుకుంటూ ఒకేగుక్కతో విషపాత్రను ఖాళీచేసింది.

దీపాలు కదలటం కిటికీలోంచి చూసింది నేరేడుచెట్టుదగ్గర ఏదో తవ్వటం విన పడుతోంది. ఎప్పటికీ ఆ దీపాలు ఆర్ప టం లేదు ఈరోజు లాభంలేదు అను కుని విచారంగా మంచం పెట్టెమీద ఒరి గింది వరలక్ష్మి

నాగసుందరికి తెల్లవారు జామున మెలకువ వచ్చింది కల్లో కనపడ్డ రాజ కుమారుడు వచ్చి వెళ్ళిపోయాడేమో నన్న భయంతో గది అంతా వెతికింది వయ్యారంగా అద్దంముందు నిల్చుని వళ్లు విరుచుకుంది రాత్రిళ్లు అద్దంచూసుకుంటే రాక్షసులు వెంట పడతా రని అమ్మమ్మ చెప్పేది అనుకుని అద్దం చూసుకోకండా పమిట సర్దుకోవటం, జడ ముందుకు లాక్కొని, రెండోభుజంమీదకి వేసుకు. దూరంగా దిగిపోయే చంద్రబింబాన్ని చూస్తూ, పుస్తకాల్లో చదివినట్టు, సినిమాల్లో చూసినలా నిట్టూర్పులు విడుస్తూ మళ్లా మంచంమీద పడిపోయింది

ఎవరో మెల్లిగా తలుపు తట్టిన శబ్దం అవుతోంది లేచి తలుపు తియ్యా లను కుంది మళ్ళా మాగన్ను పట్టేసింది పడుకున్న మంచం కిటికీదగ్గరగా వుంది. ఎవరిదో చెయ్యి కిటికీలోంచి తన జుట్టుని సవరిస్తోంది, నుదురు, బుగ్గలు, అబ్బా చూ సేందుకు సిగ్గు వేస్తోంది తప్పకండా రాత్రి కల్లో వచ్చిన రాజకుమా రుడే అయి వుంటాడు తన చెయ్యి చేతిలోకి తీసు కుంటున్నాడు ఈసారి కొద్దిగా కళ్ళు తెరచింది నాగసుందరి దుప్పటి ముసు గులో మొహం గుర్తు తెలవటంలేదు. ఐనా ఎప్పుడూ రాజకుమారులు మారు వేషంలో తప్ప రారన్న సంగతి గుర్తు కొచ్చింది కొద్దిగా కిటికీదగ్గరగా జరిగింది

వసంతలక్ష్మి లేచి మళ్ళా అటూ ఇటూ తిరుగుతోంది. చెల్లెలి మంచం పక్క ఆకారం కంటపడి దొంగని పట్టు కోవా లన్న హడావిడిలో దీపం పెద్దది చేసి తలుపు తెరచింది అ ఆ కా ర ం రాఘవయ్య పెరట్లోకి తప్పుకుని తలుపులు మూసుకుంది చేసేదిలేక వసంతలక్ష్మి ఇంటితలుపులు వేసి చెల్లెల్ని లేపింది.

'ఎప్పుడూ నిద్రపోకండా పిశాచంలా తిరక్కపోతే పడుకోరాదు. ఏం కొంప మునిగిం దని వచ్చావు' అని అప్పగారి మీద విసుక్కుంది నాగసుంధరి.

'ఆఁ, నేను రా క పో తే కొంపే మునిగేది ఆ దొంగాడు ఎత్తుకెళ్ళేవాడు' అని హేళన చేసింది వసంతలక్ష్మి

'అంత అదృష్టమే పడితే ఇంకేమి కావాలి! హాయిగా వెళ్ళి పో దు ను అయినా నువ్వు చూస్తూ వూరుకోవుగదా! ఖర్మ' అంటూ చేతి గాజులు చూసుకుంది వక్కటీ మిగల్లేదు నాగసుందరికి

'ఏదీ చెయ్యి, గాజులు పట్టుకెళ్ళాడు రాజకుమారుడు' అంటూ వెటకారంగా నవ్వింది వసంతలక్ష్మి

వాళ్ళ సంభాషణ పెరక్కుండానే పెరట్లో పెద్ద చప్పుడయింది ఎక్కడో వెల్తురు వస్తోంది నారాయణ కంఠం పెద్దగా వినపడుతోంది

అక్కాచెల్లెళ్లు ఇద్దరూ ఏకమయ్యారు చెరో దీపం పట్టుకు పెరట్లోకి వెళ్ళారు దూడల పాక మండిపోతోంది ఆవుదూడ లరుస్తున్నాయి వసంతలక్ష్మి చొరవచేసి పాకలోకి వెళ్ళి దూడల్ని విప్పింది వచ్చిన జనంలోంచి ఒక యువకుడు వెళ్ళి వసంతలక్ష్మిపై మండుతున్న నిట్రాడు పడకుండా ఇవతలికి లాగాడు

నారాయణ చేత దెబ్బలు తిన్న స్వామీజీ అవయవాలు స్వాధీనం తప్పి కిందపడి మూలుగుతున్నాడు నారాయణ నీళ్ళు తెచ్చి మంటలమీద పోస్తున్నాడు అంతా కలిసి ఎల్లాగో తెల్లారేసరికి మంటల్ని చల్లార్చారు

రాఘవయ్యకి నారాయణమీద పగ తీర్చుకొనేందుకు అదను దొరికింది రామచంద్రయ్య వదిలాడు కదా అనుకుంటే వీడు అంతకంటే ఎక్కువగా ఆ కొంపని కాపలా కాస్తున్నాడు వీడిని ఇప్పుడు పట్టిస్తే ఇంక తనకి అడ్డు ఎవరూ వుండరు అన్న ఆలోచన తట్టగానే నిమిషాలమీద మనుష్యుల్ని పంపి పోలీసుల్ని పిలిపించాడు. నారాయణమీద వాళ్ళకి చెప్పవల్సినవన్నీ చెప్పి మరీ ఇంట్లోకి పిల్చుకెళ్ళాడు. స్వామీజీని చూపెట్టి కళ్ళు వొత్తుకున్నాడు పోలీసులు రెండు ఇళ్ళూ చూడ్డంలో రాఘవయ్య దొడ్లో తవ్విన గొయ్యి కనపడింది కొంచం పక్కగా విరిగిపోయిన కుండా, పేలిపోయిన తూటాలు, పేలని తూటాలు పడి వున్నాయి

రాఘవయ్య ఇదంతా ఆ నారిగాడిపనే నండీ అంటూ గుండెలు బాదుకున్నాడు పోలీసులముందు రాఘవయ్య పాలేరు కుట్టాడు పరుగెట్టుకుంటూవచ్చి తూటాల్ని ఏరుకోబోయాడు పోలీసు బెదిరింపుతో ఆగి, 'అయి నేనే దాచుకున్నానండీ మా అయ్యకి తెలిస్తే తంతాదని ఈడ భూమిలో దాచి పెట్టానండీ, పున్నానికి ఎలిగించుకుందాముగదా' అని చెప్పాడు రాఘవయ్య నోరు మూసుకోమని 'పాలేర్నికసిరి వాడికేంతెలీదండీ, అంతా ఆ నారిగాడిపనే అసలు నా కొంపకే పెడదా మనుకొని వుంటాడు' అంటూ ఇంకా నమ్మించేందుకు ప్రయత్నిస్తున్నాడు

వూరి మునసబు రాపటంతో అంతా తలోటి చెప్పుకుపోతున్నారు మునసబు తిన్నగా సీతారావమ్మ దగ్గర కెళ్ళి కుశల ప్రశ్నలడిగి సంగతులు తెలుసుకున్నాడు. వసంతలక్ష్మి రాత్రి తను చూసిందంతా చెప్పి, 'చెల్లెలి చేతిగాజులు తీసుకున్న మనిషి రాఘవయ్య ఇంట్లోకి వెళ్ళడం చూశా' నంచి మన్సబు వెళ్ళాక అప్ప గార్ని చెల్లెలు కోప్పడింది 'ఆ గాజుల మాట ఎందుకే చెప్పటం' అని




"ఆఫీసు లో ఏదో వెలగబెట్టా నని చెవుతారు, వంకాయలబేరం చెయ్యటంకూడా రాదు మీకు "

'సంతోషించు, ఇంకా అమ్మకి చెప్ప నందుకు లేకపోతే ఈపాటికి చీల్చి ఎండేసేది' అని వసంతలక్ష్మి చెల్లెల్ని బెదరగొట్టింది

మున్సబుకి రాఘవయ్యమీద వున్న పగ తీర్చుకోవా లంటే అంతకన్నా మంచి సమయం దొరకటం కష్టం. 'అమ్మాయి గాజులు తీసుకు మీ పెరట్లోకి జారుకున్నాడట. ఎవడో తెలిస్తే చెప్ప రాదూ?' అని రాఘవయ్యని గట్టిగానే అడిగాడు

రాఘవయ్య కొడుకు చంద్రానికి ఈ గొడవంతా అర్థంకాక అప్పటినించీ చూస్తున్నవాడు గాజులప్రశ్న రాగానే 'స్వామీజీ ఆసనంకింద ఇందాక నాకు గాజులు కనపడ్డాయి' అని చెప్పేశాడు

'ఏమిట్రా ఆ వాగుడు. పెద్దా, పిన్నా ఏమి తెలియకుండా వుందే? ఆయనకి దేనికిరా?' అంటూ పళ్ళు కొరుకుతూ చంద్రంకేసి చూశాడు రాఘవయ్య

'చూసింది చెప్పాడు. పిల్లాడ్ని అడి పొయ్యక' అంటూ రామి తీర్పులోకి వచ్చింది

అప్పటిదాకా వూరుకున్న ఇన్‌స్పెక్టర్ 'చూడు మిస్టర్, ఆ ఆసనంకింద చూడాల్సిన పనేమివచ్చింది మీకు' అని చంద్రాన్ని అడిగాడు

'ఆ. ఏం వుంటుందీ, ఏ అగ్గిపెట్లో చుట్ట ముక్కో రహస్యంగా తీద్దామనివుండొచ్చు' అంటూ నవ్వుతూ చంద్రంకేసి చూశాడు మున్సబు

'అంతే' అన్నట్టు తండ్రి చూడకుండా చంద్రం నవ్వుతూ తలవూపాడు

'ఐతే ఈ స్వామీజీకి పొగ తాగడం కూడా అలవాటు వుందేమిటీ' అనిపోలీసు ప్రశ్న వేశాడు. అంతా మెప్పుకోవాలని

వీళ్ళు ఈ సందడిలో వుండటంచూసి స్వామీజీ మెల్లిగా జారుకున్నాడు పెరటి తలుపు తెరచివుంది ఆసనం వున్నగది ఇంటి ముందుభాగంలో వుండటంవల్ల తరవాత చూసుకోవచ్చు అనుకుని ముందు బైటపడి వుంటాడు అనుకున్నారు అక్కడ చేరినవాళ్ళు.

రాఘవయ్య కోపం తారాపథం చేరింది. 'స్వామీజీని పట్టించేందుకుకాదు మిమ్మల్ని పిలిపిస్తా. వాడిసంగతి కనుక్కోండి ముందు' అంటూ నారాయణకేసి వురిమి చూశాడు

స్వాములవారి ఆసనం పదిలంగా ఎత్తిచూశారు కొన్ని వస్తువులు, డబ్బు, వాటి రక్షణకోసం కొన్నికత్తులూ, చిన్న సంచినిండా భస్మాలు దొరికాయి పోలీసులు వెతికేందుకు వెళ్ళారు.

'వూరిచివర ఆలచ్చి గుడిసెలో దాక్కుంటాడు సూడమనండి' అని నారాయణ చెప్పాడు మున్సబుకి.

'అసలు నువ్వు ఎందుకురా ఆయన్ని కొట్టావు' అని చంద్రం అడిగాడు నారాయణ్ణి

'అసలు మొదటినుంచీ మంటేనండి ఆయన్ని చూస్తేను మా అయ్యగారికి ఎట్టి ఎత్తించింది ఈయనేగదండీ నిన్నేమొ లచ్చికాడ చెపుతున్నాడంట సిన్న అమ్మాయిగార్ని తీసుకెళ్ళేందుకే రాఘవయ్య ఇంట్లో మకాం పెట్టాడంట ఆ సెప్పటం మా పిన్నమ్మ ఇనిచెప్పింది అందుకే నేను ఈ పెరట్లో పడకుంటుండా నిన్న ఇయ్యాలాను' అని గర్వంగా చెప్పాడు నారాయణ

పోలీసులు అట్టే శ్రమపడకుండా నదిలో స్నానం చేసే రామచంద్రయ్యని పట్టుకువచ్చారు

మున్సబుగుర్తుపట్టి 'అంతమారా వేంటి' అని రామచంద్రయ్యని పరామర్శించాడు

పోలీసులు ఘనంగా చెప్పారు 'వో పట్టాన వచ్చేందుకు ఒప్పుకుంటేనా, పట్టుకు వచ్చేసరికి మా పెద్దలు దిగివచ్చారు.'

'భలేవాళ్ళేవే, ఆయనకాదు తొందరగా వెళ్ళండి వూరుచివర బడ్డీకొట్టులచ్చి కొంపలో సోదా చెయ్యండి' అని చెప్పి పంపారు.

రామచంద్రయ్యకి తన ఇంట్లోకి వెళ్లాలని బుద్ధిపుట్టింది వంటగది గుమ్మంలోకి వెళ్ళేసరికి కాఫీవాసన గుప్ మని వచ్చే




"ఈ నవలకి బొత్తిగా విలువ లేదని మాట్లాడేయకండి ..ఇప్పుడు దీన్ని నేను ఉన్నపళంగా వీశెలెక్కన అమ్మేయగల్ను...తెలుసా ?"

---

సరికి మరి నిగ్రహంమాట వదిలేసి సీతా రావమ్మ ఎదటపడ్డాడు.

చిక్కిపోయిన రామచంద్రయ్యని చూసి మాటలురాక కాఫీగ్లాసు అందించింది

ఏ స్థలంలో సన్యసించాడో మళ్ళా అక్కడే కాషాయబట్టలకి స్వస్తిచెప్పి సీతారావమ్మ కొంగుతో ముఖం తుడుచుకుంటూ తనకి ఇష్టమైన వంటకాలు చేసి పెట్టమని పసివాడిలా ఏకరువు పెట్టుకుంటున్నాడు

రాఘవయ్య తన డబ్బు వున్న తోలు సంచీ కనపడలేదని నెత్తి బాదుకుంటూ 'ఎంత మోసం ఎంత మోసం' అంటూ పిచ్చిగా అరుస్తున్నాడు.

పోలీసులు చెయిజారిపోయిన సన్యాసి కోసం వెతుకుతామని, కమ్మగా ఫోంచేసి కేసు రిజిష్టర్లో ఎక్కించుకుంటామని చెప్పివెళ్ళారు

రామచంద్రయ్య రాఘవయ్యని వోదార్చి ఆదరించి కొంతకాలం తనింట్లో ఆతిథ్యం ఇచ్చాడు

రాఘవయ్యలో మరుగుపడ్డ విషపు ఆలోచనలు మళ్ళా నెమరుకి రాక మునుపు ఒక్క ఆలోచన వచ్చింది అతని జీవితంలో అంత మంచి ఆలోచనకి అదే మొదటి క్షణం. 'చంద్రానికి

మీ పిల్లని ఇవ్వరాదూ ?' అని పైకి అడిగే శాడు.

రామచంద్రయ్యకి ఈ ఆరునెలల్లో అలవడ్డ గొప్పగుణాల్లో నిర్లిప్తత ఒకటి. అందుకే ఆ ప్రశ్నకి ఎక్కువ ఆనందం చూపెట్టలేకపోయాడు. పైగా 'ఘటన వుండాలి, మనది ఏమివుంది ?' అనితేల్చి వేశాడు.

పక్కగదిలోనుంచి వింటూవున్న సీతా రావమ్మ 'వారి మాట లంతేలే అన్నయ్య. నీకు ఏ పిల్లని కలుపుకోవా లని వుంటే దాన్నే కలుపుకో'మని చెప్పింది.

మున్సబుపెద్దపిల్లకి మనువుతెచ్చాడు; 'ఆరోజు మంటల్లోంచి ఇవతలికి లాగేదే ఆ అబ్బాయేట; పిల్ల నచ్చిందని వాళ్ల వప్పుకుంటే చేసుకుంటా నని మా అల్లుడికి వ్రాశాడు. పెద్దచదువు చదివాడులే. ట్రయినింగ్ అయి వచ్చాడుగా ; కలెక్టరు పని వస్తుందిలే' అని రామచంద్రయ్యకి చెప్పాడు.

సీతారావమ్మ వెంటనే వప్పేసుకో మని చెప్పించింది.

ఇద్దరి కూతుళ్ళని వెతుక్కుంటూ వచ్చిన అదృష్టాన్ని తల్చుకు మురిసి పోయింది సీతారావమ్మ.

రామచంద్రయ్య ఎటూ చెప్పలేదు. 'ఘడియ వచ్చింది. అయింది' అని ఒక్క మాటతో తేల్చేశాడు.

అల్లుళ్లు ఇద్దరూ నట్టింట్లో తిరుగు తూంటే సీతారావమ్మ ఆనందానికి అంతు లేకండా వుంది.

'వసంతలక్ష్మి చెల్లెల్ని మీ రాజకుమా రుడు గాజులు తిరిగి ఇచ్చాడా ?' అని నవ్వుతూ అడిగింది.

'మీ వీర పురుషుడు కోసం మళ్ళీ ఏ కొంపేనా అంటుకుంటే దూరకేవు' అని చెల్లెలు సమాధాన మిచ్చింది.

'ఇంక వూరుకోండబ్బా మీ దెప్పుకోవ డాలు. వాడు దొంగో సన్యాసో ఎవరైతే ఏంగాని. మీ ముగ్గురికీ ఎక్కించిన వెఱ్ఱి ఇంత తొందర్లో వదులుతుం దనుకో లేదు. పర్యవసానం ఇంత సుఖంగా తేరుకొంటా మని అసలే ఆశలేదు నాకు' అంటూ తృప్తిగా వూపిరి వదుల్తూ మంచంమీద కూర్చుంది సీతారావమ్మ.

'మీ అందరి మాటలకేంగాని, మన నారిగాణ్ణి వో ఇంటివాణ్ని చెయ్యాలి. వాడి రుణం నే నెప్పుడూ తీర్చుకోలేను. నా సన్యాసి ఆశ్రమంలో సుష్టుగా భోజనం అందించేవాడు. అల్లా జరిగి వుండక పోతే మళ్ళా మిమ్మల్ని చూసేవాణ్ణే కాదేమో నంటూ సీతారావమ్మ పక్కన మంచంబద్దీమీద కూర్చున్నాడు రామ చంద్రయ్య.

ఎల్లా పంపాడు. ఎవరు తెచ్చా రన్న ప్రశ్నలు వెయ్యకుండా, చేతికి వున్న కొత్తగాజులు, కట్టుకున్న పట్టుచీర కుచ్చెళ్ళూ చూసుకుంటూ అక్కడనించి వెళ్ళిపోయారు అక్క చెల్లెళ్లు.

---

# చక్రనేమి

## కోడూరి కౌసల్యాదేవి

జ రి గి న క థ

*[శ్యాంసుందర్ నల్పిన దురాగతాలన్నీ తెలుసుకొని అనంతయ్యగారు వాడిని ఇంటి నుండి వెళ్లగొడుతాడు ఇంటి పరిస్థితులన్నీ సరిదిద్ది రఘు వెళ్లి పోతాడు పద్మ అకస్మాత్తుగా శ్యాంసుందర్‌తో లేచిపోతుంది ఈ అవమాన భారంతో పాణి ఇంటి నుండి వెళ్లిపోతాడు పరిస్థితుల ప్రభావం అనంతయ్యగారిలో పరివర్తన తెస్తుంది]*

—ఇక చదవండి.

## 58

"వదినా ఏమిటీ దారుణాలు?" వస్తూనే వదినచేతులు పట్టుకుని బావురుమన్నాడు రఘు జానకమ్మా, ఇందిరా ఘొల్లుమన్నారు

మాధవి ఏ ఆవేశాన్నీ వ్యక్తపరచలేదు అలాగే శిలలా నిలబడి పోయింది, శూన్యమైన దృక్కులతో

శోకావేశం కొంత ఉపశమించాక రఘు పాణి తనకు వ్రాసిన ఉత్తరం తీసి చూపాడు

"రఘూ,

ఈ లెటరు చూచి ఖంగారుపడకు. మన ఊరు వెళ్ళు విల్చున్న పొలంగా, అమ్మనూ, ఇందిరనూ నీతో తీసుకుపో ఇక ఈ సంసారబాధ్యతంతా నువ్వే వహించాలి నేనెందుకూ అసమర్థుడ నని నిర్ణయించుకున్నాను. నే నేదో ప్రాణాలు త్యజించాలనీ ఏదో అయిపోయాననీ బాధపడకు అలా అయిపో నని నీకు మాట ఇవ్వడంలేదు కానీ అవ్వాలనిమాత్రం అనుకోవడంలేదు

రఘూ! నాకు పద్నాలుగేండ్ల వయస్సులో నాన్నగారు మరణించారు. సరదాలూ, బాల్యమూ పూర్తిగా తీరని వయస్సు, తెలిసీ తెలియని లోకం, అప్పటికే

ఆయన దురభ్యాసాలూ, నిరంకుశ — చెడుప్రవర్తనలూ నాలో చెరగని ముద్ర వేశాయి. ఆయన మరణంతో, బాధ్యత పైన పడడంతో నా సంతోషం మరింత చచ్చిపోయింది. సరే, ఎన్నోకష్టాలుపడి చదువుకున్నాను. మిమ్మల్ని చదివించాను; నీకూ తెల్సు; నాది చిన్నప్పటినుండీ ఇలా కష్టాల బ్రతుకే అయ్యింది. ఒక్కొక్క సంతోషసంఘటన, దానివెనుకనే ఆ సంతోషాన్ని నిలువునా సమాధి చేసే అనేక కష్టాలు, పరంపరలు తరుముకురావడం. నిరంతర ప్రశాంతిని కోరుకొనే మనస్సు—దానికి పూర్తిగా విరుద్ధమైన జీవితం నన్ను రంపపుకోత పెడ్తున్నాయి. ఈ కృత్రిమ కల్మష వాతావరణంలో నిలువలేకుండా వున్నాను. నాతోపాటు దేవలోక సరస్సునందలి దేవపూజిత స్వర్ణకమలం వంటి మీ వదిన కూడ ఈ కష్టా లనుభవిస్తూ హీనుల హేళనావమానాలకు గురికావడం నా కిష్టంలేదు. అందుకే నా ఈ అజ్ఞాతవాసం.

కేశవరావుగారిని కలిసి విషయాలన్నీ చెప్పి బిందుకు తిరిగి యథాపూర్వ సుఖ సంతోష జీవితాన్ని కలిగించేందుకు ప్రయత్నించమని చెప్పు. నా విషయా న్నొక పీడకలలాగా విస్మరించమన్నా నని నా మాటగా చెప్పు. బిందును ఓదార్చు.

నాకు తెల్సు, నువ్వు ధైర్యవంతుడవు, ప్రయోజకుడవు. దిగులుపడకు. మన యింటిని అమ్మడానికి నీకు అధికారపత్రం వ్రాసి ఉత్తరంతోనే పంపిస్తున్నాను. బ్యాంక్‌లో నా పేరనున్న మూడువేలూ నీకు ట్రాన్స్‌ఫర్ చేశాను. ఇల్లు అమ్మితే ఒక ఏడెనిమిది వేలు వస్తుంది. ఆ డబ్బుతో ఇందిరకు మంచిసంబధం చెయ్యి. సరే, నీకు నీ చదువే వున్నది. అమ్మను జాగ్రత్తగా చూడు.

ఒక్కమాట రఘూ. పద్మ ఇంట్లోనుండి వెళ్ళిపోయింది. అయినింటి ఆడపిల్ల చేయకూడనిపని చేసింది; ఇంట్లోనుండి వెళ్ళకూడని విధంగా వెళ్ళింది. ఇది భరించరాని అవమానమే. కాని దానిపై కోపం తెచ్చుకోకు. తప్పు దానిదికాదు. సరిగా పెంచలేని అమ్మది — దాని విషయం పట్టించుకోని మనది. ఒకవేళ పద్మ ఎప్పుడైనా ఇంటికి తిరిగిరావడం సంభవిస్తే దానిని నిరాదరించవద్దు, త్యజించవద్దు. నీ ఇంట్లో ఎప్పటిస్థానం కల్పించి ఆదరించు. నా ఈ కోర్కెను త్రోసివేయవుకదూ! నా కోసం వెదకి నష్టపోకు. ఆ శ్యాం ఎప్పుడైనా తటస్థపడినా వైరంపెట్టుకోకు.

ఆశీస్సులతో, పాణి."

రెండురోజులుగా నిగ్రహించుకున్న మాధవి దుఃఖం ఈరోజు ఆ జాబు చదవగానే కట్టలు త్రెంచుకున్న వరదవెల్లువై ప్రవహించింది.

ఎంతవిచారంలో ఉన్నా ఎన్ని బాధలతోఉన్నా కాలగతిని గమనించక తప్పదు; కర్తవ్యం విస్మరింప వీలులేదు.

"అన్నయ్య ఎక్కడో సురక్షితంగానే వుంటాడనీ, తిరిగి ఎప్పటికైనా కలుసుకోగలమనీ నాకు చాలా ధైర్యంగా వుంది వదినా," అన్నాడు

"అవును" గంభీరంగా అంది మాధవి "నేనూ అలాగే ఆశిస్తున్నాను అయినా కాకపోయినా ఈ ఆశాభావమే కదా మానవ జీవితానికి పట్టుగొమ్మ ?"

"ఏం చేద్దాం ఇప్పుడు ?" అడిగాడు రఘు

"మీ అన్నయ్య సూచించినట్లే వైజాగ్ వెళ్ళిపోదాం, కాని ఒక్క కోరిక రఘూ, మన్నిస్తారా ?"

"ఏమిటి వదినా ?"

"నాకు మావాళ్ళింటికి వెళ్ళడం ఇష్టంలేదు వాళ్ళను ప్రాధేయపడడం ఈ జన్మలో జరగదు నేనూ చదువుకున్నాను ఎవ్వరికీ భారమవ్వ ననుకుంటాను "

"వదినా," ఆవేశంగా బాధామిశ్రిత స్వరంతో అన్నాడు రఘు. "నాకు అమ్మ ఎంతో నువ్వంతకాదా ? ఇలాగ మరెప్పుడూ మాట్లాడనని మాట యియ్యి నిన్ను ఆజన్మాంతం నెత్తినపెట్టుకు పూజిస్తాను అన్నయ్య ఏదో అలా వ్రాశాడు కాని, అంత అభిమానం లేనివాళ్ళమా ? మా ఇంటికోడలి వైనందుకు వైరం బూనినవారిని ప్రాధేయపడటమా ?"

"మరి అన్నయ్య కోసం, అక్కయ్య కోసం వెదకించవద్దా చిన్నన్నయ్యా," దీనవదనంతో అడిగింది ఇందిర

"ఎక్కడని వెదికిస్తాం ? ఏ విధంగా ? వెదకించడానికి వాళ్ళు తప్పిపోయిన వాళ్ళు కాదు కావాలని వెళ్ళిపోయినవాళ్ళు వాళ్ళు తిరిగి రావాలనిపించి రావాలే గాని మన దర్యాప్తులకు అందరు ఎప్పుడో వస్తారు ఇప్పటి ఆవేశాలు ఎప్పుడూ వుండవు కాలగతితో బాటు వాళ్ళ భావాలూ మారతాయి అయినా పేపర్లో ప్రకటన వేయిద్దాం, తప్పక రమ్మనీ, అభిమాన పడవద్దనీ "

"అవును అలా చేద్దాం " మాధవీ, జానకమ్మా ఆమోదించారు

"ఇల్లు అమ్మకం తర్వాత మెల్లగా ఔతుంది మనం ఇప్పుడే వెళ్ళిపోదాం ఇక ఈ ఊళ్ళో ఒక్క రోజుకూడా వుండలేం," అంది మాధవి

"సరే అలాగే చేద్దాం సామానంతా సర్దివేయండి "

ఎవరి మట్టుకు వారు లోలోపల దిగ్భ్రమిల్లిపోతూ, మిగిలిన వారు అధైర్యపడకుండా వుండాలని అపారమైన నిగ్రహ ధైర్యాలను ప్రదర్శిస్తున్నారు పైకి

"వదినా," మందస్వరంతో అన్నాడు రఘు "జరిగిన విషయాలు కనీసం వారికి ఎరుక పరచడం మన బాధ్యతేమో ?"

"ఎవరికి ?"

"మీవాళ్ళకు."

"అక్కర్లేదు. ఎవరు ఉద్ధరించేదీ ఏమీ లేదు ఇందులో," కఠినంగా జవాబిచ్చింది మాధవి.

రఘు మరి మాట్లాడలేదు. కాని లోలోపల అనుకున్నాడు. 'జీవితంలోని నిష్ఠుర సత్యాలు మనస్సులోని మృదుత్వాలను మాపేస్తాయి."

అంతలో గుమ్మం ముందు ఆగిన కారునుండి అనంతయ్య కుటుంబమంతా దిగుతూండడం చూచి ఎవరి మట్టుకు వారే ఆశ్చర్యంతో నిల్చునిపోయారు. జరిగిన విషయాలను లజ్జావమానాలతో ముఖాల మాటులోకి క్రుంగిపోయాయి. వచ్చిన



వారి వదనాలు కూడ విచారంగానే వున్నాయి.

"బిందూ !'' అని పిలపిస్తూ చేతులు చాచి ముందుకు వెళ్ళింది ఒడిలక్ష్మి. కాని బిందు ఆ చేతులలో వాలిపోలేదు.

"నీ కెంత కష్ట మొచ్చింది తల్లి" అన్నాడు అనంతయ్య కుమార్తె శిరస్సు నిమురుతూ. మాధవి కన్నెత్తి చూడలేదు.



"బిందూ'' అని అన్నయ్యా, వదినా దరిజేరారు సానుభూతి వర్షిస్తూ బిందు ఆ పిలుపును విన్నట్లే లేదు.

"ఏం తల్లీ నామీద కోపమా ?'' అన్నాడు అనంతయ్య కుమార్తె చుబుకం పట్టుకొని.

మందంగా, నిశ్చలంగా, నిర్మలంగా చెప్పింది మాధవి, "నేను కళకళ లాడుతూ ఆనందంగా సంసారం చేసినవాడు మీరు చూడలేకపోయారు ఇవ్వాళ మోడువారిపోయి శిలనైన నన్ను చూడవచ్చారు పాషాణానికి మనస్సుంటుందా ? మాటలు వస్తాయా ? చూచారుగా, వెళ్ళండి "

"బిందూ'' గాద్గదికంగా అన్నాడు అనంతయ్య "జరిగింది మరచిపో తల్లీ నా అపరాధాన్ని క్షమించు. నువ్వు వెళ్ళిన దగ్గర్నుంచి నాకు సుఖశాంతులు లేవమ్మా నిన్ను కంటికి రెప్పగా చూచుకుంటాను, మరి మాట్లాడకు, రా ''

కేశవ్ అన్నాడు, "నీ మనస్సు మారా లని చూచారుకాని నాన్నగారికి నీ మీ దెన్నడూ కోపంలేదు బిందూ. అలా నిరసించకు. బావగా రెక్కడున్నా వెదకి తెస్తాం."

"బిందూ" ఆదిలక్ష్మి కుమార్తెను దగ్గరగా తీసుకుని కన్నీరు కార్చింది. అల్లుడుగా రెక్కడున్నా వెదకిద్దాం. మీ రందరూ కూడా వచ్చి అక్కడే వుండండి. ఆయన రాగానే మళ్ళీ వచ్చేద్దురుగాని. పద్మకోసంకూడా వెతకిద్దాం. ఇక్కడుండలేరు మీ రిక. అక్కడ మీ కేవిచారమూ లేకుండా చూచేబాధ్యత మాది."

"ఇక కోపగించకు బిందూ.'' సరోజని బిందుచేయి పట్టుకుంది అనునయంగా.

మృదువుగా విడిపించుకుంది మాధవి తల్లినుండీ వదిననుండీ.

"నీ మేడలలోనూ మిద్దెలలోనూ నాకు సుఖశాంతులు లభించవు. నా భర్త లేని చోటు ఏదైనా నాకు వల్లకాడే. ఆయనతో వివాహ మైనదిగా మాపై వైరం పూని మమ్మల్ని ఒదులుకున్నారు. అది లెక్కజేసుకోకుండా నేనూ వారూ వస్తే తీవ్రంగా అవమానించారు. అప్పుడు గడప త్రొక్కవద్దని వెళ్ళగొట్టి ఇవాళ ఒక్కతెనూ రమ్మంటున్నారా ? పుట్టింటికి రావా లని ఏ ఆడపిల్ల కుండదు ?

"ఆయన ఉన్నంతకాలం మా ముఖమైనా చూడని మీ ఇంటికి నే డాయన లేనప్పుడు నేను వచ్చి మీ అండను బ్రతికితే అది ఆయనకు అవమానం కాదా ? నా జీవితంలో ఆయన ప్రవేశంతో ఉద్వాసన చెప్పిన ఆ ఇంట్లో తిరిగి ఆయనతో జంటగానే కాలు పెట్టేది. ఇక మీరు వెళ్ళండి." ముఖం కప్పుకుని రోదిస్తూ తన గదిలోకి పోయి తలుపు బిగించుకుంది.

జానకమ్మ నిశ్శబ్దంగా శోకిస్తూ నిల్చుంది

రఘు మెల్లగా అన్నాడు అనంతయ్యతో. "మితిమీరిన బాధావేశంలో వదిన అలా మాట్లాడ్తూంది మీరు బాధపడకండి. ఆ ఉధృతం తగ్గాక మెల్లగా నచ్చజెప్ప వచ్చు. ప్రస్తుతం మాతోనే తీసుకువెళ్తాను. ఉత్తరాలు వ్రాస్తూంటానులెండి "

"అంతేనా ? '' నిరాశ ధ్వనించింది ఆదిలక్ష్మి కంఠంలో.

"పోనీ మీరైనా నచ్చజెప్పండి అక్కగారూ " అనంతయ్య జానకమ్మ వైపుకు తిరిగాడు

"అందర్నీ వచ్చి అక్కడే వుండమంటున్నాంగా ? ఎన్నాళ్ళోనా ? వారంరోజుల లోగా వెదకి పట్టుకోమ్మూ అబ్బాయిని ? ''

"వద్దు నాయనా వద్దు '' కలవరపాటుతో అంది జానకమ్మ. "నా బుద్ధితక్కువ సలహాలూ, నా అహంకారమే ఇంతవరకూ తెచ్చాయి. నేను మరే విషయంలోనూ కలుగజేసుకో తలచుకోలేదు పిల్లలే తెలివైనవాళ్ళు వాళ్ళమాట వినకే ఇన్ని అనర్థాలు తెచ్చాను బాగా బుద్ధివచ్చింది నాకు" అంటూ లెంపలు టపటపా వాయించేసుకుంది

ఇక ఎంత ప్రాధేయపడినా లాభం లేదని గ్రహించారు అనంతయ్య కుటుంబం వారు

కొంత సేపటికి కేశవరావు అన్నాడు "బావగారూ మా కార్లో వెళ్ళిపోండి వైజాగ్ లారీలూ పంపిస్తాము సామానుకు "

"వద్దు, ఎందుకులెండి '' మృదువుగానే తిరస్కరించబోయాడు రఘు.

"అలాకాదు. ఈ సాయమైనా చేయనీయండి ఇదుగో ఈ డబ్బు కూడా వుంచండి " జేబునుండి చెక్కుబుక్కు తీసి, "ఎంత కావాలంటారు ప్రస్తుతం ? ఓ నాల్గువేలు కావాలా కాపురం మార్చడమంటే చాలా ఖర్చు వుంటుంది మరి ! " అన్నాడు

ఈసారి రఘు ముఖం కఠినంగా మారిపోయింది ''క్షమించండి. వద్దు అన్నయ్య ఇక్కడున్నన్నాళ్ళూ వైరం పూని, అతడు వెళ్ళిపోగానే మనం ఇలా కలుస్తే అది ఎలా ఉంటుందంటారు? అసలు మేమెలా అంగీకరిస్తా మనుకున్నారు? మేము మీ డబ్బును ఆశించేవాళ్ళమే అయితే పరిస్థితు లింతవరకూ రాకపోవునని మీకూ తెల్సు! ఇక నన్ను బలవంత పెట్టకండి. మా మానాన మమ్మల్ని పోనివ్వండి. మా బాధ ఎంతో ఎలా వర్ణించి చెప్పేది."

చెప్పుదెబ్బవంటి ఆ సమాధానంతో అందరినోళ్ళూ మూత పడ్డాయి. స్టేషనుకు

సాగనంప వచ్చినప్పుడు కూడ బిందు ఎవరితోనూ మాట్లాడలేదు. ఒక్క కేశవ రావుకు మాత్రం మౌనంగా నమస్కరించింది కదలిపోయే రైలునుండి

## 59

జానకమ్మ ఇప్పుడు వెనుకటి మనిషికాదు. అంతటి సౌమ్యమూర్తి ప్రపంచంలో ఎక్కడా వుండ దనిపిస్తుంది మాధవిని ఆమె కూతురు ఇందిర కంటె బాగా చూచుకొనసాగింది.

ఇందిరా రఘూ ఆ మార్పుకు సంతోషించినా 'అన్నయ్య ఉండగా యిలా వుంటే ఎంత బాగుండును!' అనుకొనేవారు.

మాధవి పూర్తి గంభీరవ్యక్తిగా మారిపోయింది ఎవ్వరితో మాట్లాడదు ఎంతో అవసరమైతే తప్ప. ఒక పుస్తకమైనా చదువదు ఒక గవాక్షం దగ్గర కూర్చుని గంటలు గంటలు, రోజులు రోజులు గడిపేస్తుంది పుట్టింటికైనా ఉత్తరాలు వ్రాయదు అప్పుడప్పుడు రఘూ, ఇందిరా వ్రాస్తూంటారు

"మరీ అలా దిగులుగా వుండకు వదినా, కొంచం నలుగురితో కలవాలిమరి." అనేవాడు రఘు

ఒక నీరసహాసమే అందుకు జవాబయ్యేది మాధవినుండి

ఎప్పుడైనా రఘు బలవంతంమీద ఇందిరతోనూ అతడితోనూ కలసి సాయం వేళలలో సినీమాకో, వాహ్యాళికో వెళ్ళేది, కాని అవి ఆమెలో తాత్కాలికంగానైనా ఎటువంటి మార్పునూ తేలేకపోయేవి.

పెద్దముత్తయిదువలాగా ప్రతిదినం ఉదయమే లేచి సుస్నాతయై తిరుపతిలో పద్మావతీ శ్రీనివాసుల దంతపు ప్రతిమలను భక్తి శ్రద్ధలతో పూజించేది. తమ ప్రణయానికి ప్రధమ రాగాంకురం వేసిన ఆ దైవాలే తిరిగి తమ జీవితాలను కలిపి చక్కదిద్దా లని ఆమె నమ్మిక

వర్షఋతువు ప్రవేశించింది తలను మాడ్చే వేసవి పోయిందంటే ఇల్లూ వళ్ళూ అంతా బురదమయం జేసే వానలు వచ్చాయి ఆకసం నిరంతర మేఘాచ్ఛాదితమై వుంటున్నది గ్రీష్మతాపాలలో ఎండి నెరియలువారిన వసుధహృదయం ఆ వానలతో శమించి ఆ ఆనందాతిరేకంతో పొట్ల, చామంతి, మందార, గులాబి, మాలతీ పుష్పాలను విరబూసింది

కాని బీటలువారిన మాధవి హృదయంపై వానలు కురిసి కుసుమించే దెన్నడో.

ఇందిర స్కూల్ ఫైనలు పరీక్ష పాసైంది, మంచి మార్కులతో.



"అన్నయ్య ఎంత ఆనందించునో ?" అంటూ కంట తడి పెట్టింది ఇందిర. ప్రతి ఒక్కరినీ అదే బాధ కలచివేసింది.

"కాలేజీలో చేర్పిద్దాం" అంది మాధవి.

"నీ ఇష్టం" అంది జానకమ్మ.

"చదువుకుంటాను" అంది ఇందిర సంతోషంగా.

కాని రఘు అన్నాడు "వద్దు వదినా. చదువు ఇంతటితో ఆపించేద్దాం"

"ఏం?" కొంచం ఆశ్చర్యంగానే అడిగింది మాధవి

ఇందిర ముఖం చిన్నబోయింది

రఘు బాధపడ్తూ చెప్పాడు "చదువంటే నాకూ యిష్టమే వదినా. కాని మన అనుభవాలను బట్టి చూస్తే ఇప్పుడు ముందు పెళ్ళి ముఖ్యం అన్పిస్తూంది. అన్నయ్య ఆదేశం కూడా అదేగా? మన గత చరిత్ర ఎవరికీ తెలియకముందే జరిపిస్తే బాగుంటుం దనుకుంటాను"

అందరూ అంగీకరించారు ఇందర బాధపడినా పైకి కన్పింపనీయలేదు "నీ యిష్ట మన్నయ్యా" అంది ఆతడి వాదన సమంజసమే మరి

## 60

శ్రావణమాసపు పేరంటాంద్రతో వీధు లన్నీ కలకల లాడసాగాయి.

జానకమ్మ మాధవినికూడా నోము నోచుకొమ్మంది. మాధవికికూడ నోము నోచుకోవా లనే వుంది కాని నోచుకొంటే పదిమందినీ పేరంటానికి పిలవాలి. ఖర్చు సంగతి అటుంచి అనేక ఆరాలు తీస్తారు ఆ వచ్చినవాళ్ళు పూర్వాపర చరిత్ర లన్నీ చర్విత చర్వణ మవ్వక మానవు. ఫలితంగా రాకపోకలలో గౌరవ మర్యాదలలో మార్పు తథ్యం. తన ఆలోచన లన్నీ పైకి తెలియనీయలేదు మాధవి "ఎందుకు లెండి, రోజూ చేసుకుంటూనే వున్నానుగా పూజ" అంది. జానకమ్మ మరి బల వంతం చేయలేదు

శ్రావణ శుక్రవారం, వరలక్ష్మీవ్రతం ఇంటింటా తోరణాలు కట్టి లక్ష్మీదేవిని ఆరాధించే ఇల్లాండ్రు, కన్యలు, అత్తవార్లు తెచ్చిన శ్రావణ పట్టీలను చూచుకొని మురిసిపోతూన్న నూతన వివాహితలు, భర్తల సౌభాగ్యాలకొరకు నోములు నోచే స్త్రీలు ఆంధ్ర మహిళ లందరకూ అతి ముఖ్యమైనది ఈ శ్రావణమాసం

ఆకస మంతా దట్టమైన మేఘాలతో ఉంది, ఈదురుగాలి వీచి చెట్ల నూపివేయ సాగింది వర్షం విపరీతంగా కురిసి ఆగిపోయింది పగలంతా సాయంత్ర మైంది. అప్పుడుకూడ అప్పుడప్పు డొక్కొక్క జల్లు పడుతూనే వుంది అయినా అది పేరంటాండ్ర కేమాత్రం ఆటంకం కలిగించలేకుండావుంది చక్కటి దుస్తులలో ముస్తాబై ఆ బురద వీధులలోనే హడావుడిగా ఆనందంగా తిరుగుతున్నారు. వారిని గవాక్షందగ్గర నిలచి తిలకించసాగింది మాధవి - తన పుట్టిల్లూ, వదిన సరోజిని నోములు నోచుకోవడం, తమ యింట్లో ఆర్భాటంగా జరిగిన పేరంటములూ అన్నిటినీ గుర్తుకు తెచ్చుకుంటూ,

అదె సమయంలో రఘు ఊరినుండి వచ్చాడు.

"వదినా ఇల్లు అమ్మకమైపోయింది ఏడువేల అయిదువందలు వచ్చింది" అని చెప్పాడు

"సంతోషం "

"బ్యాంక్‌లో వేసేద్దామా ?"

"అలాగే "

"చేతిలోడబ్బురెడీగా వుండిగనుక సంబంధాల విషయం చూస్తాను త్వరలో కుదుర్చుకొని కానిచ్చేయవచ్చు "

"అవును "

శ్రావణపూర్ణమి దొడ్లో అరుగుమీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇందిరా, మాధవీ జానకమ్మా

"రెండు శుభవార్తలమ్మా" అంటూ వచ్చాడు రఘు

ఆశగా చూచారు ముగ్గురూ

"నాకు గవర్నమెంట్ హాస్పిటల్‌లో ఉద్యోగం వచ్చింది రెండు - ఇందిరకు చక్కటి సంబంధం వస్తూంది. వరుడు ఎక్కడో లెక్చరర్ అట చాలా మంచివాడట రేపు సప్తమినాడు చూచుకోడానికి వస్తారు "

పాడ్యమి, విదియ, తదియ .....ఒక్కోరోజు గడిచినకొద్దీ అందరికీ గుండెలలో రైళ్ళు పరుగెత్తసాగాయి వచ్చినవారు ఏమి అడుగుతారో, కుటుంబ విషయాలు ఏమి ఆరా వస్తాయో అని.

అనుకున్నరోజు రానేవచ్చింది ఏ విధమైన లోపం రాకుండా శక్త్యానుసారం అతి మర్యాదలు జరిపారు పెండ్లివారుకూడ సంతుష్ఠులైనట్టే కన్పించారు.

రెండు కుటుంబాలు వియ్యమందబోయే సందర్భంలో ఒకరి విషయాలొకరు క్షుణ్ణంగా తెల్సుకో ప్రయత్నించడం సబబే

"మీ రన్నదమ్ము లెందరండీ ?" అడిగారు

రఘు చెప్పాడు "ఇద్దరం "

"మరి రెండో ఆయన ?"

ముందే ఆలోచించి పెట్టుకున్న జవాబు రకీమని చెప్పేశాడు రఘు. "సెలవు దొరక్క రాలేదండీ పెండ్లికి వస్తాడు మా వదిన వచ్చిం దిప్పుడు. చూశారుగా."

"ఏం ఉద్యోగం ? ఎక్కడ ?"

చెప్పాడు రఘు

"ఆ ఊళ్ళోనా ? పే రేమిటండీ ?" ఉత్సుకతతో అడిగా డతడు.

"చక్రపాణి !"

"చక్రపాణా !" ఒక్కసారి నివ్వెరపోయా డా వ్యక్తి

రఘు గుండెలలో రైళ్ళు పరుగులెట్టాయి

"ఆయన పోస్టుకే ఇప్పుడు నన్ను బదిలీ చేశా రా కాలేజీకి" అంటూ నిష్క్రమించా డా పెండ్లికుమారుడు

అంటే ? తమ కుటుంబవిషయా లన్నీ అతడికి వివరంగా తెలుసునన్నమాట ! ముందుగా ఫలానా అని తెలియక అంతవరకూ వచ్చాడు

ఆలోచించాడు రఘు. ఇక ఎవరైనా ఇలాగే మాట్లాడతారేమో! ఏది దారి? 'ఇద్దరన్నదమ్ము' లంటే పెద్దవాడేడి-అనడుగుతారు ఇద్ద రాడపిల్ల లంటే ఇంకొకతె ఎక్కడున్న దంటారు ? చెప్పక తప్పదు. పని చెడిపోక మానదు మరి ? ఒకటే దారి. అన్నదమ్ములు లేరు ఒకడినే ఒక్కతే చెల్లెలు అని చెప్పి పని సాధించాలి అవసరార్థం అబద్ధ మాడక త ప్ప దు మరీ ముక్కుకు సూటిగా పోవాలంటే అన్నయ్యలాగే బాధపడి చుట్టూవున్న అందర్నీ కూడ బాధపెట్టాలి ఒక్కడినే అని చెప్పటానికి-అన లా ఊహ వ స్తేనే గుండెలు పిండిన ట్లౌతుంది కాని తప్పదు '

ఈసారి తేలికగానే కుదిరింది ఇందిరకు సంబంధం. ఎనిమిది వేల కట్నంతో నిర్ణయమైంది పెండ్లికుమారెకు ఒక్క అన్న. తల్లి తప్ప మరెవరూ లేరని చెప్పారు బిందు వారి కంటపడకుండా జాగ్రత్తపడింది పెండ్లికుమారుడు గొప్ప రచయిత ఏదో ఉద్యోగం కూడ చేస్తున్నాడు చాలా అభ్యుదయ భావాలు గల యువకుడు కట్నం తలిదండ్రులకు కాని అతడి కా పట్టింపు లేమీ లేవు అసలు కుటుంబ విషయా లన్నీ తెలిసినా లెక్కజేసుకోనంత సహృదయుడు '

అందరూ సంతోషించారు అంత చక్కటి వ్యక్తి ఇందిరకు భర్తగా లంభిచినందుకు. ఇందిర హృదయంలో వేయి జ్యోత్స్నా కాంతులు వెల్లివిరిశాయి ఊహా జగతిలో తేలిపోయింది

భాద్రపద శుద్ధ పంచమినాడు వివాహ ముహూర్తం పెండ్లి సన్నాహాలు చురుకుగా సాగుతున్నాయి ఒక వంక వివాహమనే సంతోషం మరొక వంక అదృశ్యులైన కుటుంబవ్యక్తు లిద్దరిగురించీ - వారు లేకుండా జరుపుకొనవలసివచ్చిన ఆ శుభకార్యం గురించీ గుండెలు దహించివేసే బాధ

సుముహూర్త దినం రానే వచ్చింది మగపెండ్లివారు బంధు మిత్రాది సపరివారంతో విచ్చేసి విడిది చేసి వున్నారు రఘు బంధువు లెవర్నీ పిలువలేదు అంత



"నాకు తెలుసు మిస్టర్ మూర్తీ, నువ్వు ఆఫీసు టైం కంటే పదినిమిషాలు ముందొచ్చావు, కాని అది ఆగిపోయి అరగంటయింది."

---

చెప్పుకోదగిన బంధువులు లేరు కూడా ఒక్క అనంతయ్య కుటుంబం మాత్రం వచ్చారు, భారీఎత్తున పెండ్లి బహుమానాలు తెచ్చి

ఆ రాత్రే ముహూర్తం ఇందిర పెండ్లికుమార్తె అయ్యింది. మనస్సు సంతోషంగా వుంది 'ఇది అక్కయ్యకు కావలసిన పెళ్ళి, నేను చేసుకుంటున్నాను. అక్క ఎక్కడ వున్నదో, ఏం బాధలు పడుతున్నదో! లేక సుఖంగానే వుందేమో?' రకరకాల ఆలోచనలు ఆ సంతోషాన్ని అణచివేస్తున్నాయి.

జానకమ్మ కడుపుకోత సంగతి వేరే వర్ణించాలా? ఇటు సంతోషసమయం, అటు కొడుకు కోసం, కూతురు కోసం వర్ణింపరాని బాధ

రఘు మాటిమాటికీ గదిలోకి పోయి కండ్లు తుడుచుకొని తనకు తానే ధైర్యం చెప్పుకొని సాంత్వన పరచుకొని తిరిగి వచ్చి పనులలో లీనమైపోతున్నాడు. చెల్లెలికి పెళ్ళి చేస్తున్నా ననే సంతోషమే కాని ఆ సంతోషంలో పూర్తిగా లీనం కాలేకపోతున్నాడు. ఒక రెక్క విరిగిన పక్షి ఆకాశాని కెట్లు ఎగురగలుగుతుంది? అన్నయ్య చేయవలసిన కన్యాదానం, నేను చేయవలసివచ్చింది. ఈ బాధ ఒకరికి అర్థమయ్యేది కాదు. వర్ణించడానికి మాటలు దొరకవు.

ఇక బిందు! ఆమె మనస్సులో రేగుతూన్న విచారసాగర కల్లోలంతో ఏ సముద్రపు ఉప్పెనా కూడ సరిపోలదు. తన ప్రణయం, వివాహం, మూడునాళ్ళ ముచ్చటైన సంసారం అన్నీ ఒక్కసారిగా మనోపథంలో అల్లిబిల్లిగా అల్లుకుపోయి పిచ్చెక్కిపోయేట్టు చేస్తున్నాయి.

సుముహూర్త సమయం సమీపించింది. పెండ్లి వారిని విడిదినుండి పెండ్లికి తీసుకురావడానికి పెద్ద సన్నాహంతో వెళ్ళినవా రంతా వాడ ముఖాలతో ఇల్లు జేరి కూలబడిపోయారు. బాజాలు మ్రోగనేలేదు. కారణం విడది అంతా ఖాళీ! ఎవరో మహానుభావులు అసలు విషయం వారి చెవిని వేశారు. అంతటి ఉదార భావాలుగల పెండ్లి కుమారుడూ కూడ ఆ అప్రతిష్ట చరిత్రను సహించలేకపోయాడు!

లోకంలో మంచిచేసేవారు అరుదుకాని, చెడు ఎవరైనా చేయగలరు! ఎవరో ఆప్తబంధువు మరణానంతరం విషాదమేఘం అలముకున్న గృహంలాగా ఒక్కసారి పెండ్లి ఇల్లంతా సందడి దూరమై సంతోష రహితమై, భయంకర విషాద నిశ్శబ్దాలతో వెలవెల బోయింది. అసలు కుదరకపోతే ఏ బాధాలేదు; కాని, కుదిరి పీటలవరకూ వచ్చినపెండ్లి చెడిపోవడం సామాన్యమైన అవమానమా? 'నా సంతానానికి సంతోషం లేదు. ఈ పాపం, లోపం నాలోనే వున్నాయి.' అని ఆత్మనింద చేసుకోకుండా వుండలేకపోయింది జానకమ్మ.

అంతటి గుండెధైర్యంగల డాక్టరు రఘు చెల్లెల్ని అక్కున జేర్చుకొని కన్నీరు మున్నీరుగా విలపించాడు.

మాధవి మౌనంగా ప్రాణరహిత ప్రతిమలాగా నిలబడిపోయింది. దెబ్బమీద దెబ్బ తగుల్తూంటే కాయకాచి మోటువారిపోవడం సహజం!

"పోనీండి దౌర్భాగ్యుడు. అంత విచార మేమిటి; మనఇందిర కేం, అందాలబొమ్మ, సుగుణరాశి" అన్నాడు అనంతయ్య. "రత్నాన్ని సువర్ణాభరణంలోనే పొదగాలి కాని ఇత్తడికి దాని విలువేంతెల్సు? ఇందిరను నా రెండవకోడలిగా స్వీకరిస్తాను."

అందరి వదనాలూ ఆనందంతో ఉదయకమలాలలా వికసించాయి కేశవరావు సంతోషంగా అన్నాడు. "అవును. వివాహం ఈ ముహూర్తానికే జరిపించేద్దాం పనులు ఆపవద్దు లేవండి అందరూ."

జానకమ్మ ఆనందాతిరేకంలో మాటే ఆడలేకపోయింది

ఈ సమస్య ఇంత తేలికగా పరిష్కారమైనందుకు రఘు ఏ విధంగా అనంతయ్య కుటుంబానికి కృతజ్ఞత తెల్పుకోవాలో తెలియక చేతనారహితంగా, మౌనంగా నిలబడిపోయాడు

మాధవి తన కోపాన్నీ ? అభిమానాన్నీ తాత్కాలికంగా వెనక్కునెట్టింది తన అత్తవారి కుటుంబానికి తనవల్లా తన పుట్టింటివారి వల్లా ఏదో ఒక శుభమూ, మేలూ అయినా జరిగితే అంతే చాలనుకుంది ముఖ్యంగా ఇందిరను ఈ అవమాన సంఘటన నుండి రక్షించాలంటే అదేమార్గం ఇక ఆమెకు పెండ్లి అయ్యే దెలా ? తండ్రిలో గలిగిన పరివర్తనకు లోలోపలే అంజలి ఘటించింది

మెల్లగా తలెత్తి అడిగింది నారాయణరావును ఉద్దేశించి, "ఏం అన్నయ్యా, నీ కిష్టమేనా ? నాన్నగారి ఆజ్ఞకు జడిసికాక, ఏదో కష్టంలో వున్నవాళ్ళను ఆడుకుందా మనే జాలితోగాక, ఒక ఉత్తమురాల్ని స్వీకరిస్తున్నా ననే భావంతో హృదయ పూర్వకంగా చేసుకో అలా కాకుంటే ఆమెకూ నీకూ కూడ సంతోషం కొరవడు తుంది."

చిరునవ్వుతో అన్నాడు నారాయణ "అటువంటి అనుమానాలు వద్దు బిందూ, రూపగుణాలు రెండింటిలోనూ ఇందిర మన యింటికి తగినది అదే నాకు ప్రధానం నేను మనఃపూర్వకంగా అంగీకరిస్తున్నాను "

బిందు ఆదిలక్ష్మి వైపు తిరిగింది ''అమ్మా ను వ్వేమంటావ్ ? నువ్వు మనః పూర్వకంగానే అంగీకరిస్తే కాని ఈ వివాహం జరుగదు వధూవరు లెంత సహృదయులైనా పెద్దల ఆశీర్వాదబలం లేనిదే వాళ్ళ జీవితాలు సాఫల్యాన్నందవు సంతోషప్రదం కాజాలవు ఇందుకు నా జీవితమే నిదర్శనం తర్వాత నీ యిష్టంతో ఆ లేత హృదయాన్ని బాధించి వాళ్ళ జీవితాల్ని నరకం చేయడంకంటె ముందే నీ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా చెప్పు ''

ఆదిలక్ష్మి వచ్చీరాని కన్నీటిని కొనగోటితో తుడుచుకుంది "నా తెలివి తక్కువతో ఇక్కడికి ఈతెచ్చిన అనర్థాలు చాలు ఇంకా అంత బుద్ధిలేకుండా ప్రవర్తిస్తానా? నేనూ, నా తమ్ముడూ కలిసి నీకూ నీ అత్తవారికీ చేసిన అపకారాన్ని ఈ ఉప కారంతోనైనా కొట్టివేయనియ్యి, బిందూ "

''అందరూ నన్ను క్షమించండి." ఇందిర గంభీరమైన మాటలకు అందరూ ఉలిక్కిపడ్డారు. "మీ అందరికీ ఇష్టమైనా ఇది నా క్షేమం లేదు."

అంతా నివ్వెరపోయారు.

ఇందిర మెల్లగా అంది." ఇది అవమానమే కాని తట్టుకోగలను. ఇంతకంటె అవమానాలు జరిగిపోయినా తట్టుకున్నాం కదా ? మీ అల్లుడైనందుకే అన్నయ్యను



అవమానించారు. మీ శ్యాం వల్లనే మా కుటుంబానికి మాయని మచ్చ వచ్చింది. అటువంటి మీ ఇంటికే మళ్ళీ అభిమానం చంపుకుని కోడలుగా రాలేను. 'లేచిపోయిన వాడి చెల్లెలు, లేచిపోయిన దాని చెల్లెలు!' ఇదేగా ప్రస్తుతం నా కున్న బిరుదు? లోకం దృష్టిలో వాళ్ళిద్దరూ అంత చులకనై పోతే, నేను వచ్చి మీ భవంతిలో ఆనందంగా గడపగలనా? మీకూ మాకూ సరిపడదు. క్షమించండి."

"ఇందూ నా మాట విను," అనునయించబోయాడు రఘు.



"వద్దన్నయ్యా, ఏమీ ఆజ్ఞాపించకు. ఈ ఒక్క విషయంలోనూ నన్ను క్షమించండి అన్నయ్యను పొమ్మన్న ఇంట్లో నేను వెళ్ళి కాపురం చెయ్యలేను," అంటూనే తన గదిలోకి పోయి తలుపు బిగించుకుంది.

ఇక ఎవ రేం చేయగలరు? విరిగిన మనసు తేలికగా అతుక్కోదు.

## 61

భాద్రపదంతో బాటు అతి వృష్టి కూడా వెనుక బట్టింది ఆకసం నిరంతరం మేఘావృతమై వుండడం తగ్గింది, నిర్మేఘమైన దిశాంతరాళంలో తరచు సూర్యా దర్శనం అవుతున్నది. వీధులలో బురద తగ్గింది, వానలకు పైకి వచ్చి అరచే కప్పలూ, కీచురాళ్ళూ తగ్గాయి. చిరుచలి ఆరంభ మైంది

బొండుమల్లెలు విరిసినట్లు, శ్వేత వస్త్రధారిణి అయిన ప్రకృతి కాంత జ్యోత్స్న సుధాభాండం చేత ధరించి లోకముపై వెదజల్లుతున్నట్లు, నభో మండలము నుండి శార్వరీ సుధా వర్షములు కురియుచున్నట్లు, పాలకడలి అలలు తరగలు తరగలుగా వచ్చి లోకమును ముంచెత్తినట్లు కౌముదినీ ప్రియ-శరత్కాల మేతెంచింది

శారదాకాశం ప్రతిఫలించి, నీల నదీ నిర్ఝరాలు ధవళ దీప్తిమంత మయ్యాయి. ప్రేమికుల గుండెలలో వెన్నెలలు విరిశాయి.

తిమిరాచ్ఛన్నమైన మాధవి హృదయంలో వెన్నెలలు కాసే దెప్పుడో ?

దసరా పండగ వచ్చింది, వెళ్ళింది

శోకాంధబంధురమైన ఆ కుటుంబంలో తిరిగి పండగ జరిగే దెప్పుడో ? కడుపు శోకంతో, అవివేక ప్రవర్తనకు ఫలిత మనుభవిస్తూ క్రుగ్గిపోయే తల్లి, భర్తృ వియోగంతో అలమటించే కోడలు, ఇతరుల తప్పిదాలకు తాను ఫలితం అనుభవిస్తూ అటు విద్యకూ, ఇటు వివాహానికీ కూడ దూరమై మూగవేదన అనుభవిస్తున్న కుమార్తె, అన్ని బాధలతో, బాధ్యతలతో సతమత మౌతున్న కుమారుడు ఎవరికి వారే మూగగా, నిర్లిప్తంగా మొక్కుబడిగా బతికేస్తున్నారు రాను రాను అది ఆనంద, వినోద, సంతోష వాతావరణ పూరితమైన సంసార గృహ లక్షణాలకు దూరమై, రాగద్వేష రహితమై - ఆహ్లాద ఆడంబరాలకు దూరమైన ప్రశాంత నిర్జీవ ఆశ్రమంగా రూపొందసాగింది

ఒకరోజు ఇందిర మెల్లగా రఘు దగ్గరకు జేరి అడిగింది "అన్నయ్యా, ఒక్క అభ్యర్ధన. కాదని త్రోసివేయవుకదా !"

"ఏమిటో చెప్పమ్మ నాకు కాకపోతే ఇంకెవరికి చెప్తావు నీ కోరికలు ?"

"పెద్దకోరి కేం కాదనుకో...నేనూ, వదినా ఉద్యోగాలు చేద్దా మనుకుంటున్నాం "

రఘు నెత్తిన పిడుగుపడ్డ ట్లయింది ఏం ? ఎందుకొచ్చిం దా ఆలోచన ? నేను బ్రతికేఉన్నానుగా ?"

ఆ కఠిన సమాధానంతో ఇందిర కంటతడి పెట్టింది "నువ్వంత కష్టపెట్టుకుంటా వనుకోలే దన్నయ్యా బొత్తిగా నిస్తబ్ద వాతావరణం భరించలేక, ఇరుగూ, పొరుగూతో స్నేహం కలిపినా ప్రయోజన ముండదు తీరికూర్చుని అమ్మలక్కలు చేసే సంభాషణ లెలావుంటాయో నీకు తెల్సు మనిషి కన్పించేసరికి అమ్మ ఇంటి విషయా లన్నీ చెప్పేసి ఏడ్చేసి గుండె తేలిక చేసుకున్నా ననుకుంటుంది కాని ఎదుట సానుభూతి చూపించినవాళ్లే చాటున పరిహసిస్తారు అందరూ స్నేహానికి పాత్రులుకారు అంచేత అసలు ఎవరూ వచ్చే అవకాశమే కల్గించటంలేదు మేము "

"నిజమే "

"కాని ఇలా ఏకాంతంగా వుంటే అసలే బాధగా వుంటుంది వదిన మరీ అవే ఆలోచనలతో ఆనాటి కానాడు కృంగి కృశించిపోతూంది కాస్త ఏదో ఒక మంచి వ్యాపక ముంటే... "

"అందుకా ?" రఘునుండి ఒక్క నిర్జీవహాసం వెలువడింది "కాని నువ్వను కున్నట్టు చదువుకున్నవాళ్ళమధ్యా, ఉద్యోగస్థులమధ్యా నువ్వు కోరిన సుఖశాంతులు లభించవు ఎదురు అనేకసమస్యలు మట్టుకుంటాయి చదువుకూ, సంస్కారానికీ చాలా దూరం "

ఇందిర మరి తర్కించలేదు

దీపావళి ! ఇంటింటా ఆనందతోరణాలు కట్టింది ఆ ఇంట్లో మాత్రం దీపాలు వెలగలేదు ఊరంతా ప్రతిధ్వనించిన ఆ టపాకాయల ప్రేలుడు మాధవి గుండెలనే ప్రేల్చివేసింది ఆ మతాబాల, చిచ్చుబుడ్ల కాంతులు చూచి ఊరంతా ఉత్సాహంగా వుంటే, ఆ మంటలు చూచి మాధవి మది రకరకాల ఆలోచనలతో మండిపోయింది నిరుడు దీపావళి ఎంత అందంగా గడపింది అప్పుడు లోకమూ, మంచీ చెడూ ఏమీ తెలియదు తనకు ఆనాడు తమ భవనం విద్యుద్దీపాల తోరణాలతో ఎంత అందంగా వెలిగిపోయింది. ఆనాడు ఇంట్లో తానుఒక్కతే ఏ ఏడెనిమిదివందల ఖరీదు చేసే మందుగుండుసామగ్రి కాల్చింది వదినను ఏడిపిస్తూ, చిన్నన్నయ్యతో పోటీ పడుతూ, అమ్మచేత సన్నసన్నగా చివాట్లు తింటూ పెద్దన్నయ్యా వాళ్ళందరూ అభయ హస్త మిస్తూంటే ఎంత అల్లరిచేసేది ? ఏమిటి ఆనాటికీ ఈ నాటికీ తేడా ? ఒక్క

ఏడాది గడిచింది. ఈ ఒక్క సంవత్సరంలోనే ఎన్నిమార్పులు ! అధికమైనది ఒక్క వత్సరమే. అయినా అధికమైనవి అనేక అనుభవాలూ, ఆలోచనలూ. ఇక ఎప్పటికీ ఆ సంబరమూ, సంతోషమూ తిరిగిరావు.

నాగులచవితినాడు జానకమ్మ పుట్టలో పాలు పోయడానికి వెళ్తూ ఇందిరను తోడు రమ్మంది.

రఘు అన్నాడు. "నువ్వుకూడా వెళ్ళు వదినా. కాస్త నలుగురిలోనూ కలియడం నేర్చుకో. మరి నాల్గుగోడలమధ్య క్రిగ్గుళ్ళిపోకు. కాస్త ఆలోచనల మార్పైనా వుంటుంది అలా వెళ్తే."

అతడన్నట్టే కాస్త తాత్కాలికోపశమనం కలిగింది మాధవి హృదయానికి. ఊరుచివర పొలాలలోకి వెళ్ళి ఆ పాముపుట్టలో పాలు పోయడం, రకరకాల భక్తులను చూడడం కాస్త ఆనందదాయకంగానే వుంది. తాను ఇదివరలో లెక్కలేకుండా చేసిన అనేక సరదా ప్రయాణాలూ, పిక్నిక్‌లూ గుర్తుకు వచ్చాయి.

ఇంటికి తిరిగి వచ్చేసరికి రఘు ఊరు వెళ్లాడని తెలిసింది.

"ఎవరికీ చెప్పకుండా ఏమి టీ హఠా త్ప్రయాణం ? ఏవూరు ? ఎవరి మటుకు వారే ఆశ్చర్యపోయారు. అనుమానంతో తల్లడిల్లిపోయారు.

మూడురోజుల తర్వాత తిరిగివచ్చిన రఘు అతిబలవంతంమీద చెప్పాడు. "నాగుల చవితినాడు మీరలా వెళ్ళాక నాకు ఉత్తరం వచ్చింది. రాజమండ్రిలో ఓ స్నేహితుడి దగ్గరనుంచి. అన్నయ్య ఏదో హత్యానేరం మోపబడి పోలీస్ కస్టడీలో ఉన్నట్టూ, రోజూ కోర్టులో విచారణ జరుగుతున్నట్టూ......

"హా !" వింటూనే మూర్ఛపోయింది మాధవి.

అందరూ బేజారెత్తిపోయారు. అంతటి డాక్టరై వుండీ రఘుకు కాళ్లూ, చేతులూ ఆడలేదు. ఇందిర పరుగున పోయి కమల అనే లేడీడాక్టర్‌ను తీసుకువచ్చింది. రఘుతోబాటు జనరల్ హాస్పిటల్‌లో ఉద్యోగం చేస్తూన్న దవడంవల్ల పిలువగానే వచ్చింది కమల.

మాధవి ఆ మూర్ఛనుండి సునాయాసంగానే కోలుకుంది. కమల వెళ్ళిపోయింది.

ఏడుస్తూన్న వదినను ఓదార్చుతూ అన్నాడు రఘు, "పూర్తిగా వినకుండా ఖంగారు పడతా వేమిటి వదినా? అతడు అన్నయ్య కాదని నా అనుమానం."

"మరి నీకు కన్పించలేదా ?" అడిగింది ఇందిర.

లేదు. అత డెవరో అన్నయ్య పోలికలో ఉన్నాడని అనుమానపడి నా స్నేహితుడొక ప్లీడరు వ్రాశాడు. కాని నేను వెళ్ళేప్పటికే కేసు ఋజువు కాక విడుదల



చేసేశారట. అత డెవరో పే రేమిటో ఎవరికీ తెలియదట. అత డసలు దేనికీ నోరు విప్పి సమాధానమే చెప్పలేదట. ఒక రైలుపెట్టెలో ఒక స్త్రీశవం ఉందట. అదే కంపార్టుమెంట్‌లో నిద్రపోతున్న అతడిని అనుమానంమీద అరెస్టు చేశారట.

ఎవరో మరి ధర్మదాత, ఒక ప్లీడరుగారు అయాచితంగానే అతడి తరపున వాదించి నేరం తీయించేశారట."

"ఎవరైతేనేం, పోనీలే చల్లగా వున్నాడు" అంది జానకమ్మ.

"మరింక అతడికోసం నీవు వెదకలేదా అన్నయ్యా ?"

"వెతికాను కాని కన్పించలేదు అయినా అటువంటి పట్టణాలలో ఎక్కడని ఎవరని దొరుకుతారు ? మన భ్రమకాని అన్నయ్యలాంటి మనిషి నేరాలు చేయడం కూడానా ?"

పేలవభావంతో అంది మాధవి "నేరాలు చేయరు కనుకనే బాధ లనుభవిస్తున్నారు మాట్లాడటమే చేతకాని నిర్దోషిత్వాన్ని వాదనతో రుజువు చేసుకో లేని వ్యక్తి ఈ లోకంలో మీ అన్నయ్యే కాని ఇం కెవరు ఉంటారు ? నాకు గట్టిగా ఆయనే నని అనుమానంగా వుంది "

చక్రపాణి ఆరోజుననే క్రొత్తగా అంతర్ధానమైనట్లుగా విలపించారు కుటుంబ మందరూకూడ విలపించడం ఊరుకోవడం తప్ప చేయగలిగే దేముంది ? కొంత సేపు ఏడవడం, తిరిగి విధిగా కాలగమనంలో లీనమైపోవడం మామూలే

## 62

కార్తీక పౌర్ణమి సముద్రస్నానం చేసేవారి కెవరికో ఒకస్త్రీ శవం దొరికిందని తెచ్చి హాస్పిటల్‌లో అప్పగించారు కాని ఆమె కింకా జీవం వుండడం చూచి త్వరత్వరగా వచ్చి ఆమెకు స్పృహ తెప్పించే ప్రయత్నంలో నిమగ్ను లయ్యారు డాక్టర్లు

అప్పుడే మధ్యాహ్నం డ్యూటీలోకి వచ్చిన డాక్టర్ రఘునాధరావు విషయం విని ఆత్రంగా అటు నడిచాడు డాక్టర్ కమల ఆ స్త్రీవిషయం చూస్తూంది మరొక ఇద్దరు డాక్టర్లూ, హౌస్ సర్జన్లూ, నర్సులూ ఆమెకు సాయపడుతున్నారు

"మే ఐ హెల్ప్‌యూ మిస్ కమలా ?'' అంటూ తన సహజధోరణితో వెళ్ళిన రఘు ఒక్కసారిగా మౌనం దాల్చాడు పని హడావిడిలో నున్న ఎవరూ అతడిని గమనించలేదు అలా అయిదు నిముషాలు చూచి మెల్లగా అక్కడి నుండి వెళ్ళిపోయాడు రఘు

పర్మిషన్ తీసుకుని వెంటనే హాస్పిటల్ వదలిపెట్టి పోయిన రఘు ఏమీ తోచని వాడిలా కాస్సేపు అటూ ఇటూ తిరిగి కన్పించిన సినీమాటాకీస్‌లో ప్రవేశించాడు. కొంత సేపు కూర్చున్నాక అక్కడా మనసు నిలువక లేచి ఇంటికి వచ్చాడు.

వస్తూనే గదిలోకి పోయి తలుపులు బిగించుకున్న అతడి విషయ మేమిటో ఇంట్లో ఎవరికీ అర్థం కాలేదు. రాత్రి ఏడు గంటలకు గది బయటకు వచ్చిన అ త డి వదనం ఎంతకాలంనుండో అన్నపానాలు లేనివాడి ముఖంలా శుష్కించి వుండడం చూచి తల్లీ వదినా కూడ కలవరపడ్డారు.

"భోజనానికి రా బాబూ. అలా ఉన్నావేం ?" అనడిగింది మాధవి.

"వస్తాన్లే. ఏమీ లేదు," అంటూనే మళ్లీ ఎక్కడికో వెళ్లిపోయాడు.

అందంగా వుంది ప్రకృతి. ఒక వంక ఎగసిపడ్తూన్న సముద్ర తరంగాలపై రమ్యంగా నాట్యమాడ్తూన్న చంద్రకిరణాలు. తరంగ మాలికను మృదువుగా ముద్దిడుతూన్న మందమారుతం. నల్వంకల శార్వరీ కాంతిలో సౌందర్యా లొలుకబోస్తూన్న వాలుకా రాశి. పైన తారామండల పరివేష్ఠితుడైన పూర్ణ శశాంకునితో గర్వపడుతూన్న వినీలాకాశం.

చంద్ర కిరణోజ్జ్వలమై, అద్వితీయ - వర్ణనాతీతమైన సౌందర్యా న్నొలుకబోస్తూన్న ఆ ఆనందమయ ప్రకృతిని ఆస్వాదించలేక బాధపడ్తూన్న రఘు "మిస్టర్ రఘూ" అనే సున్నితమైన సంబోధనకు చకితుడై చూచాడు. కొద్ది దూరంలో డాక్టర్ కమల ! చేతులు వెనుకకు వాల్చి కాళ్ళు కొంచం ముందుకు చాపి కూర్చుంది, తననే చూస్తూ.

లేని నవ్వు తెచ్చుకుంటూ లేచి వెళ్ళి ఆమెకు కొద్ది దూరంలో కూర్చున్నాడు రఘు.

"ఏమి టలా ఉన్నారు ?" అడిగింది కమల.

"ఏం లేదండీ ? ఎలా వున్నాను ?"ఎదురు ప్రశ్నించాడు రఘు.

కమల మాట్లాడలేదు. తిరిగి కొంతసేపు నిశ్శబ్దంగా వున్నారు.

శరత్కౌముది పొందు నంది ఉఙ్ఞూత లూగుతూన్న ఆ సముద్ర కెఱటాలను చూస్తూ సాధారణ విషయం అడిగినట్టు అడిగాడు రఘు.

కమల అతడిని నిశితంగా చూచింది. "మీ రట్లా ఆందోళనగా వచ్చేశా రేమిటి మధ్యాహ్నం? ఆ అమ్మాయిని మీ రెరుగుదురా ?"

ఉలిక్కి పడ్డాడు రఘు. నివ్వెరపాటుతో మాట్లాడలేక పోయాడు.

తిరిగి కమల అంది :

"నేను మిమ్మల్ని గమనించలే దనుకున్నారు మీరు, కాని నేను చూచాను."

"ఊఁ," నీరసంగా మూలిగాడు రఘు.

"ఆ అమ్మాయి మీ చెల్లెలా ?"

తుపాకి దెబ్బలా తగిలింది కమల ప్రశ్న రఘుకు. "అని చెప్పిందా? ఆ పిల్ల చచ్చి పోలేదూ ? బ్రతికిందా ?" గబగబా ఆందోళిత స్వరంతో అడిగేశాడు.

అదొకమాదిరిగా నవ్వింది కమల. "ఏం? మీరు చచ్చిపోవా లనికోరుకున్నారా?"

"..................."

గంభీరంగా అంది కమల. "చావలేదు, బ్రతికింది. కాని నా కామె చెప్పలేదు. పోలికలను బట్టీ, మీ ప్రవర్తనను బట్టీ ఊహించాను. అయితే ఆవిడ మీ చెల్లెలేనా?"

ఇక రఘుకు చెప్పక తప్పలేదు. "అవును. చెల్లెలే, చెల్లె లని చెప్పుకోకూడని పని చేసిన చెల్లెలు."

కొంత సేపు మౌనం ఆవరించింది.

"అయితే ఆమె ఎట్లా వుందో ఏమో – ఏమీ తెల్సుకోవాలని లేదా మీకు ? " అనడిగింది కమల.

"లేదు."

"ఎంత కఠినులు !" అంది కమల.

"అవును. కాని ఈ కఠినత్వ మేర్పడడానికి పూర్వగాధ వినండి...ఏడెనిమిది నెలల క్రిందట మా అన్నయ్య పెళ్ళి ఒక లక్షాధికారి కుమార్తెతో జరిగింది......"

సంగతి అంత విన్న కమల ఒక బరువైన నిశ్వాసం విడిచింది. "నే నొక కథ చెప్తాను వింటారా ? "

"ఏమి టది ? "

" ఒక లక్షాధికారి ఉన్నాడు. మరొక లక్షాధికారి ఏకైక కుమార్తెను వివాహ మాడాడు. ఆమె సౌందర్యాన్నీ, విద్యా వినయాలనూ మెచ్చి చేసుకున్నా డని అను కున్నారు లోకులు. కాని అంతర్నాటకం ఎవరికీ తెలియదు. ఆ లక్షాధికారి లోపలి బండారం అంతా అప్పులమయం. అందుకని వెదకి వెదకి మరొక పెద్ద ఆస్తిమీద చెయ్యి వేశాడు. అతడి కున్న దుర్వ్యసనాలకు అంతులేదు. పరమ భోగలాలసుడు. అందుకు ఎంత ధనమున్నా చాలదు. ఒక్కసారిగా ఆ స్తినంతనూ మామగారు ఎటూ చేతిలో వుంచడు. అందుచేత పుట్టింటినుండి ధనం తెమ్మని నిత్యం భార్యను యాతనలు పెట్టేవాడు.

"మొదట తెలియక, తర్వాత మొహమాటంతో, ఆపైన భయంతో చాలా కాలం అతడి ఆటలు సాగించింది భార్య. కాని రానురాను విసిగిపోయింది. తెగ తెంపులు చేసుకుందామంటే అప్రతిష్ట, భయం – ఇటు ఒక పిల్లకూడా పుట్టింది. జీవి తాన్ని చే జేతులా అంతం చేసుకుందా మన్నా మనసు ఒప్పదు. అటు భర్త ఏ

నిముషానైనా ఆస్తికోసం ఆమె ప్రాణాలను తీయడానికి కూడా సిద్ధంగావున్నాడు. ఆటువంటి పరిస్థితిలో ఆమెకు తట్టినది ఒకటే ఉపాయం — బిడ్డకోసం ముందు జాగ్రత్త. తండ్రివల్ల తనకు సంక్రమింపబోయే ఆస్తి అంతా — తానున్నా లేక పోయినా పూర్తిగా తన కుమార్తెకు దక్కేట్టు వ్రాసేసింది......."

"తర్వాత ?" జాప్యం భరించలేకపోయాడు రఘు.

కమల నిట్టూర్పుతో మొదలుపెట్టింది. "ఆటువంటి విషయాలు ఆట్టేకాలం రహస్యంగా వుండవుగా ? దానితో అతడి కోపం తారస్థాయి నందుకుంది. కోరికలు తీరని కక్ష, కట్టుకున్న భార్యనే హత్య చేయించింది."

"ఆఁ !"



"అవును. కాని అత డొక జమీందారు. అనేక సంస్థలకు గౌరవాధ్యక్షుడు. విరాళా లిచ్చిన దాత. పెద్దమనిషి. అతడిపై హత్యానేరం మోపబడలేదు. అసలు హత్య అనే సంగతే బయటకురాలేదు. కాని అందరికీ తెల్సు, జరిగిన విషయం అతడికేం ? నిక్షేపంలా మళ్ళీ వివాహం చేసుకున్నాడు. అన్నీ డబ్బు కోసమే అయినా ఎవరూ ఏమీ అనలేదు. చనిపోయేవరకూ కూడ ప్రముఖ రాజకీయవేత్తా, ఉదారుడూ, పెద్దమనిషీ, దేశభక్తుడూ, అనేక సంస్థల పోషకుడుగా ఆ త డి పేరు దశదిశలా మారుమ్రోగిపోయింది. అతడివారు కాని, పైవారుకాని అతడిని నీచుడూ జారుడూ చోరుడూ అని నిందించలేదు – వెలివేయలేదు. ఎక్కడ సభ అయినా సమావేశ మైనా, ఏ ఘనకార్యం జరిగినా అతడు వెళ్ళి సన్మానా లందుకొని ఆయా సభలను రక్తిగట్టించనిదే వాటికి ముక్తీ, మోక్షమూ వుండేదికాదు. అతడి మరణంతో దేశం ఒక అమూల్య రత్నాన్ని కోల్పోయిం దని అందరూ విలపించారు ఇప్పటికీ అతడి వర్ధంతికి జయంత్యుత్సవాలను అతిఘనంగా జరుపుకుని భక్తివిశ్వాసాలు ప్రకటిస్తున్నారు ప్రజ."

"ఇంతకూ ఎవ రాయన ? ఎందుకు నా కిది చెప్పారు మీరు ?"

"ఏమో ఎందుకు చెప్పానో కొంచం ఆలోచించండి."

"ఎవ రాయన ?" రెట్టించాడు రఘు.

జాగ్రత్తగా, ధైర్యం చిక్కబట్టుకు వినండి......మా నాన్నగారు !"

"ఆఁ ?" తిన్నగా సర్దుకుని నిటారుగా కూర్చున్నాడు.

"కాని ఇంతటి ఘనవ్యక్తి కుమార్తెనూ వివాహ మాడటాని కెవరూ ముందుకు రావడం లేదు. ఎంచేతా ? కారణం, అందరికీ తెల్సు. మరి ఈ జయంతులూ వర్ధంతులూ ఏమి టంటారు ?"

"........." అప్రతిభుడై చూస్తున్న రఘునుండి సమాధానం రాలేదు.

"చెప్తాను వినండి, ఈ లోకం–ఏదీ–మీరు జడిసిపోతున్న ఈ లోకం ఎంత తెలివైనదో అంత గ్రుడ్డిదీ, తెలివి తక్కువదీ కూడా. అది ప్రేమించేది నిజంగా వ్యక్తినీ, గుణాన్నీ కాదు. ధనాన్నీ, పేరునూ, పతిష్ఠనూ, అంతే. వాళ్ళని గడ్డి పోచలలా తీసిపారేశాను నేను. ఎవడో నన్ను పెళ్లాడ ననే దేమిటి ? ఈ సంస్కారం లేని ఇడియట్స్ నాకే అక్కర్లేదని నే నీ మార్గం ఎన్నుకున్నాను."

"పని ఉన్నంత సేపూ పని. ఆ రోగులకు నా ధర్మం గుర్తించి బాగా వైద్యం చేస్తాను. తర్వాత ఏదో వినోదాలు, సినిమాలు, షికార్లు వుండనే వున్నాయి. అలా ధైర్యంగా మనకి మనం బ్రతకాలి, కాని ఒకడి లెక్కేమిటి ?"

"మీరు చాలా ధైర్యవంతులే!" ఆశ్చర్యంగా మెచ్చుకోలుగా అన్నాడు రఘు

"అవును అలాగా వుండాలి ఆదీకాక, మీ రేమనుకున్నాసరే ఒక విషయం చెప్తున్నాను-మీరు స్వార్థపరులే తెలివి తక్కువవాళ్ళే.''

"అంటే!" అభిమానంగా ప్రశ్నించాడు

"ఇప్పుడు మీ అన్నయ్య తిరిగివస్తే పొమ్మంటారా ?"

"ఎందుకూ ? ఆతడు చేసిన దేమిటి ? '

"ఏమో, మనం చూడవచ్చామా? కాని మీరు ఆతడిని పరమానందంతో ఆహ్వానిస్తారు నెత్తిన ఉంచుకు పూజిస్తారు, కాని ఆయన ఈ మధ్యకాలంలో నీతి నిజాయితీలతో ప్రవర్తించా రని నమ్మక మేమిటి ?"

"అన్నయ్య అటువంటివాడు కాదు "

"పోనీ, కాదనుకుందాం కాని ఆ కాకపోవడానికి కారణా లేమిటి? ఆ త డు పురుషుడు-బలవంతుడు గనుక కాని దైవం స్త్రీలను అబలలనూ, పరాధీనలనూ చేశాడు కదా? ఆమె పతనావస్థకూ ఆమె గుణానికీ సంబంధ ముండకపోవచ్చు రెండవ విషయం - ఎంత చదివినా ఎన్ని నేర్చినా మనం ఇంకా ఆ సనాతన దౌర్భాగ్యస్థితిలోనే ఉండడం ఒకే నేరం చేసిన స్త్రీనీ పురుషునీ ఒక విధంగా చూడం పురుషుడి తప్పుల్ని ఎన్నరా దన్నట్లు, అది అతడి జన్మ హక్కైనట్లు భావిస్తాం ఇందుకు మీ తండ్రిగారి మా తండ్రిగారి చరిత్రలే నిదర్శనం అవాళ చెడిపోయిన మీ చెల్లెలు చావా లని కోరుకున్నారు మీరు కాని మీ తండ్రిగారు బ్రతికున్న రోజులలో ఎప్పుడైనా ఆయనను అలాగ కోరుకున్నారా ?"

రఘు తల వాల్చాడు

"అలా గనుకోరు 'అత డెలాగైనా బాగుపడా' లనుకుంటారు అలాగే స్త్రీ విషయంలో కూడ క్షమాగుణం ప్రదర్శించగల సంస్కారం అలవడిననాడే మనం నిజమైన విద్యావంతులం, నాగరికులం "

" "

"అదీకాక మీ చెల్లెలు చిన్నపిల్ల ఏమీ తెలియనిది క్షమించి దరిజేర్చుకోవలసిన బాధ్యత మీపైన వుంది తెలిసిచేసిన తప్పు శిక్షార్హమైనది, కాని తెలియక చేసినది దయా-క్షమార్హం "

అప్పటికీ రఘు మాట్లాడలేకపోయాడు

# సౌఖ్యానికి సేతువులు

పంచవర్ష ప్రణాళికలవల్ల ఆర్థిక ప్రగతికి రాచబాట ఏర్పడింది ఆర్థిక స్వయంపోషకత్వానికి పునాది పడింది వ్యవసాయం జీవితమైతే, పరిశ్రమలు జీవిత సౌఖ్యానికి సేతువులు పొలాలలో ఆరకలు సాగితే, ఫ్యాక్టరీలలో మరచక్రాలు తిరిగితే జాతిప్రజల జీవితం పచ్చ పచ్చగా వుంటుంది సుఖప్రదమైన జీవితాన్ని సాధించడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం అవిరళంగా కృషి చేస్తున్నది

మూడో ప్రణాళికలో పరిశ్రమల కోసం ఖర్చు 16 72 కోట్లు రాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్ వారు హెచ్ డి , యల్ డి ఇన్సులేటర్ల నిర్మాణాన్ని, సమన్విత గాజు పరిశ్రమనూ, బాల్ బేరింగ్స్ పరిశ్రమనూ పిగ్ ఐరన్ పరిశ్రమనూ చేపట్టి నిర్వహిస్తున్నారు

లఘు పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్ వారు రు 65 లక్షల విలువగల ముడి పదార్థాలను సేకరించి పరిశ్రమదారులకు వాటిని కంట్రోలు ధరలకు అందించారు

రు 20 కోట్లు ఖర్చుతో స్థాపించిన సింథెటిక్ మందుల ఫ్యాక్టరీ, రు 35 కోట్లతో స్థాపించిన హెవీ ఎలక్ట్రికల్స్ ఫ్యాక్టరీ – యీ రెండు బృహత్పరిశ్రమలు కేంద్ర ప్రభుత్వరంగంలో మన రాష్ట్రంలో స్థాపించబడినవి వీటివల్ల త్వరలోనే మన రాష్ట్ర ఆర్థికరంగంయొక్క రూపురేఖలు మారిపోయాయి హిందూస్థాన్ యంత్ర పరికరాల సంస్థయొక్క ఐదవ విభాగం, డిఫెన్స్ ఎలక్ట్రానిక్స్ ఫ్యాక్టరీ కూడా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో నెలకొల్పా లని నిశ్చయం జరిగింది

**ఆశాజనకమైన భవిష్యత్తులోకి**
**ప్రగతి పథాన పయనిద్దాం.**

ఆం ప్ర పౌ స శాఖ

# దేశ రక్షణ



# దేశాభివృద్ధి



## రెండూ రెండు ముఖ్యాంగాలు

దేశ రక్షణకృషికి మరింత బలాన్ని చేకూర్చడానికి ప్రతిగ్రామానికి ఒక వ్యవసాయోత్పత్తి కార్యక్రమాన్ని రూపొందించుటకు చర్య తీసుకొనబడింది.

ఆహారోత్పత్తి విధానాన్ని సమన్వయ పరచడానికి, వ్యవసాయోత్పత్తులను అధికము చేయడానికి అనువుగా ఉన్నత స్థాయిలో కేంద్ర వ్యవసాయోత్పత్తిమండలి స్థాపించబడింది. ప్రస్తుత అత్యవసర పరిస్థితిలో దేశ రక్షణావసరాలకు కావలసిన వివిధ వ్యవసాయోత్పత్తులను పెంచడానికి, అతిముఖ్యమైన వాటిని మాత్రమే దిగుమతి చేసుకోవడానికి, తద్వారా విదేశీ మారక ద్రవ్యాన్ని కూడ పెట్టడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

మనోవాక్కాయ కర్మల వ్యవసాయోత్పత్తులను పెంచడానికి,అమలు జరిపే కార్యక్రమాలలో శాయశక్తులా పాల్గొనండి



ప్రణాళికలతో
ముందుకు
సాగిపోదాము

**దేశ రక్షణ కృషికి**
**ఇతోధికముగా తోడ్పడండి**

"చూడండి. మా అమ్మ విషయంలో మీరు సానుభూతి కనబరిచారు. మీరేమిటి? అటువంటి స్త్రీల విషయంలో లోకమంతా సానుభూతి వర్షిస్తుంది; కాని ఎందు కా శుష్క ప్రదర్శనలు. అటువంటి పరిస్థితిలో వున్న చాలమంది స్త్రీలు చావలేక సుఖజీవితం కోసం దారి తప్పుతారు. అప్పుడు కారణం ఆలోచించకుండా ఈ ప్రపంచమే వారిని విమర్శిస్తుంది......ఒక్క మాట చెప్తున్నాను: మనకు సంస్కారమే, మన అసమర్థతా పిరికితనాలే మన అప్రయోజకత్వానికి కారణాలు. ఇందుకు లోకాన్నీ సంఘాన్నీ అడ్డుపెట్టుకోనక్కర్లేదు."

"ఇదంతా మీతో ఊరకనే చెప్పాను కాని ఆ అమ్మాయి నా కేం బరువుకాదు. నావద్దనే ఉంచుకుంటాను. మీరు బెంగపడకండి."

"ఏమిటి? మీ ఇంట్లో ఉందా?"

"అవును, మెలకువ రావడంతోనే 'న న్నెందుకు బ్రతికించా' ర ం టూ ఆ అమ్మాయి ఏడుపు సాగించింది. అది ఆత్మహత్యా ప్రయత్న మని తెలియగానే సర్జన్ వచ్చి పోలీసులకు తెలియపర్చుతా నన్నారు. కాని నేనే నచ్చజెప్పి ఆపు జేశాను."

"ఎలా? మీ మాట ఆయన విన్నారా?"

"విన్నారులెండి. నా సంగతి ఆయనకు తెల్సు. జీవితంపై రోసి అన్ని మార్గాలూ కట్టుబడిపోయి, అంతకన్నా హీనస్థితికి దిగజారిపోకుండా అంతలోనైనా ఆ జీవితాన్ని ముగింపదల్చుకుంటారు. ఈ బలవన్మరణానికి ప్రయత్నింపజేసే విరక్తిదశ ఎంత దయనీయమైనది? జీవనమాధుర్యం కొరవడి చేజేతులా మరణం కొని తెచ్చుకుంటున్నవారిని బ్రతికించి, వారికి మార్గం చూపించాలే కాని తిరిగి కఠోరత్వం ప్రదర్శించి, ఆ జీవితాన్నంతా బాధించడం ఏం మంచిది చెప్పండి? ఆమాటే ఆయనతో అన్నాను. పాపం దయతో అంగీకరించారు."

"కమలా!" కృతజ్ఞతతో కరచాలనం చేశాడు రఘు. "నడవండి. మా చెల్లెల్ని నాకు ఇవ్వండి, మీకు సదా కృతజ్ఞుడిని. నాలోని మూర్ఖత్వాన్ని పారద్రోలారు."

శరత్పూర్ణిమ హృదయంలోని అజ్ఞానాంధకారాన్ని పారద్రోలి సంస్కారతైలంతో జ్ఞానదీపికలను వెలిగించి ఆశాజ్యోత్స్నలను వెల్లివిరిపింప జేసినట్లే అయింది.

[సశేషం]

Printed and Published by A. Sudhakar Rao from Yuva Press, 5-9-88, Public Garden Road, Hyderabad-1. Controlling Editor Sri "CHAKRAPANI"

# యువ ప్రచురణలు

| | | |
|---|---|---|
| అత్తగారి కథలు (కథలు) | భానుమతీ రామకృష్ణ | 2-50 |
| గడ్డురోజులు నవల | కుటుంబరావు | 1-50 |
| వరప్రసాదం | .. | 1-25 |
| కాలభైరవుడు | .. | 1-25 |
| నిలవనీరు | .. | 1-25 |
| నీకేం కావాలి | .. | 1-25 |
| మొండివాడు | .. | 1-00 |
| కులంలేని మనిషి | .. | 1-00 |
| అరుణోదయం | .. | 1-00 |
| మారుపేర్లు | .. | 1-00 |
| పాతమంగలి | చక్రపాణి రచన | 1-25 |
| పాంచజన్యం | .. | 1-25 |
| శిథిలాలయం | శ్రీ. శ్రీ. గోపీచంద్ | 1-75 |

ఏజంట్లకు 25% కమిషన్ ఇవ్వబడుతుంది. పైకం ముందుగానే పంపాలి. V. P. పద్ధతి లేదు.

## యువ కన్సర్న్స్


బి-1-194, సైఫాబాదు,

హైదరాబాదు-4.



ప్రణయకోపం

